# మహిళా...పిడికిలి బిగించు

చైతన్య మానవి

సంపాదకీయం..

ఐద్వా 12వ రాష్ట్ర మహాసభలు పోరాటాల పురిటిగడ్డ అయిన ఖమ్మంలో దిగ్విజయంగా జరిగాయి. మూడు రోజులపాటు అత్యంత ఉత్తేజభరితంగా సాగిన ఈ మహాసభలు దోపిడి, పీడన,అణచివేతకు సంబంధించిన మౌలిక అంశాలపై దృష్టి సారిస్తూనే, సమాజానికి నేడు పెనుసవాలుగా మారిన భ్రూణహత్యలపై సమరభేరి మోగించింది. కుల, మత ఛాందస వాద శక్తుల అండతో సాగుతున్న కుల దురహంకార హత్యలను ఖండించింది. అసంఖ్యాక ప్రజానీకాన్ని కుంగదీస్తున్న అధిక ధరలు, ఆహార భద్రత, ప్రజారోగ్యం, విచ్చలవిడి మద్యం అమ్మకాలు, నిర్వీర్యమవుతున్న ప్రజాపంపిణీ వ్యవస్థ, డ్వాక్రా, మైక్రోఫైనాన్స్ వంటి పలు సమస్యలపై పోరుకు సన్నద్ధమైంది. మహిళలు ఎదుర్కొంటున్న అన్ని సమస్యలపై సమగ్ర దృష్టితో నిర్దిష్ట కార్యాచరణతో ఐద్వా ముందుకు వచ్చింది.

విధాన నిర్ణయాల్లో భాగస్వామ్యం కోసం చట్టసభల్లో 33 శాతం ప్రాతినిధ్యం కల్పించేందుకు మహిళా రిజర్వేషన్ బిల్లు రాజ్యసభ ఆమోదించి 16 మాసాలు గడిచినా లోక్‌సభలో ప్రవేశపెట్టలేదు. 5 నెలల క్రితం జరిగిన అసెంబ్లీ ఎన్నికల ఫలితాలు చూస్తే 824 మంది శాసనసభ్యుల్లో 72 మంది (9%) మాత్రమే మహిళలు. తక్షణం మహిళా రిజర్వేషన్ బిల్లు రావాల్సిన అవసరాన్ని పై వివరాలు తెలియజేస్తున్నాయి.

నూతన ఆర్థిక విధానాలతో దేశంలోకి చొచ్చుకు వస్తున్న సామ్రాజ్యవాదాన్ని అరికట్టడంలో ప్రభుత్వం పూర్తిగా విఫలమైంది. ఒకవైపు పెరుగుతున్న ధరలు, మరోవైపు తరుగుతున్న నిజ ఆదాయాలు పేద మహిళల జీవన ప్రమాణాలను దిగజార్చుతున్నాయి. ప్లానింగ్ కమిషన్ లెక్కల ప్రకారం పట్టణాల్లో రోజుకు 20 రూ॥లు, గ్రామాలలో 15 రూ॥లు మాత్రమే ఆహారంకై ఖర్చు పెట్టగల పేదలు ఏరకమైన పోషకాహారం తీసుకోగలరు?

దేశవ్యాప్తంగా ఆడపిల్లల జననాలు తగ్గుతున్నాయి. పెరుగుతున్న శాస్త్ర సాంకేతిక ప్రగతి సమాజాన్ని పురోగమనం వైపు కాకుండా, తిరోగమనం దిశగా తీసుకెళుతుందని సర్వత్రా ఆందోళన వ్యక్తమవుతోంది. లింగనిర్ధారణ పరీక్షల అనంతరం ఆడపిల్లలను వద్దనుకుంటున్న ఈ పెట్టుబడిదారీ సమాజం అసలు ఆడపిల్లలు పుట్టకుండ ఏం చెయ్యాలనే దానిపై కూడా పరిశోధనలు చేస్తోంది. అమలుకు నోచుకోని భ్రూణహత్యల నిరోధక చట్టం కాగితాలకే పరిమితమైంది.

మహిళలపై అత్యాచారాలు, హత్యలు, లైంగిక హింస కొత్త రూపాలలో, కొత్త కోణాలలో సమాజం ముందుకు వస్తోంది. నేడు ఆడపిల్లలకు పుట్టే హక్కుతోపాటు జీవించే హక్కు కూడా కాలరాయబడుతోంది. అమ్మాయిల ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా ప్రేమించాల్సిందిగా వేధించేవారి సంఖ్య పెరుగుతోంది. ప్రేమించడం తప్పుకాదు. కానీ ప్రేమ ముసుగులో వేధించడం, అంగీకరించకపోతే చంపడం, మరియు చావడం క్షంతవ్యంకాదు.

మహిళా సాధికారత అంటూ ప్రగల్భాలు పలికే కిరణ్ ప్రభుత్వం మహిళాభివృద్ధికి నిధులు కేటాయించకుండా నిర్లక్ష్యం చేస్తోంది. మహిళలకు సంబంధించిన విధానాలు, ప్రణాళికల రూపకల్పనలోనూ అలసత్వం చూపుతోంది. రాబోయే కాలంలో మహిళలు ఎదుర్కొంటున్న పలు సమస్యల పరిష్కారానికి విస్తృత ఉద్యమాలకు ఐద్వా రాష్ట్ర మహాసభల్లో రూపకల్పన జరిగింది. మహిళా ఉద్యమ దిక్సూచిగా ఐద్వా సాగుతోంది.

స్త్రీల సమస్యల పరిష్కారానికి, పాలకుల మెడలు వంచడానికి సాగే ఉద్యమంలో నేను సైతం అంటూ మహిళా....పిడికిలి బిగించు.

చైతన్య మానవి

ఈ సంచికలో...




**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం**

రాష్ట్ర కార్యాలయం, బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్:

2,1-8-1, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్

ఫోన్ : 27605845, ఫ్యాక్స్ : 040 - 27605845

సంపాదకులు

**ఎస్. పుణ్యవతి**

సంపాదక వర్గం

మల్లు స్వరాజ్యం

అల్లూరి మన్మోహిని

టి. జ్యోతి

కె. స్వరూపరాణి

మేనేజర్

**ఎం. సుధ**

**విరాళం రూ : 10/-**

ప్రజాశక్తి డైలీ ప్రింగ్‌ప్రెస్, హైదరాబాద్ - 500 020

ఫోన్: 27665420


# స్వేచ్ఛ



కొనదానికి అంగడి వస్తువు కాదమ్మా స్వేచ్ఛ
ఇమ్మనడానికి దయా దానం కాదమ్మా స్వేచ్ఛ
ఎవరిస్తారమ్మా స్వేచ్ఛ
ఎవరిస్తారమ్మా స్వాతంత్ర్యం
అభ్యసించు విద్యని
అందుకో విజ్ఞానాన్ని
నేర్చుకో ఒక వృత్తిని
సంపాదించుకో ధనాన్ని
పెంచుకో ఆత్మస్థైర్యాన్ని
రక్షణకై నేర్చుకో మార్షల్ ఆర్ట్‌ని
అంగబలం పెంచుకో
అర్థ బలం పెంచుకో
నీ వీధిలో నీ పేటలో
నీ ఊరిలో ఒకతివై
అందరితో ఒకరివై
అందరిలో ఒకరివై
మార్చుకుంటే నీ జీవన గమ్యాన్ని
వస్తుందమ్మా స్వేచ్ఛ నీ శిరమున కిరీటమై

-ముద్దాలి లక్ష్మి

# మైక్రో ఫైనాన్స్ అభివద్ధి/ నియంత్రణ బిల్లు -2011

జమున/పి.ఎ. దేవి



మైక్రోఫైనాన్స్ అభివృద్ధి నియంత్రణ బిల్లు 2011ను కేంద్ర ప్రభుత్వం వచ్చే పార్లమెంటు సమావేశాలలో ప్రవేశ పెట్టాలని భావిస్తున్నది.

పరిచయంలోనే "బ్యాంకు హస్తాల విస్తరణ"గా మైక్రోఫైనాన్స్ సంస్థలను పేర్కొన్నారు. జాతీయ బ్యాంకుల గ్రామీణ శాఖలను మూతవేసి వాటి సేవలు గ్రామీణ పేదలకు అందనీయకుండా చేసిన నేపథ్యంలోనే సూక్ష్మరుణ సంస్థలు విజృంభించాయనీ వందల ప్రాణాలను బలికొన్నాయని మనం జ్ఞాపకం చేసుకోవాలి. ఇపుడు ప్రత్యక్షంగా చట్టపరంగానే గ్రామీణ పేదలను సూక్ష్మరుణ సంస్థలకు అప్పగించే ప్రయత్నం ఈ బిల్లు మొదటి వాక్యంలోనే కనబడుతున్నది.

ఈ బిల్లు సూక్ష్మరుణ సంస్థల అభివృద్ధి/నియంత్రణ బిల్లుగా పేర్కొన్నారు. అభివృద్ధి, నియంత్రణ రెండూ విరుద్ధ అంశాలు. ఈ రెండు కత్తులు ఏ సందర్భంలోనూ ఒక వరలో ఇమడవు. అలా ఇమడాలని చూస్తున్నామంటే ఆ రెండింటిలో ఏదో ఒక దానికి ఆచరణలో తిలోదకాలివ్వాలని ఆలోచిస్తున్నట్లే. దుర్మార్గమయిన పద్ధతుల్లో దారుణంగా పేదలను దోపిడీ చేస్తున్న సూక్ష్మరుణ సంస్థలను అసలు ఎందుకు అభివృద్ధి చేయాలి? జాతీయ బ్యాంకు లేదా ఇదే ప్రయోజనం కోసం ఏర్పరచిన గ్రామీణ బ్యాంకు నాబార్డుకు ప్రాధమ్య రంగం నిధులు, విదేశీ పెట్టుబడులు యిచ్చి పేదలకు సూక్ష్మ రుణాలు యిస్తే........ఆ వచ్చే వడ్డీని తిరిగి పేదల కొరకు వాడవచ్చుగదా! దానికి భిన్నంగా ఈ బిల్లులో ఎక్కడా సూక్ష్మరుణ సంస్థల నియంత్రణ లేకపోగా ప్రతిపదం వారు ఇష్టం వచ్చినట్టు వ్యవహరించడానికి ఆస్కారం కలిగించేదిగా ఉంది. పేదల డబ్బుతో ఎవరో వ్యక్తులకు వేలకోట్లు దఖలు పరచడానికి మాత్రమే ఈ బిల్లు ఉపయోగపడుతుంది.

ఈ బిల్లులో ఎక్కడా సూక్ష్మరుణ సంస్థల బారినుండి పేదలను మహిళలను కాపాడేందుకు అవసరం అయిన వాక్యం ఒక్కటి కూడా లేదు. పేదలకు రుణ సౌకర్యం కలిగించడానికి సూక్ష్మరుణ సంస్థలకు (ఎంఎఫ్ఐలకు) అనుకూలత కలిగించడం ఉద్దేశ్యమని బిల్లు ప్రస్తావనలోనే ఉంది. ఈ వాక్యం పేదలకు బ్యాంకు రుణాలు ఇప్పిస్తామని ప్రభుత్వం చేసిన వాగ్దానాన్ని ఉల్లంఘించడం కాదా? ఎంఎఫ్ఐలకు నిధులు బ్యాంకు రుణాలు ఇచ్చే బదులు ప్రభుత్వం ఆపని నేరుగా ఎందుకు చేయదు?

ఎంఎఫ్ఐలు కేవలం చిన్న రుణాలు ఇవ్వడమే కాక ఇతర విధులు కూడా నిర్వహిస్తాయని బిల్లు చెబుతున్నది. అందులో ఒకటి పొదుపు చేయించడం. ఆ పొదుపు డబ్బును ఈ సూక్ష్మరుణ సంస్థలకు అప్పగించాలి. ఆ డబ్బుతో వారేమయినా చేయవచ్చు. షేరు మార్కెట్టులో పెట్టుబడులు పెట్టవచ్చు. పేదల పొదుపు సొమ్ముపై ఎంఎఫ్ఐలకు పూర్తి అధికారం ఉంటుంది. గతంలో ఇట్లా షేర్లు కొని ప్రతి సంస్థా 4,5 వేల కోట్ల లాభం చేసుకుని షేరుకు డబ్బులిచ్చిన పేదలకు మొండిచెయ్యి చూపారు. అసలు పొదుపు సొమ్ము అనేది ఒక బృందం...వారి తక్షణ అవసరాలు/ చిన్న చిన్న అవసరాలు/ లేదా కొన్ని అత్యవసర ఇబ్బందుల్లో వాడుకోవడానికి చేతికి అందుబాటులో ఉంచుకునే సొమ్ము. బృందంలోని వారందరికి ఒక రకం అయిన భద్రత. అది వారి మధ్యనే చలామణీ కావల్సిన సొమ్ము. అటువంటి సొమ్మును ఎంఎఫ్ఐలకు పెట్టుబడిగా వారి నియంత్రణకు ఇవ్వడం అంటే దానర్థం స్త్రీలకు ఇపుడు లభించే కాస్తంత వెసులుబాటు కూడా లభించదనేగదా!

రెండో విధి పెన్షన్లు అందించడం. అంటే అభయహస్తం పథకం ఎంఎఫ్ఐలకు ధారాదత్తం చేస్తారా! లేక వితంతు, వృద్ధాప్య, వికలాంగ, వృత్తిదార్ల పెన్షన్లు కూడా ఎంఎఫ్ఐల ద్వారా అందచేస్తారా? భవిష్యత్తులో అదే జరగనుంది. అంటే

ప్రభుత్వం పెన్షన్ల బాధ్యత నుండి తప్పుకోవడానికి ఇది ఒక అడుగు.

మూడో విధి ఇన్సూరెన్సు/ భీమా సేవలు. అసలు ఎంఎఫ్ఐలు భీమా ఎందుకు చేయించాలి. అది తప్పనిసరి ఎందుకు? ఎంఎఫ్ఐలు వేలకోట్లు భీమా కమిషన్‌గా పొందడానికే కదా! ప్రతీలోనుకూ ఒక భీమా చేయించాలి. ఒకే వ్యక్తి లేదా కుటుంబం తీసుకునే ప్రతిలోనూ భీమా అంటే ఒక ప్రక్క ఎంఎఫ్ఐ రుణ కిస్తీలు రెండోవైపు భీమా సొమ్ము... ఏ ఆస్తులూ లేని పేదలు చెల్లించగలరా?

తర్వాతది... డబ్బు/నిధులు చెలామణీ చేయటం అంటే ఎంఎఫ్ఐలో ఎవరయినా వారి డబ్బు పెట్టుబడి పెట్టవచ్చు. ఫెరా నిబంధనలు ఉండవు కనుక ఎటువంటి డబ్బు ఎంఎఫ్ఐలకు చేరే అవకాశం ఉంటుందంటే.. లెక్కల్లోకి... అంటే ప్రభుత్వ లెక్కల్లోకి రాని, రాకూడని నల్లధనం దొడ్డిదారిన ఎంఎఫ్ఐలో చేరి పేదల రుణాలయ్యి తెల్లగా మారుతుంది. అంటే ఎంఎఫ్ఐలకు హవాలా రాకెట్టు నడుపుకోమని అనుమతి ఇవ్వడం కాదా!

ఇంతేకాదు వారికి కోరిక పుట్టినపుడల్లా నియమనిబంధనల్లో మార్పులు చేర్పులు జరుగుతాయని కూడా బిల్లు పేర్కొంటున్నది. అంటే ప్రభుత్వంతో ఖాళీ చెక్కులపై సంతకం పెట్టించుకున్నట్టే గదా.

ఈ బిల్లునుండి డ్వాక్రా, డ్వాక్వా ఇతర స్వచ్ఛంద సంస్థలు చిన్న స్థాయిలో నడిపే పొదుపు బృందాలకు వాటి సూక్ష్మరుణాలకు మినహాయింపు ఉన్నట్లుగా కన్పిస్తుంది. కాని కాస్త నిశితంగా పరిశీలిస్తే ఈ బిల్లు ఆమోదం పొందిన మూడు నెల్లలోపు సూక్ష్మరుణాలు నడిపే వారంతా రిజిష్టరు చేసుకోవాలి. వారు కనీసపక్షంగా 5లక్షల రూపాయల రిజర్వు బ్యాంకు వద్ద ఉంచవలసి ఉంటుంది. అంటే ఇప్పుడున్న మాక్స్ సొసైటీలు, ఇతర చిన్న సంస్థలు తప్పుకోవాల్సి ఉంటుంది. ఎంఎఫ్ఐలంటే ఏమిటో చెప్పినపుడు మినహాయింపు ఇచ్చినట్టు చెబుతూ మళ్ళీ రిజిస్ట్రేషను క్లాజులో ప్రత్యేకంగా మినహాయింపు ఇవ్వకపోవడం పెద్దకుట్ర.

అసలు ఇప్పటికే ఈ సంస్థలన్నీ ఎన్‌బిఎఫ్‌సి (బ్యాంకు ఏతర ఆర్థిక లావాదేవీల చట్టం) కింద రిజిష్టరు అయ్యాయి. అదికూడా ఆర్‌బిఐకి చెందినదే. అంటే రెండేసి సార్లు రిజిష్టరు చేయాలా? ఎందుకు? ఎన్‌బిఎఫ్‌సి నిబంధనలు అన్నింటికీ వర్తిస్తున్నపుడు అసలీ కొత్త చట్టం అవసరం ఏమిటి? ఇపుడు డ్వాక్రా బృందాల ఉనికే తుడిచిపెట్టుకుపోయే ప్రమాదం ఉంది.

పైగా సిస్టమికల్లీ ఇంపార్టెంట్ అంటే వ్యవస్థీకృతంగా ప్రాధాన్యత కలిగిన ఎంఎఫ్ఐలకు ప్రత్యేక సౌకర్యాలు, ప్రత్యేక నియమాలు, ప్రత్యేక మినహాయింపులు ఇస్తామని ఒకటికి రెండుసార్లు బిల్లు వక్కాణిస్తుంది. అంటే 100 కోట్లకు పైగా వ్యాపారం చేస్తున్న ఎంఎఫ్ఐలు అని అర్థం... దీనికి ఎక్కడా బిల్లు వివరణ ఇవ్వదు. ఈ ఎంఎఫ్ఐలు కేవలం ఐదు. అంటే ఐదు సంస్థలకు సూక్ష్మరుణాలపై గుత్తాధిపత్యం లభించే ఏర్పాట్లన్నీ బిల్లులో ఉన్నాయన్న మాట.

ఇక దారుణమైన అసలు అంశం వడ్డీరేట్లు. ఈ సూక్ష్మరుణ సంస్థలను అదుపుచేయటం అంటే వడ్డీపై నియంత్రణ. కాని బిల్లులో సూక్ష్మరుణాలపై వడ్డీ, దానితోపాటు ఎంఎఫ్ఐల నిర్వహణా తదితర అనేక రకాల ఖర్చులు కూడా పేదల నుండి వసూలు చేసుకోవడానికి అనుమతి ఇస్తున్నది. కిస్తీల రూపంలో ఫ్లాట్‌రేటు అమలు చేయటం వల్లనే వడ్డీ 30 నుండి 60 శాతం దాకా వసూలు చేస్తాయి ఎంఎఫ్ఐలు. అసలు బిల్లులో ఎక్కడా ఫ్లాట్‌రేటు ప్రస్తావనే లేదు. దాన్ని నియంత్రించే ఆలోచనే లేదు.

అసలు, వడ్డీ వాయిదాల రూపంలో చెల్లిస్తున్నపుడు అసలు తగ్గుతుంది. దాంతోపాటే వడ్డీకూడా తగ్గాలి. అంతేగాని మొదటి కిస్తీ చివరి కిస్తీ ఒకే రేటయితే అప్పు పొందిన వారికి భారీ నష్టం ఉంటుంది. ఈ నిబంధన పెట్టలేదంటేనే దానర్థం ఈ బిల్లు ఎంఎఫ్ఐల నియంత్రణకు కాదు వాటి అభివృద్ధికే అని అర్థం అవుతున్నది.

అట్లాగే ఏసెక్యూరిటీ ఇచ్చినా/ ఇవ్వకున్నా అని బిల్లులో ఉంది. అసలు ఏ సెక్యూరిటీ ఇవ్వలేని పేదల కోసం ఎంఎఫ్ఐలు అని చెప్పిన దానికి ఇది విరుద్ధం. ఏ సెక్యూరిటీ లేకుండానే ఎంఎఫ్ఐలు రుణాలు ఇవ్వాలి. లేకపోతే సెక్యూరిటీలు పెట్టగలిగిన వారికి బ్యాంకులు రుణాలు ఇస్తాయిగదా ఎంఎఫ్ఐలు ఎందుకు? సెక్యూరిటీ క్రింద రైతుల నుంచి ఈ సంస్థలు తీసుకునిపోయిన పట్టాదార్ పాస్ పుస్తకాలకు ఇంత వరకూ అతీగతీ లేదు.

అట్లాగే డబ్బు రూపంలోగాని/ వస్తు రూపంలోగాని రుణం ఇవ్వవచ్చు... అని కూడా బిల్లు పేర్కొంటున్నది. సూక్ష్మరుణాలు ఇవ్వడం ద్వారా పేదలకు ఉపాధి కల్పించేందుకు ప్రయత్నిస్తున్నామనే ప్రకటనలు వట్టి బూటకం అన్నమాట. గతంలో మాదిరిగా బంగారం, టీవీలు ఇతర వినిమయ వస్తువులను రుణాలుగా పేదలకు ఇస్తాయన్నమాట. ఎంఎఫ్ఐలు బహుళజాతి సంస్థలతో ఒప్పందాలు కుదుర్చుకుని వారి వస్తువుల అమ్మకం ద్వారా కమిషన్లు పొంది వాటిని పేదలపై రుణ రూపంలో రుద్ది మళ్ళీ భారీ వడ్డీతో వాటి రవాణా ఖర్చులతోసహా అన్ని రకాల ఖర్చులనూ గోళ్ళూడగొట్టి మరీ వసూళ్ళు చేసుకుంటాయి.

ప్రభుత్వం ప్రజల కొనుగోలు శక్తి పెరిగిందని డంభాలు పలకొచ్చు. ఈ వినిమయ వస్తువుల కారణంగా వారిని దారిద్రరేఖ నుండి తప్పించి కార్డులు ఇతర పథకాలు సౌకర్యాలు ఇవ్వకుండా ఎగ్గొట్టొచ్చు. ఒక దెబ్బకి రెండు పిట్టలు. ఎంత అనుకూలం అయిన బిల్లు...ప్రభుత్వానికీ ఎంఎఫ్ఐలుకూ మ్యాచ్‌ఫిక్సింగ్ బాగా జరిగింది.

ఇంకా బిల్లులో మార్జిన్ అనేదానికి ఏ వివరణలు లేవు. నిర్వహణా ఖర్చుల పై కూడా నియంత్రణ లేదు. ఇపుడు ఎంఎఫ్ఐల కార్యనిర్వహణాధికార్లు (సిఇఓలు) ఏడాదికి మూడు కోట్లు జీతంగా తీసుకుంటున్నారు. అంటే నెలకు 35 లక్షలు తీసుకుంటున్న ముఖేష్ అంబానీకి సమానం అన్నమాట. అట్లాగే ఎంఎఫ్ఐలకు అనుకూలంగా మీడియాకు ఇచ్చే నిధులపైగాని, ప్రకటనలపైగాని వీరి దేశవిదేశీ పర్యటనా ఖర్చులపైగాని ఇతర ఖర్చులపైగాని అదుపు ఎక్కడా లేదు. ఏ పరిమితీ విధించలేదు. అంటే పేదల నుండి వసూలు చేసుకునే డబ్బును ఎంఎఫ్ఐల సిఇఓలు ఇతర్లు విచ్చలవిడిగా ఖర్చు చేయవచ్చన్నమాట.

వడ్డీ వ్యాపారం/ డబ్బు అప్పు ఇవ్వడానికి సంబంధించిన ఆర్‌బిఐ చట్టాలలోని అంశాలను ఆ పదాన్ని కూడా (మనీ లెండింగ్) ఈ బిల్లులో పేర్కొన్నారు. మళ్ళీ మరొకమాట ఎట్టి పరిస్థితుల్లో ఏ ఎంఎఫ్ఐ కూడా చేస్తున్న సూక్ష్మరుణ వ్యాపారం వడ్డీ వ్యాపార చట్టాల పరిధిలోకి రాదని పేర్కొన్నారు. అంటే పేదలకు ఎంఎఫ్ఐల వల్ల జరిగే నష్టం చట్ట పరిధిలోకి రాదని ఈ బిల్లు చెబుతున్నది.

ఏ మాత్రం రుణం పొందే వారి పట్ల పక్షపాతంతో వ్యవహరించినా ఈ ఎంఎఫ్ఐ పట్ల కఠిన చర్యలు తీసుకుంటామని

బిల్లు హెచ్చరిస్తున్నది. అంటే ఎంఎఫ్ఐలు రుణ సదుపాయం కలిగించే నిరుపేదలకు ఏమాత్రం జాలి చూపరాదు. ఇది ఎందుకంటే ఎంఎఫ్ఐలో ఒకటి రాయితీ ఇస్తే పేదలు దాని దగ్గరికి చేరతారు వడ్డీ తక్కువయిన ఎంఎఫ్ఐ రుణం తీసుకుంటారు. అపుడు మిగిలినవారు కూడా రాయితీ ఇవ్వాలి అంటే లాభాలు తగ్గుతాయి. అట్లా జరగకుండా నివారించడానికి ఈ క్లాజు పెట్టారు. తక్కువ వడ్డీతో సూక్ష్మరుణాలిచ్చే చిన్న సంస్థలన్నింటినీ రద్దు చేయడానికే ఈ క్లాజు ఉపయోగపడుతుంది. ఇది ఎంఎఫ్ఐల గుత్తాధిపత్యాన్ని వారి ఫ్లాట్‌రేట్ల శాసనాన్ని స్థిరీకరిస్తుంది.

ఈ బిల్లులో ఎక్కడా వడ్డీరేట్ల పరిమితినే కాదు.. వసూళ్ళకు ఎంఎఫ్ఐలు అనుసరించే పద్ధతుల్ని నామ మాత్రంగా కూడా ప్రస్తావించలేదు. వందలాది ఆత్మహత్యలకు ఈ పద్ధతులే కారణం.

మరి ఎంఎఫ్ఐకి పేదలకు తగాదాలొస్తే ఏంచేయాలి? అంటే వారు ఎంఎఫ్ఐ ఆర్‌బిఐ దగ్గర ఫిర్యాదు చేయాలి తప్ప వేరే ఎక్కడా చేయటం కుదరదు. అంటే ఫిర్యాదు దారు ముంబయికి పోతే తప్ప తనకు జరిగిన అన్యాయాన్ని చెప్పుకునే దిక్కులేదు. ఎవరీ ఫిర్యాదుదారు? బ్యాంకుకు షూరిటీ పెట్టే వనరుల్లేక ఎంఎఫ్ఐల జాబితాలోకి చేరిన వ్యక్తే- ముంబయి ఆర్‌బిఐలో ఫిర్యాదు చేయాలి. అహో ఈ బిల్లు పేదలకు ఎంత అనుకూలం అయినదో కదా? (ఎవరయినా ఫిర్యాదు ఘటన జరిగిన చోటకదా చేయ్యాలి చట్ట ప్రకారం)

ఈ బిల్లులో ఎక్కడా కూడా ఒక సంస్థ ఒక వ్యక్తి లేదా కుటుంబాలకు ఇచ్చే అప్పులపై పరిమితి లేదు. అప్పు మొత్తంపైన కానీ అప్పుల సంఖ్యపై గాని పరిమితి లేదు. అప్పు ఇచ్చాక అది తీరే వరకు మరోసంస్థ అప్పు ఇవ్వరాదనే నిబంధన లేదు. అంటే గతంలో మాదిరిగానే వారం రోజులో, రోజుకో సంస్థ అప్పు కిస్తీ వసూలుకు వస్తుంది. ఆ కుటుంబం ఒక సంస్థకు కట్టడానికి మరో సంస్థ దగ్గర అప్పుచేసి అట్లా అప్పుల సుడిగుండంలో చిక్కి.... చివరికి ఆత్మహత్యను ఆశ్రయిస్తారన్నమాట. దరిద్రుల నిర్మూలనకు ఇంతకంటే చక్కగా పనిచేసే పథకం మరొకటి ఉండదు. ప్రభుత్వం చేతికి ఎక్కడా రక్తం అంటదు.

ఎంఎఫ్ఐల అభివృద్ధి కౌన్సిల్ ఒకటి ఏర్పాటు చేస్తారట.. దానికి సూక్ష్మ రుణంలో ఆరితేరిన వ్యక్తిని అంటే గతంలో ఎంఎఫ్ఐలను నడిపిన వ్యక్తిని దానికి ఛైర్మన్‌గా కేంద్ర ప్రభుత్వం నియమిస్తుంది. ఈయన అప్పు తీసుకునేవారికి అనుకూలంగా ఆలోచించడం అసలు సాధ్యమా? కౌన్సిల్ అంతా నియామకాలే.... అంటే ఎంఎఫ్ఐల ప్రతినిధులు, ఆర్‌బిఐ వారు, సర్కారు ప్రతినిధులు కౌన్సిల్‌లో చేరి సూక్ష్మ రుణ సంస్థల అభివృద్ధికి ప్రత్యేక ప్రణాళికలు రాయితీలు రచిస్తారన్నమాట.

మరి ఎస్‌హెచ్‌జిల అభివృద్ధి..సూక్ష్మరుణ వితరణ రాష్ట్రానికో తీరుగా ఉంది కదా! మరి ఆయా రాష్ట్ర ప్రభుత్వాలకుండే హక్కులేంటి? అంటే ఏంలేదు. రాష్ట్ర సలహా మండలి నియమించవచ్చు... ఎవరితో? అంటే మళ్ళీ మామూలే....ఎంఎఫ్ఐల ప్రతినిధులు అధికారులు. మరి ఈ మొత్తంలో రుణం పొందే వ్యక్తికి ఎక్కడా స్థానం లేదు. అంటే కేంద్రం నుండి కింది ఊర్లో రుణం తీసుకునే దాకా అసలు వారికి అప్పు తీసుకొని చెల్లించడం లేకపోతే మరణించడం మినహా వేరే పాత్ర లేదు.

చివరికి రుణం పొందే వారికి చైతన్యం కలిగించే పని కూడా ఎంఎఫ్ఐలే చేపడతాయి. అంటే ఎంఎఫ్ఐలు తమంతట తాము స్వచ్ఛందంగా అప్పులు, వడ్డీలు, వాటి తిరకాసులు తమ కుట్రలు అన్నీ పేదలకు సవివరంగా చెబుతాయట. అహా ఎంత అశావాదం.

అట్లాగే స్వీయ నియంత్రణ సూత్రాలను కూడా ఎంఎఫ్ఐలు రూపొందించుకుంటాయట. ఇన్ని వందల ఆత్మహత్యల తర్వాత ఏ కనికరం ఏ నియంత్రణా అవలంభించని ఎంఎఫ్ఐలు ఇపుడు స్వీయ నియంత్రణ పాటిస్తాయి....అవును ఎద్దు పుండు చూస్తే కాకికి ఎంత నియంత్రణో వీటికీ అంతే...

ఇక చివరగా ఎంఎఫ్ఐలకు మినహాయింపులు ఇవ్వాలంటే అది చేసేది కేంద్ర ప్రభుత్వం..కాని పార్లమెంటు కాదు. అంటే మోసాలు, ఆత్మహత్యలు వంటివి జరిగితే వాటినుండి కేంద్ర ప్రభుత్వం ఎంఎఫ్ఐలను కాపాడగలదు. అంటే అధికారంలో ఉన్న పార్టీకి సమర్థకాలు జరిగితే చాలు ఎంతటి పాతకం చేసయినా బయట పడటానికి ఎంఎఫ్ఐలకు రాజమార్గంలో తివాచీ పరిచారు.

ఈ బిల్లు మొత్తం వైరుధ్యాల పుట్ట. ఒకదానికి ఒకదానికి పొంతనలేదు. పైగా "పొదుపు" అనే పదానికి ఆర్‌బిఐ ఇచ్చిన నిర్వచనానికి ఎంఎఫ్ఐల బిల్లు చెబుతున్నది పూర్తి భిన్నంగా ఉంది. అంటే ఒక బిల్లులోని అంశాలు గత చట్టంలోని సూత్రాలను ఉల్లంఘించకూడదనే కనీస సూత్రాన్ని కూడా పాటించలేదు. గత చట్టాన్ని సవరించదలిస్తే అదికూడా పేర్కొనాలి. కాని అదీలేదు. ఎవరో ఎంఎఫ్ఐ ప్రతినిధులు చెబితే వారికి అనుకూలంగా ఏ చట్టాలతో పనిలేకుండా ఈ బిల్లు రాసినట్టుగా ఉంది.

అసలు ఎస్‌హెచ్‌జిలను బహుళజాతి సంస్థల వడ్డీ వ్యాపారానికి వినిమయ వస్తు వ్యాపారానికి అప్పగించదలిస్తే ఇప్పటిదాకా 10 వేలకోట్ల రూపాయలు దరిద్ర నిర్మూలన పేరిట వీటిపై ఎందుకు ఖర్చు చేసినట్లు? అంటే వివిధ రకాల వేదిక, బృందాలు నిర్మించేది వాటిని వ్యాపార సామ్రాజ్యాలకు అప్పగించడానికేనా అనే అనుమానం ఈ బిల్లు చదవిన వారికెవరికయినా కలగక మానదు.

దేశ వ్యాప్తంగా ఉన్న పొదుపు బృందాలు మహిళా సంఘాలు ఈ బిల్లును తీవ్రంగా వ్యతిరేకించాలి. ఈ బిల్లు అసలు ప్రవేశపెట్టడాన్నే అనుమతించ కూడదు. సూక్ష్మరుణ సంస్థల బారి నుండి పేదలను కాపాడటానికి ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు బిల్లు చేయమని డిమాండ్ చేయవచ్చు. కేంద్ర ప్రభుత్వం బ్యాంకింగ్ సర్వీసులను గ్రామాలకు విస్తరించాలి. గ్రామానికి ఒకరు లేదు రెండు మూడు గ్రామాలకు ఒకరు చొప్పున జనాభా ప్రాతిపదికన బ్యాంకు ఉద్యోగులే ఈ తరహా లావాదేవీలు నడపాలనే ప్రతిపాదన ఏదయితే ఉందో దాన్ని అమలులోకి తేవాలి. నాబార్డు మ్యాక్ సొసైటీలు, ఇతర ప్రభుత్వ సంస్థల నుండి నేరుగా రుణ సదుపాయం జరగాలి తప్ప ప్రైవేటు సంస్థలకు అప్పగించరాదు.

సూక్ష్మరుణ సంస్థల (ఎంఎఫ్ఐ) అభివృద్ధి ప్రభుత్వ లక్ష్యం కారాదు. ఎస్‌హెచ్‌జిల ఉనికికే ప్రమాదం ఏర్పడే ఈ బిల్లు తయారీలో పెద్ద కుట్ర దాగుంది. ఇది రాష్ట్ర ప్రభుత్వం, స్థానిక సంస్థల పాత్రను నిర్వీర్యం చేసి వికేంద్రీకరణకే తూట్లు పొడుస్తుంది. కాబట్టి నిర్ద్వందంగా ఈ బిల్లు చట్టరూపం దాల్చకుండా ప్రతిఘటించాల్సి ఉంది.



# భారత మహిళ - నాడు, నేడు

## 65వ స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా

- వేములపల్లి సత్యవతి

స్వాతంత్ర్యం రాక పూర్వం మనదేశం దాదాపు రెండు దశాబ్దాల వరకు ఆంగ్లేయుల వలసపాలనలో వుంది. అంతకు పూర్వం మన దేశంలో చదువు కేవలం ఒకే వర్ణానికి పరిమితమై వుండేదన్నది అందరూ ఎరిగిన సత్యం. నాల్గు వడగల హైందవంలోని వర్ణ వ్యవస్థ అందుకు ముఖ్య కారణం. దానితోపాటు సమాజంలో పురుషాధిక్యత చెలామణిలో వుండేది. శూద్ర వర్ణములోని పురుషులకు కూడా పురుషాధిక్య సమాజంలో చదువుకునే అవకాశాలుండేవి కావు. ఉన్న విద్య కూడా సంస్కృతమయం. వేదాలు, ఉపనిషతులు, సాఖ్య, యోగ, గణిత శాస్త్రాల బోధనల వరకే పరిమితమై వుండేది. సంఘ సంస్కర్త రాజారామ్మోన్‌రాయ్, సాంఘిక దురాచారాలను రూపుమాపటానికి పోరాడటమేకాకుండా బూజుపట్టిన పాత విద్యా విధానాలలో కూడా మార్పుకు గణనీయమైన కృషి చేశారు. ఇంగ్లండులో కూడా విద్య మతాచార్యుల చెర నుండి బయటపడి బేకిన్ విద్యా విధానాన్ని ప్రవేశపెట్టిన తర్వాత అన్ని రంగాలలోను అభివృద్ధి పథంలో పయనించిందని గ్రహించాడు రాయ్. మన దేశంలో కూడా ఇంగ్లీషు విద్యాబోధన వల్లనే దేశం పురోగమిస్తుందని భావించి దానిని ప్రవేశపెట్టించటానికి గణనీయమైన కృషి చేశాడు. ఆయన కృషి వల్లనే సమాజంలోని అన్ని వర్ణాల వారికి చదువుకునే అదృష్టం కల్గింది

హైందవ మత దురాచారాలలో మహిళల ఎడల పోటించబడిన అత్యంత భయానక, క్రూర దురాచారం సతీ సహగమనం. దానిని మతపరంగా పవిత్రమైన ధర్మకార్యంగా తలచేవారు అనితరసాధ్యమైన ఆ దురాగతాన్ని రాయ్ పడరానిపాట్లుపడి, ఇంటి నుంచి గెంటివేయబడి, బ్రిటిషు పాలకులను



ఒప్పించి చట్టం చేయించి దానిని నిర్మూలింపచేశాడు. అందుకు స్త్రీ జాతి ఆ మహనీయునికి అన్నికాలాలలోను కృతజ్ఞతగల్గి వుంటుంది. బాల్య వివాహాలు ఆ రోజుల్లో అన్ని వర్ణాలలోను జరిగేవి. రజస్వల అయిన తర్వాత పెండ్లి చేస్తే కులం నుంచి వారిని వెలి వేసేవారు. ఇది బ్రాహ్మణులలోనే వుండేది. వెలి భయానికి పది సంవత్సరములు లోపు బాలికలకు పెండ్లిండ్లు చేసేవారు. బాల్య వివాహాలలో అన్ని వర్ణాలవారు వయో భేదం పాటించేవారు కాదు. 30 ఏండ్ల వానికి మూడేళ్ల బాలికను, అరవై యేళ్ళవారికి ఆరేళ్ల అమ్మాయిలను యిచ్చి చేసేవారు. నేటి మహిళలు వరకట్నజాడ్యానికి గురవుతున్నట్లుగానే ఆరోజుల్లో కన్యాశుల్కానికి బలయ్యేవారు. శిశు మరణాలు, బాలింతల చావులు,( వైద్య సౌకర్యం లేక) ఎక్కువగా వుండేవి. భార్య గతించిన పురుషుడు పిల్లలున్నా సరే రెండేసి, మూడేసి వివాహాలు చేసుకునేవారు. వయసు పైబడినందున శుల్కమిచ్చి కన్యను వివాహం చేసుకునేవారు. అధిక సంతానం వలన, పేదరికం వలన ఆడపిల్లల తల్లితండ్రులు ముసలి ముతక అని చూడకుండ వారికిచ్చి పెండ్లి చేసేవారు. బహు భార్యాత్వం కూడా వుండేది. రాజు-పేద బేధం లేకుండ అనేకమంది స్త్రీలను చేసుకునేవారు. పిల్లలులేరని కొందరు, మగ పిల్లలు కావాలని కొందరు, ఎక్కువ భార్యలను కల్గి వుండటం గౌరవంగా భావించి కొందరు చేసుకునేవారు. దశరథ మహారాజుకు ముగ్గురు భార్యలని, కృష్ణునికి ఎనమండుగురు వివాహిత భార్యలని మనం చదువుకున్నాం. యుద్ధాలలో ఓడిపోయిన వారు గెలిచిన రాజుకు తమ కూతురునిచ్చి

బాంధవ్యం పొందిన రాజుల గురించి చరిత్రలో కోకొల్లలుగా చదివాము. మూఢనమ్మకాలు అధికంగా ఉండేవి. హిస్టీరియా వ్యాధి వస్తే దయ్యం పట్టిందని భూత వైద్యునితో మంత్ర తంత్రాలు చేయించి తాయిత్తులు కట్టించేవారు. ఆటలమ్మ, మశూచికం లాంటి వాటిని అమ్మవారి ఆగ్రహం వలన వచ్చినవని తలచేవారు. ఆహారంలో పత్యం పాటించటం తప్ప ఏవిధమైన వైద్యం చేసేవారుకాదు. అమ్మవారికి కోపం వస్తుందని దేశీయ వైద్యం కూడా చేసేవారు కాదు. బాల్య వివాహాల కారణంగా

కొంతమంది పురుషుల వత్తిడి వలన రజస్వలకాని అమ్మాయికి శోభనం జరిపించేవారు. ఆ పిల్ల నరకయాతన భరించలేక ఏడ్పులతో పెడబొబ్బలు పెట్టుకుంటూ గది తలుపులు తెరుచుకొని పులి పంజానుండి తప్పించుకున్న లేడి పిల్లలాగ భయంతో గజగజ వణికిపోతూ తల్లిని కావలించేకునేది. ఈ ఘటన జోశ్యభట్ల సత్యనారాయణ రచించిన 'జీవిత అనుభవాలు-పోరాటాలు' అనే పుస్తకంలో వుంది. వయో బేధంతో కూడిన వివాహాల వలన భర్త చనిపోచిన స్త్రీల సంఖ్య ఎక్కువగా వుండేది. పెండ్లినాడు మెడలో కట్టిన పుస్తె, నల్లపూసలు, కాలిమట్టెలతోపాటు భర్త చనిపోయిన స్త్రీలు చిన్ననాటి నుంచి పెట్టుకున్న బొట్టుకు, గాజులకు, పూలకు, పసుపు కుంకుమలకు దూరమయ్యేవారు. బ్రాహ్మణులలో తల మీద వెంట్రుకలను తీయించి నున్నగా గుండు చేయించేవారు. మిగతా కులాలవారిలో శిరోముండనం లేదు. విధవలు ధరించే చీరలు వేరుగావుండేవి. వక్షస్థలానికి ఆచ్ఛాదనగా ధరించే రవికెను కూడా వితంతువులు ధరించకూడదు. ఈ ఆచారాలు బ్రాహ్మణులతోపాటు మిగతా కొన్ని కులాలలో కూడా వుండేది. నిమ్న కులాలలో వితంతువులు రవికె ధరించేవారు. ఎక్కువ వయసు మళ్లినవారైతే తప్ప నిమ్న కులాలలో భర్తను కోల్పోయిన బాలికలకు, యువతులకు (మారుతున్న ఆచారం వారిలో వుండేది) మరల పెండ్లిండ్లు చేసేవారు.

వితంతు మహిళలు పుట్టింటికి చేరేవారు. వారికి కొద్దిమంది అత్తింటివారు భరణం అని ఆ వితంతువుకు యిచ్చేవారు. అధికులు ఎగ్గొట్టేవారు. పుట్టిల్లు చేరిన వితంతువుల జీవితాలు భూలోకంలోని నరకాన్ని తలదన్నేవిగా వుండేవి. శుభకార్యాల సమయాన, పనిమీద బయటకు వెళ్లేటపుడు విధవలు కంటబడకూడదు. అశుభంగా భావించేవారు. వితంతువులు మూడు పూటలా భోజనం చేయకూడదు. ఒంటిపూట మాత్రమే తినాలి. నేలమీద చాపమీద పడుకోవాలి. మంచాలపైన పడుకోకూడదు. అక్క, చెల్లెళ్లకు, వదిన, మరదళ్లకు పురుళ్ళు పోయాలి. మడి కట్టుకుని (బ్రాహ్మణులలో) వంట, వార్పు చేసి యింటిల్లిపాదికి తినబెట్టాలి. కర్మచాలక అత్తవారి యిండ్లలో వుండవలసివచ్చిన వితంతువులు, మావ, అత్త, మరుదుల లైంగిక వేధింపులకు గురి అయ్యేవారు. తప్పించుకోలేని పరిస్థితుల్లో గర్భవతులయ్యేవారు. ఇండ్లలోనే వారికి గుట్టు చప్పుడు కాకుండా గర్భస్రావాలు చేయించేవారు. అత్తింటిలోవున్న వారైనా, లేక పుట్టింటిలో వున్న విధవలు వయసువచ్చేటప్పటికి ప్రకృతి సిద్ధంగా శరీరంలో హార్మోనుల మార్పుల ప్రభావం వలన శారీరక కోరికలను అదుపు చేసుకోలేక కాలుజారేవారు. గర్భవతులయిన వారికి పుట్టినింటిలో కూడా గర్భస్రావాలు చేయించేవారు. వితంతువులు కాని మహిళలకు కూడా స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు వుండేవికావు. మాతృస్వామిక సమాజం తదనంతరం అన్ని వర్ణాల స్త్రీలు స్వేచ్ఛా విహీనులై ఒక విధమైన దాస్యంలో కొన్ని శతాబ్దాలపాటు జీవించారు. సమాజంలో స్త్రీ వ్యక్తిత్వం కోల్పోయింది. విద్యకు దూరమయ్యింది. ఆస్తిహక్కు హరించుకు పోయింది. బాహ్య ప్రపంచంతో సంబంధం లేకుండా నాలుగు గోడల మధ్య ఇంటి పనికి, వంటపనికి, పిల్లలను కనిపెంచటానికి పరిమితం చేయబడింది. విద్యా విహీనతవల్ల మూఢ విశ్వాసాలకు, అంధ నమ్మకాలను, అసూయ, ద్వేషాలకు, సంకుచితత్వానికి స్త్రీ ఆలవాలమయింది. ఇది ఆమె దోషం కాదు. పురుషాధిక్య సమాజానిది. వీటన్నిటి నుంచి స్త్రీ బయట పడాలంటే స్త్రీ విద్య ఆవశ్యకతను సంఘ సంస్కర్తలు గుర్తించారు. మగవారు వీధి అరుగుల మీద వున్నపుడు వారి ముందు నుండి స్త్రీ వెళ్లకూడదు. పరాయి పురుషునికి కనిపించకూడదు. అత్తమామల ఎదుట భర్తతో మాట్లాడరాదు.

ఉత్తర భారతంలో రాజా రామ్మోహన్‌రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ లాంటి వారు సతీసహగమనానికి, బాల్య వివాహాలకు వ్యతిరేకంగా పోరాడారు. స్త్రీ విద్యకు ప్రాధాన్యత కలగజేయటానికి కృషి చేశారు. వితంతు వివాహాలను ప్రోత్సహించడమేకాకుండా ఈశ్వరచంద్ర విద్యా సాగరరావు గారు స్వయంగా వితంతు వివాహాలు జరిపించారు. తదనంతరం వారికి ధన సహాయం కూడా చేసేవారు. దక్షిణాదిన మహాత్మాపూలే దంపతులు స్త్రీ విద్యను ప్రోత్సహించటమేకాక పాఠశాలను స్థాపించారు. సావిత్రిబాయి పూలే ఆ పాఠశాలలో పంతులమ్మగా పనిచేశారు. కార్వే మహాశయుడు కూడా సంఘ సంస్కర్త. పూలే దంపతులు, కార్వే పండితుడు మహారాష్ట్రకు చెందినవారు. తెలుగువారిలో యుగపురుషుడుగా పేరు గాంచిన సంఘ సంస్కర్త వీరేశలింగం పంతులుగారు. సంస్కరణోద్యమాన్ని గురించి ప్రజలలో ప్రచారం చేయటానికి వివేకవర్ధిని పత్రికను నడిపారు. మూఢ నమ్మకాలకు, బాల్య వివాహాలకు వ్యతిరేకంగా స్త్రీ విద్య ప్రచారానికి, వితంతు వివాహాల ప్రోత్సాహానికి సాహిత్యాన్ని సాధనంగా వుపయోగించుకున్నారు. బాలికల పాఠశాల స్థాపించారు. పంతులు గారు స్వయంగా ఎన్నో వితంతు వివాహాలు జరిపించారు. కులం నుంచి అనేక రకాల వ్యతిరేకతలను ఎదుర్కొన్నారు. ఉపాధ్యాయునిగా పనిచేశారు. విద్యార్థుల మీద పంతులు గార్కి మంచి పట్టువుంది. విద్యార్థుల మీద పంతులుగారి ప్రభావం బాగావుండేది. మహిళల కొరకు ...గ్రంథాలయాన్ని నడిపారు. పంతులుగారి దగ్గర చదువుకున్న కొంతిమంది మహిళలు వక్ష పత్రికలకు మాస పత్రికలకు సంపాదకులుగా వుండి నడిపారు. రచయిత్రులు కవయిత్రులు తయారయ్యారు.

వారిలో కొటికలపూడి సీతమ్మగారు పేరుగాంచిన కవయిత్రి. ఆమె సభలలో వేదిక మీదకెక్కి సంస్కరణల ఆవశ్యకతను గురించి వుపన్యసించేవారు. బాపట్లలో జరిగిన మహిళాసభకి అధ్యక్షత వహించారు. వీరేశలింగంమ గారి జీవిత చరిత్రను పద్య గ్రంధంగా రచించారు. వీరేశలింగారి కన్న ముందు బాలికా పాఠశాలను స్థాపించిన మొదటి మహిళ రాణి అబ్బాయమ్మ. అనకాపల్లి రాజా వారి ఇంటి ఆడపడుచు, పెరిక కులానికి చెందిన మహిళ. గంగాభవాని సంస్కృతంలో మధురావిజయం రచించిన తెలుగు మహిళ. ముద్దుపళని, మొల్ల, తరిగొండ వెంగమాంబ ముగ్గురూ తెలుగు కవయిత్రులు. ముద్దు పళని కళావంతుల కుటుంబంలో జన్మించింది. మొల్ల కుమ్మరి కుటుంబంలో జన్మించింది. రామాయణం రచించింది. మొల్ల రామాయణంగా పేరుగాంచింది. వెంగమాంబ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించింది. ఆనాటి సమాజంలో బాల వితంతువులు గురయ్యే దురాచారాలను వ్యతిరేకించింది. వైదవ్య చిహ్నాలను ధరించ నిరాకరించింది. శిరోముండన చేయించుకోనని తిరగబడింది. శృంగేరి పీఠాధిపతి వచ్చి చెప్పినా ఆమె వినలేదు. తల్లితండ్రులు, పూరివారు వెలివేశారు. బాల వితంతువైన వెంగమాంబ యుక్త వయస్సురాలైనప్పటి నుంచి ఎన్నో అవమానాలకు, అవహేళనలకు, వేధింపులకు గురయ్యింది. చివరకు ఊరిలోని దేవాలయంలో కూడా ఉండలేని పరిస్థితుల్లో తిరుపతి చేరింది. తిరుపతిలో తాళ్ళపాక వంశీయులు ఆమె వుండటానికి చిన్న ఇల్లు ఇచ్చారు. ఆమె చనిపోయేవరకు అక్కడే ఉంది. అనేక సాహిత్య ప్రక్రియల్లో రచనలు చేసింది. శతకాలు రాసింది. ద్విపదులు రచించింది. యక్షగానం అన్న నాటకం రచించింది. దానిలో చెంచుల వాస్తవిక జీవిత చిత్రాలను రాసింది. ఆ నాటకంలోని చెంచునాయుడు పాత్ర ద్వారా పురుషాధిక్యతను ఏకిపారేసింది. బండారు అచ్చమాంబగారు 'అబలా సచ్చరిత్ర రత్నమాల'నవలను, కొన్ని కథలను రాసింది. వీరంతా స్త్రీలు గడపదాటి బయటికి రాకూడదన్న సమాజంలో నివశించిన వారే. దేశంలో పరాయి పాలన ఉన్నప్పటికీ ఆర్య సమాజం, బ్రహ్మ సమాజం, సంఘ సంస్కర్తల వలన సమాజంలో కొంతమార్పు వచ్చింది. బ్రిటిషు పాలకులకు తమ అధికారాన్ని సుస్థిరం చేసుకోవడానికి స్థానికుల అవసరం ఏర్పడింది. విద్యా వాహకం ద్వారా ప్రజలతో సంబంధాలు పెట్టుకున్నారు. దేశంలో అన్ని ప్రాంతాలలోనూ వారి వారి మాతృభాషల్లో విద్యా బోధన కొరకు బాలుర, బాలికల పాఠశాలలను నెలకొల్పారు. ఒక సబ్జెక్టు ఇంగ్లీషు ఉన్నత పాఠశాలల్లో నెమ్మదిగా ప్రారంభించారు. ఆంధ్ర దేశంలో కోస్తా జిల్లాలలో విద్యా వ్యాప్తి వేగంగా జరిగింది. నాది ఎనిమిది పదులు నిండిన వయసు. నా చిన్నతనంలో కృష్ణాజిల్లాలోని అంగలూరులో బాలికలకు హై స్కూలు సెకండరీ గ్రేడు ట్రెనింగు (మహిళలకు) స్కూలు ఉండేది. అంగలూరు ఆరోజుల్లో విద్యావంతుల వూరుగా పేరుగాంచింది. ప్రాచీనకాలం నుండి మనదేశంలో వేశ్యలుండేవారు. వారిలో నంగీ, నృత్యకళలలో ఆరితేరిన, నిష్ణాతులైన కళాకారిణులుండేవారు. వైశాలి నగర వధువుగా, అపురూప సౌందర్యవతిగా, నృత్యంలో సాటిలేని నృత్యకారిణిగా ప్రసిద్ధిగాంచిన ఆమ్రపాలి అనే వేశ్యకు బుద్ధుడు దీక్షనొసగి బౌద్ధంలో చేర్చుకున్నాడు. రాను రాను వారి స్థితి గతులు మారినాయి. సమాజం వారిని చిన్న చూపు చూసింది. పురుషాధిక్య సమాజంలోవారి కడుపు నింపు కొనడానికి పడుపువృత్తిని చేపట్టి వేశ్యలుగా మారారు. సమాజ సంస్కరణల్లో వారిని దూరం చేయడం కూడా ఒక భాగమైంది.

**స్వాతంత్ర్య పోరాటంలో మహిళల పాత్ర:**

1857నాటి ప్రథమ స్వాతంత్ర్య పోరాటానికి ఝాన్సీ రాణి నాయకత్వం వహించిన సంగతి మనకందరికి తెలుసు. ఆమె మహారాష్ట్ర బ్రాహ్మణ యువతి. భర్త మరణానంతరం హిందువుల పుణ్యక్షేత్రమైన కాశీకి వెళ్ళి శిరోముండనం చేయించుకోవడానికి ఆంగ్లేయుల అనుమతి కోరగా వారు నిరాకరించారు. రాజ వంశానికి చెందిన వితంతువులైన వారికి కడు బీదవారైన బ్రాహ్మణ వితంతువుల వరకు అందరూ శిరోముండనం చేయించుకోవలసిందే. ఆ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనేనాటికి రాణి వయసు 23సంవత్సరాలు. ఝాన్సీ రాణితోపాటు బేగం హజరత్ మహల్ అనే మహిళ కూడా ఆంగ్లేయులను ఎదిరించి పోరాడింది. ఆ ఇరువురు యువతుల వీర గాథలు స్వాతంత్ర్యపోరాట చరిత్ర పుటల్లో స్వర్ణాక్షరాలతో లిఖించబడింది. ఆచంద్రార్కంగా వారివురూ చరిత్రలో నిలిచిపోతారు. మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత (1914) మన దేశంలో స్వాతంత్ర్య పోరాటాలు ప్రారంభమైనాయి. స్వాతంత్ర్య పోరాటాలకు గాంధీజీ నాయకత్వం వహించక ముందే భరత మాత ముద్దుబిడ్డ, దేశమాత కంఠాభరణం, మనం అందరమూ సగర్వంగా తలెత్తుకుని చెప్పుకోదగిన సాటిలేని మేటి మహిళా దేశభక్తురాలు మేడమ్ కామా, 1961లో బొంబాయిలోని అత్యంత శ్రీమంతులు, ధనికులలో పేరుగాంచిన పార్శీ కుటుంబంలో జన్మించింది. ఆమెకు యుక్తవయసు వచ్చినదగ్గరనుంచి బ్రిటిషు వారి వలస పాలనకు బద్ధ విరోధి. ఆమె మెట్టినిల్లు పుట్టినింటికంటే ఎక్కువ శ్రీమంతుల కుటుంబం. భర్త ప్రొఫెసర్. ఆంగ్లేయ సర్కారు అభిమాని. ఒకసారి ముంబయిలోని మురికి వాడలలో ప్లేగు వ్యాధి వ్యాపించింది. వ్యాక్సిన్ కూడా కనిపెట్టని రోజులవి. అయినా ఆమె నిర్భయంగా ఆ మురికి వాడలలోకి వెళ్లి రోగ నివారణ పనుల్లో పాల్గొన్నది. ఫలితంగా అత్తవారింటికి దూరం కావలసివచ్చింది. అత్తవారింటిని, పుట్టింటిని వదలటంతోపాటు మాతృదేశాన్నే వదిలి వెళ్లిపోయింది. ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలగుదేశాలలో తిరిగింది. అనేక దేశాల విప్లవకారులతో పరిచయాలు ఏర్పరుచుకున్నది. స్టుట్గార్డ్‌లో జరిగిన ప్రపంచ కార్మిక మహాసభలో భారత ప్రతినిధిగా పాల్గొన్నది. భారతదేశానికి

సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలన్న తీర్మానం ప్రవేశపెట్టింది. ఆ సభలో ఆ తీర్మానం ఆమోదం పొందింది. తానే భారత దేశానికి స్వతంత్ర జండాను రూపకల్పన చేసి ఆ మహాసభలో జెండాను ఎగురవేసింది. కాంగ్రెసుకన్నా ముందే సంపూర్ణ స్వాతంత్ర్య కావాలన్న ఘనత స్వతంత్ర జండానెగురవేసిన ఖ్యాతి మేడమ్ కామాకే దక్కుతుంది. ఎన్నో సార్లు మాతృదేశానికి రావాలని ప్రయత్నించింది. బ్రిటిష సర్కారు రాజకీయాలలో పాల్గొనని క్షమాపణ పత్రం రాసిస్తే అనుమతినిస్తానన్నది. అందుకామె తిరస్కరించింది. స్వతంత్ర చరిత్ర పుటల్లో ధృవతారగా వెలుగొందవలసిన అసమాన దేశభక్తురాలు మట్టిలో కలిసిన మాణిక్యంలాగా మరుగున పడిపోయింది. ఆ మహాసభకు లెనిన్ వచ్చాడని మేడమ్ కామాని తమ దేశానికి రమ్మని ఆహ్వానించాడని చదివాను. దేశం స్వతంత్ర్యమైన తరువాత ముంబాయిలో ఒక వీధికి కామా వీధిగా నామకరణం చేశారు మన స్వాతంత్ర్య యోధులు. 1920 నుంచి గాంధీజీ నాయకత్వంలో జాతీయ కాంగ్రెసు నాయకత్వాన అనేక పోరాటాలు జరిగాయి. ఆ పోరాటాలలో స్వాతంత్ర్య సమరయోధుల గుండెలు పోలీసుల తుపాకి గుండ్లకు గురయ్యాయి. అన్ని వర్గాల, మతాల, కులాల వారు విచక్షణ లేకుండా పాల్గొన్నారు. జనాభాలో సగభాగమైన స్త్రీల భాగస్వామ్యం లేకుండా పోరాటాలు విజయవంతం కావని మహిళలను భాగస్వామ్యం కమ్మని పూజ్య బాపూజీ పిలుపునిచ్చారు. ఆ పిలుపునందుకుని దేశంలోని అన్ని ప్రాంతాల మహిళలు ఆనాటి సాంఘిక కట్టుబాట్లను తెంచుకుని ఉద్యమాల్లోకి ఉరికారు. కాపురాలను కాలదన్నుకున్నారు. వంటి మీద ఉన్న బంగారు ఆభరణాలను నిలువు దోపిడిలాగా బాపూజీకి విరాళాల రూపంలో ఇచ్చారు. మరికొంతమంది పవిత్రంగా భావించబడే మాంగల్యాలను కూడా గాంధీజీ దోసిళ్ళలో పెట్టారు. పురుషులతోపాటు జైళ్లకు వెళ్లారు. పురుషులు జైళ్ళకు వెళితే వారి భార్యలు కుటుంబ భారాన్ని తలకెత్తుకున్నారు. పిల్లల పెంపకం, చదువు, వృద్ధుల సంరక్షణ వీటితోపాటు పోలీసుల జులుం గూఢచారుల నిఘాలను ఎదుర్కొన్నారు. ఆర్థిక స్థోమత తగినంతగా లేనివారు పేదరికంతో నానా అగచాట్లు పడి సంసారాలను ఈదారు. అదే



మహిళలు స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొని జైళ్లకు వెళితే వారి భర్తలు పైన పేర్కొన్న బాధ్యతలనునెరవేర్చటానికి ముందుకు రాలేదు. పురుషాధిక్యతను ప్రదర్శించారు. దుర్గాబాయమ్మ, సూర్యదేవర రాజ్యలక్ష్మమ్మగారు వైవాహిక జీవితాలకు దూరమయ్యారు.

గాంధీజీ మితవాద ధోరణి నచ్చని యువకులు సోషలిస్టులుగానూ, కమ్యూనిస్టులుగానూ ఏర్పడి అతివాద ధోరణితో పనిచేయడం మొదలుపెట్టారు. ఆంధ్రలో పులుపుల శివయ్యగారు, కంభంపాటి సత్యనారాయణ, జొన్నలగడ్డ రామలింగయ్య, పుచ్చలపల్లి సుందరయ్య, చంద్ర రాజేశ్వరావు మొదలగువారు పార్టీని స్థాపించారు. పార్టీతోపాటు మహిళా సంఘాన్ని ఏర్పాటు చేశారు. నాగళ్ళ రాజేశ్వరమ్మ, మానికొండ సూర్యావతి, డాక్టర్ అచ్చమాంబ, కంభంపాటి మాణిక్యాంబ, చంద్ర సావిత్రీదేవి, కాట్రగడ్డ హనుమాయమ్మ మొదలగువారు మహిళా సంఘం తరుపున పనిచేయడం ప్రారంభించారు. మొదట మధ్య తరగతి మహిళల్లో భర్త ఆస్తి మీద హక్కు విడాకుల చట్టం కావాలని, బహుభార్యాత్వం నిషేదించాలని పనిచేశారు. ఉద్యమాలు నడిపి జైళ్లకు వెళ్లారు. ఆస్తులన్నీ విరాళాలిచ్చారు. ఆస్తి హక్కును, బహుభార్యాత్వాన్ని, విడాకుల చట్టాన్ని గురించి ప్రచారానికి వెళ్లినపుడు సమాజంనుండి, పురుషుల నుంచి తీవ్ర వ్యతిరేకతను ఎదుర్కొన్నారు. హేళనలకు, అవమానాలకు గురయ్యారు. పదిమంది మహిళలను ఒకచోట సమావేశపరచడానికి ఆకాశంలోని చుక్కలను చూడవలసివచ్చేది. ఆస్తి హక్కును గురించి చెప్పేటప్పుడు మహిళలు ఆసక్తితో వినేవారు. కొంతమంది పురుషులు "ఆస్తి హక్కు కావాలా? విడాకులు కావాలా? నేను, నా భార్య బాగానే ఉంటున్నాం. ఈ మాటలు చెప్పి మా ఆడవాళ్ళను చెడగొట్టకండి, మీ మాటలు వింటుంటే రేపటినుంచి నాకు నా పిల్లలకు కూడు వండిపెట్టకుండా మీలాగే భుజాన సంచులు తగిలించుకుని బజార్లో తిరగడానికి బయలుదేరుతుందని" ఆడవారితో మాట్లాడే అవకాశం ఇచ్చేవారు కాదు. మరికొందరైతే 'మా యింటినుండి ముందు

బయటకెళ్లండని' తరిమినంత పనిచేసేవారు. 'హక్కులు కావాలట, హక్కులు! దుర్గాబాయమ్మలాగా మొగుడిని వదిలేసి జెండాలు పట్టుకుని వూరేగి జైలుకెళ్లమని చెప్పటానికి వచ్చారా?' అని హేళనగా మాట్లాడేవారు. వయసుమళ్లిన బామ్మలు, అమ్మమ్మలు, నాయనమ్మలు 'మీరు ఆడపిల్లలుకారా? భుజాన సంచులేసుకుని తిరగటానికి సిగ్గులేదా? మీకు ఇంటిలో పనిపాటా లేవా? చేసుకున్నవాడికి, కన్న పిల్లలకు కూడులు వండి పెడుతున్నారా? వయసులో వున్న ఆడపిల్లలు బరితెగించి బజార్లలో తిరగటం చోద్యంగా ఉంది'అనేవారు. సహగమన దురాచారాన్ని, దాన్ని మాన్పించిన మహా పురుషుడుని గురించి వారికి తెలియజెప్పేవారు. వారా దురాచారాన్ని దూరం చేయకపోతే ఈ రెజు మీరు మమ్మెలను తిట్టటానికి బ్రతికుండేవారు కాదని చెపితే ఆశ్చర్యపోయేవారు. ఆస్తిహక్కు, బహుభార్యాత్వ నిషేదం, విడాకుల చట్టం గురించి చెప్పి సంతకాల సేకరణ మహిళా సంఘం చేపట్టింది. ఎక్కువమంది ఆసక్తితో వినేవారు కాని సంతకాలు చేయటానికి భయపడేవారు. భర్త లేమనుకుంటారోనని వెనకాడే వారు. గంజి వార్చుకుండ అన్నం వండాలని, దోసకాయ, బంగాళా దుంపలాంటి కాయగూరలను చెక్కుదీయకుండా వండాలని మొదలగు విషయాల గురించి మహిళలకు అవగాహన కలిగించేవారు. మహిళా సంఘం ఆంధ్ర దేశమంతటా విస్తరించింది. గుడిసెల్లో వారిదగ్గరకు, వ్యవసాయ కూలీలైన మహిళల్లోకి వెళ్లి పనిచేశారు. యుద్ధ(రెండవ ప్రపంచ) సమయంలో చౌక దుకాణాలవద్ద వచ్చిచ్చినవారందరిని వరుసలో నిలబెట్టి వారికి రావలసిన కిరోసిన్, చక్కెర, గోధుమలు మొదలగువాటిని సక్రమంగా వారికందేలాగ చేసేవారు. మశూచికము, ఆటమ్మ వ్యాధులకు పిల్లలకు టీకాలు వేయించటానికి గృహిణులు ముందుకొచ్చేవారు కాదు. వారికి నచ్చజెప్పి ప్రమాదం లేదని వారి ముందే మహిళా సంఘం కార్యకర్తలు తాము తీయించుకుని వారి పిల్లలకు, వారికి తీసుకునేలాగ చేసేవారు. కలరా వ్యాపించినపుడు కూడా ఇంజక్షన్స్ తీసుకోవటానికి, పిల్లలకు తీయించటానికి వెనకాడేవారు. మూఢనమ్మకాలు గురించి మహిళా సంఘం వారు పాటల ద్వారా, నాటకాల ద్వారా ప్రచారం చేశారు.

రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తర్వాత ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని అనేక దేశాలు స్వతంత్రమయినవి. మన భారతదేశం కూడా 1947 ఆగస్టు15న స్వతంత్ర దేశమయింది. దేశంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడింది. సరోజనీనాయుడు, పద్మజానాయుడు గవర్నర్లుగా పనిచేశారు. సుచేతా కృపలాని ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగా స్వతంత్ర భారతంలో పనిచేసి ఆ పదవులకు ఎనలేని వన్నె తెచ్చారు. వారి వలన ఆ పదవులకు పేరు, ప్రతిష్టలు చేకూరినవి. ఇంకా ఎంతోమంది మహిళలు గవర్నర్లుగా పనిచేశారు. ప్రభుత్వోద్యోగిగా ప్రవేశించి, స్వయం కృషితో ఆమె అంచెలంచెలుగా ఎదిగి గవర్నర్ పదవి చేపట్టి సమర్ధవంతంగా పనిచేసి పదవీ విరమణ చేసిన తెలుగు మహిళ వి.ఎస్. రమాదేవి గారు. ఇందిరాగాంధీ దేశ ప్రధానిగా పేరుగాంచింది. నేడు మన దేశ ప్రథమ పౌరురాలు (రాష్ట్రపతి) మహిళ. పేరు ప్రతిభా పాటిల్. కొంతమంది మహిళలు కేంద్ర మంత్రులుగాను, రాష్ట్రాలలో మంత్రులుగాను పనిచేస్తున్నారు. ఎంఎల్ఎలుగా, ఎంపిలుగా ఎన్నుకోబడుతున్నారు.

1947లో దేశం స్వతంత్ర మయ్యేనాటికి దాదాపు ఐదువందల సంస్థానాలకు పైగా మన దేశంలో ఉన్నవి. సంస్థానంలో పెద్దది హైదరాబాద్ సంస్థానం. స్వాతంత్ర్యానంతరం దేశంలోని సంస్థానాలన్నీ భారత యూనియన్‌లో విలీనం చేయబడినవి. హైదరాబాద్ సంస్థానాదీశుడు నిజాం నవాబు తాను స్వతంత్రంగా వుంటానని, సంస్థానాన్ని విలీనం చేయనని ప్రకటించారు. దానికన్నా ముందు నిజాం పాలనలో ప్రజల జీవన విధానాన్ని తెలుసుకోవలసిన అవసరం ఉంది. నిరంకుశ పాలకుల్లో నిజాం నవాబుది అగ్రస్థానం. గ్రామాలలో విద్య, వైద్యం పూర్తిగా లేనట్లే. ఉన్న కొద్దిపాటి ప్రభుత్వ, ప్రైవేటు పాఠశాలన్ని జంట నగరాలలోనే వుండేవి. సంస్థానంలో రెండవ పెద్ద పట్టణం వరంగల్. అక్కడ మాత్రం ఇంటర్మీడియట్ వరకు చదువు వుండేది. మగ పిల్లలకు మాత్రమే జిల్లాలోను ఒకే ఒక హై స్కూల్ బాలురకు వుండేది. తాలూకాలలో మిడిల్ స్కూల్. ఇవన్నీ ఉర్దూ మాధ్యమంలో నడిచేవి. దేశముఖ్‌ల, జాగీర్దార్ల, బడా బడా భూస్వాముల, పటేల్ పట్వారీల(మునసుబు-కరణం)దోపిడీకి, దౌర్జన్యాలకు అంతు, అదుపు వుండేది కాదు. వీరంతా ప్రజలను పీడించి, వెట్టిచాకిరి చేయించుకొని అక్రమార్జనతో సంపాదించిన సొమ్మును నవాబుకు నజరానాల రూపంలో అర్పిస్తుండేవారు. నూటికి 88శాతం మంది తెలుగు మాట్లాడేవారు వుండగా వారి భాష ఆలనా, పాలనకు నోచుకోలేదు. భాషాభిమానంతో, ఆంధ్ర పిత మాడపాటి హనుమంతరావు గారు, బూర్గుల రామకృష్ణారావు గారు మొదలగువారు జన సంఘాన్ని స్థాపించి వాటి ద్వారా భాషాభిమానంతోపాటు యువతలో దేశాభిమానం కూడ కలిగించేవారు. ఆంధ్ర మహాసభలు జరుపుకోవటానికి నిజాం సర్కారు అనుమతి పొందటానికి పడరాని పాట్లు పడేవారు. మాడపాటి వారు, బూర్గుల మొదలగు వారి భాగీరథ ప్రయత్నాలకు రాజా బహదూర్ వెంకట్రామారెడ్డి గారి (కొత్వాల్) ప్రమేయంతో అనుమతిని సాధించేవారు. ఆంధ్ర మహాసభతోపాటు ఆంధ్ర మహిళా సభను కూడా నిర్వహించేవారు. ఎల్లాప్రగడ సీతా కుమారిగారు, ఓబుల రంగనాయకమ్మ గారు, మడపాటి వారి సతీమణి మొదలగు మహిళలు ఆ సభలకు అధ్యక్షత

వహించేవారు. స్త్రీ విద్యను ప్రోత్సహిస్తూ వితంతు వివాహాలను బలపరుస్తూ బాల్య వివాహాలను వ్యతిరేకిస్తూ అభివృద్ధికరమైన తీర్మానాలను పాస్ చేసేవారు. అంతవరకే పరిమితయ్యారు. మధ్య తరగతి మహిళల్లోకి గాని, గ్రామీణ మహిళల్లోకి గాని వెళ్ళి ప్రచారం చేయలేకపోయారు. నిజాం పాలనలోని కట్టుబాట్లు, ఘోషాపద్ధతి మొదలగునవి అందుకు కారణం కావచ్చు. సభ నిర్వహణే గొప్ప విజయంగా చెప్పవచ్చు.

ఆంధ్ర మహాసభలోని వారి మితవాద ధోరణి అతివాద, అభ్యుదయ, విప్లవ భావాలుగల యువకులకు నచ్చలేదు. దేశ్‌ముఖ్‌ల, జాగీర్దార్ల, భూస్వాముల పెత్తందారీతనానికి, దోపిడీకి, దౌర్జన్యాలకు, అణచివేతకు, వెట్టిచాకిరికి వ్యతిరేకంగా ప్రజలలోకెళ్ళి పనిచేయసాగారు. గ్రామ గ్రామము తిరిగి ప్రజలను సమీకరించి, సమావేశపరచి అబ్బురపరిచే సాహసవంతమైన పోరాటాలు జరిపారు. లబ్ధ ప్రతిష్టలయిన, త్యాగధనులైన రావి నారాయణరెడ్డి , ముఖ్దుం మొయినుద్దీన్, దేవులపల్లి వెంకటేశ్వరరావు, బద్దం ఎల్లారెడ్డి, రాజహదూర్‌గౌడ్ గార్లవంటి నాయకుల నాయకత్వంలో పోరాటాలు జరిగినవి. దొరల భూములను పది లక్షల ఎకరాలను పార్టీ పేద ప్రజలకు పంచిపెట్టింది. వెట్టి చాకిరీని ప్రజలు వ్యతిరేకించారు. దొరలు వూళ్లనొదిలి గడీలలోనుంచి పట్నానికి చేరుకున్నారు. ఇక్కడ గమనించవలసిన విషయం ఒకటి వుంది. ఆంధ్రలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణంతోపాటు మహిళా సంఘం స్థాపన జరగటం, మహిళ సంఘాలు మహిళల గురించి పనిచేయటం జరిగింది. కాని తెలంగాణాలో ఆంధ్ర మహాసభ నుంచి వేరై పార్టీ స్థాపనతోపాటు ప్రత్యేకించి మహిళా సంఘం అంటూ ఏర్పడలేదు. కమ్యూనిస్టు పురుషులతోపాటు కమ్యూనిస్టు మహిళలు కూడా నిజాం నిరంకుశత్వానికి దొరల దోపిడీకి, దౌర్జన్యాలకు, గడీలలో జరిగే దురంతాలకు వ్యతిరేకంగా పురుషులతోపాటు అడుగులో అడుగు వేసుకుంటూ, చేతిలో చేయి కలుపుతూ ఉద్యమాల్లో ముందుబాటలో నడిచారు. తెలంగాణా కమ్యూనిస్టు మహిళలకు ఆధ్యూలు ఆరుట్ల కమలాదేవి గారు. ఆమెతోపాటు మల్లు స్వరాజ్యం, ఆమె అక్క శశిరేఖ గారు, ప్రియంవద, లలిత, కొండవీటి ఇందిరమ్మ మొదలగు మహిళలు పురుషులకు దీటుగా ఉద్యమాల్లో పాల్గొన్నారు. అడవుల్లో అజ్ఞాతవాసం గడిపారు. నిరంకుశ పాలన పునాదుల బీటు వారుతున్నాయని గ్రహించిన నిజాం నవాబు రజాకార్లకు ఆయుధాలు ఇచ్చి వారిని గ్రామల్లోకి వదిలారు. రజాకార్ల దురాగతాలు చరిత్రలో ఛంఘీజ్ ఖాన్‌ను, నాజీలను మరిపించాయి. కంటికి కనిపించిన ధన ధాన్యాలను, ఇత్తడి, పుత్తడిలను, పుస్తెలను, చెవుల గంటీలను సమస్తమూ దోచుకున్నారు. మహిళలపై సామూహిక అత్యాచారాలు చేశారు. బాలింతలు, ముదుసలులన్న విచక్షణ లేకుండా మహిళలు అత్యాచారాలకు గురయ్యారు. పాత సూర్యపేట బాలెంల మొదలగు గ్రామాలలో ప్రజలను వరుసగా నిలబెట్టి పిట్టలను కాల్చినట్లు కాల్చి చంపారు. పోతూ పోతూ గ్రామాలను తగులబెట్టారు. రజాకార్లను ఎదిరించడంలో పార్టీ నాయకత్వాన గ్రామాల్లో దళాలు ఏర్పడ్డాయి. . ఆ దళాల్లో స్త్రీలు కూడా పాల్గొన్నారు. ఇంట్లో ఉన్న కొడవళ్లతో, కత్తిపీటలు, రోకళ్ళు, రోకలిబండలతో, వడిశాలలతో రజాకార్లను ఎదుర్కొన్నారు. కారం పొట్లాలను మహిళలు ఆ మూకల కళ్ళల్లో గుప్పించారు. చాకలి ఐలమ్మ విస్నూరు రామచంద్రా రెడ్డి దొర నుంచి తమ భూమిని, పంటను కాపాడుకొనటానికి ఎదురుతిరిగింది. పార్టీలోని స్త్రీ పురుషులు ప్రజలను సమీకరించి ఆమె భూమిని, పంటను ఆమెకు దక్కేలా చేశారు. ఆ దొర తల్లి కడివెండ్ల గ్రామంలోని గడీలో ఉండేది. ఆమె కర్కశకర్కోటకురాలు. దౌర్జన్యాలకు, దోపిడీకి, వెట్టి చాకిరికి వ్యతిరేకంగా పార్టీ ఊరేగింపు జరిపింది. దిక్కులు పిక్కటిల్లేలాగా నినాదాలు చేస్తూ ప్రజల ఊరేగింపు గడీ ముందుకు చేరింది. గడీలోని గూండాలు కాల్పులు జరిపారు. దొడ్డి కొమరయ్య తుపాకి గుండ్లకు బలై నేలకొరిగి అమరుడయ్యాడు. ఆ ఊరేగింపులోనూ కమ్యూనిస్టు మహిళలు పాల్గొన్నారు. దొరల దౌర్జన్యాలకు, నిజాం నిరంకుశత్వానికి, రజాకార్ల దురాగతాల గురించి సంస్థానంలోని పత్రికలతోపాటు దేశంలోని అన్ని ప్రాంతాల పత్రికలూ గగ్గోలు పెట్టాయి. రజాకార్ల ముష్కర మూకల దురాగతాలను నిర్భయంగా, నిజాయితీగా, కలాన్ని కత్తిగా పట్టి ప్రపంచానికి వెలుగెత్తి చాటిన పత్రికా సంపాదకుడైన షోయబుల్లాఖాన్ తలను నరికి కలంపట్టి రాసిన చేతులను ఖండించి ఒక పళ్లెంలో పెట్టి ఆ ముష్కర మూకలు ఖాసిం రజ్వీకి కానుకగా సమర్పించారు. కేంద్రంలో ఉన్న సర్కారు కదిలింది. 1948 సెప్టెంబరు 15న నవాబు సర్కారును భారత యూనియన్‌లోకి విలీనం చేశారు. 1947 ఆగస్టు 15న స్వాతంత్ర్య దినోత్సవాన్ని నవాబు నిషేధించాడు. అయినా గ్రామాల్లోని ప్రజలు మువ్వన్నెల జెండాలను ఎగురవేసి పండుగ చేసుకున్నారు.

సంస్థానంలో కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడింది. స్టేట్‌లోని దొరలు, జాగిర్దార్లు ఊసరవెల్లి రంగులు మార్చినట్లు ఖద్దరు వస్త్ర దారులై కాంగ్రెసు తీర్థం పుచ్చుకున్నారు. తిరిగి గ్రామాలకెళ్ళిదొరతనం ప్రదర్శించటం మొదలుపెట్టారు. పార్టీ పేదలకు పంచి పెట్టిన భూములను వారి నుండి తిరిగి స్వాధీనం చేసుకోవటం మొదలెట్టారు. స్టేట్ కాంగ్రెస్ ప్రభుత్వం దొరల పక్షాన నిలిచింది. మరల పార్టీకి పనితగిలింది. మొదటిసారి నవాబుకు దొరల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా పోరాడితే రెండవసారి కేంద్రంలోను, రాష్ట్రంలోను ఏర్పడిన కాంగ్రెస్ సర్కారుతో తలపడవలసివచ్చింది. తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటానికి పిలుపునిచ్చింది. దున్నేవాడిదే భూమి, దున్నేవాడిదే చెట్టు అనే పిలుపుతో పోరాటానికి నాంది పలికింది. నిజాం సర్కారులో తాటి చెట్లు, ఈత చెట్లు ఎవరి భూముల్లో ఉంటాయో వాటి మీద ఆ

భూమి గలవానికి వాటి మీద హక్కు ఉండేది కాదు. అది నిజాం సర్కారీ సొత్తు. పార్టీని నిషేధించారు. కేంద్రం సైన్యాన్ని పంపింది. నాయకులు, నాయకురాండ్రు ఈసారి అడవుల దారి పట్టారు. ముఖ్యమైన కార్యకర్తలు ఆరుట్ల కమలాదేవి, మల్లు స్వరాజ్యం, లలిత మొదలగువారు దాదాపు ఏడు సంవత్సరాలు అడవుల్లో అజ్ఞాతం గడిపారు. గెరిల్లా పోరాటాల పద్ధతుల్లో మిలటరీ క్యాంపులపై, పోలీసు స్టేషన్లపై కమలాదేవి, స్వరాజ్యంగార్లు దాడులు చేశారు. గుర్రపు స్వారీమీద కూడా శత్రువులపై విరుచుకుపడ్డారు. గెరిల్లా దళాలను(గిరిజన మహిళలతో) ఏర్పాటు చేసి శిక్షణ ఇచ్చి దళాలను తయారు చేశారు. తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం దేశ విదేశాల్లో మారుమోగింది. అనేక కారణాలవల్ల 1951లో సాయుధపోరాటాన్ని పార్టీ విరమించుకుంది. దేశం స్వతంత్రమైన పిదప 1952లో మొదటిసారిగా సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. ఆరుట్ల కమలాదేవి, మల్లు స్వరాజ్యం ఎన్నికల్లో పార్టీ అభ్యర్థులుగా పోటీచేసి గెలిచారు.

**నేటి మహిళ:**

స్పుత్నిక్, రాకెట్ల కాలమిది. 20వ శతాబ్దపు ఉత్తరార్ధంలోను, 21వ శతాబ్దం పూర్వార్ధంలోనూ యువతులు, మహిళలు అన్ని రంగాల్లోను గణనీయమైన అభివృద్ధి పథాన ముందుకు వెళుతున్నారు. విద్య, వైద్యం, ఆరోగ్యం, వ్యవసాయం, విజ్ఞాన రంగాలలోను, శాస్త్ర సాంకేతిక రంగాలలోను, యువకులతోను, పురుషులతోను సమానంగా ఎదిగారు. చదువు, ఉద్యోగాల్లో పురుషులకంటే ధీటుగా ముందుంటున్నారు. అంతరిక్ష యానంలోను పయనిస్తున్నారు. కీర్తిశేషులు కల్పనా చావ్లా, సునీతా విలియమ్స్ అంతరిక్షయానంలో పాల్గొని చరిత్ర సృష్టించారు. పోలీసు శాఖలో ఉన్నతాధికారిగా చేరిన ప్రథమ మహిళ కిరణ్‌బేడి. ఆమె నిజాయితీ వల్ల అంకిత భావంతో సేవ చేసినందుకు రామన్ మెగాసెసె అవార్డునందుకున్నది. కానిస్టేబుల్ నుండి కలెక్టరు, ఇంజనీర్లు, డాక్టర్లు, త్రివిధ దళాల్లో కూడా మహిళలు పనిచేస్తున్నారు. క్రీడా రంగాల్లోను సానియా, సైనా, హంపి, కరణం మల్లేశ్వరి వంటి వారు పాల్గొని స్వర్ణ, రజత, కాంస్య పతాకాలను సాధిస్తున్నారు. సాహిత్యంలో కవయిత్రులుగా, రచయిత్రులుగా పుంఖాను పుంఖాలుగా కథలు రాస్తున్నారు. స్త్రీ వాద రచనలు, దళిత వాద రచనలు, ప్రాంతీయ అస్థిత్వ వాదన రచనలు, హైకూలు అన్నింటినీ అలవోకగా రాసేస్తున్నారు. చదువుకొరకు, ఉద్యోగాల కొరకు విదేశాలకు వెళుతున్నారు. చదువుల్లో రాణిస్తున్నారు, ఉద్యోగాల్లో ఉన్నత పదవులు అలంకరిస్తున్నారు. యువకులతో సమానమైన చదువు చదివి సమానంగానూ,



ఉద్యోగినులైన యువతులు వరకట్నమిచ్చి వరుడుని కొనుక్కుంటున్నారు. ఎందుకీ దురాచారాన్ని విద్యావంతులైన, ఉద్యోగినులైన యువతులు, మహిళలు ఎదిరించడంలేదు? దేశ విదేశాల్లో వరకట్న పిశాచానికి ఎందుకు బలౌతున్నారు? కన్యాశుల్కం లాంటి దురాచారాన్ని రూపుమాపటానికి ఆనాటి కాలంలో సంఘ సంస్కర్తలైన పురుషులు గణనీయమైన కృషి చేశారు. మరి ఈనాడు విద్యావంతులైన, చైతన్యవంతులైన మహిళలు వరకట్న దురాచారాన్ని రూపుమాపటానికి ఎందుకు పూనుకోవటం లేదు. ప్రేమోన్మాదంతో యువకులు, విద్యార్థినులను, యువతులను దారుణంగా హతమారుస్తున్నారు. (శ్రీలక్ష్మి, లక్ష్మి ప్రసన్న, ఆయేషా మీరా లాంటి వారెంతమందో చంపబడ్డారు. కొంతమందిని అత్యాచారం చేసి చంపి, చున్నీలతో ఫ్యాన్లకు వేలాడదీస్తున్నారు. తమ ప్రేమను తిరస్కరించిన వారిపై యాసిడ్ పోస్తున్నారు. మన పాలకులకు యాసిడ్ అమ్మకం మీద ఆంక్షలు విధించే దమ్ము కూడా లేదు. యాసిడ్ దాడిలో వరంగల్‌లో ఇంజనీరింగ్ చదివే విద్యార్థినులు ఇరువురిలో ఒకరు మరణించగా మరొకరు ప్లాస్టిక్ సర్జరీతో బ్రతికి బయటపడి ఇంజనీరింగ్ పూర్తి చేసింది. పత్రికల్లో వరకట్న చావులు, ప్రేమోన్మాదుల దాడులు, అత్యాచారాలకు గురైన మహిళల గురించి వార్తలు రాని రోజుంటూ లేదు. ఈ దారుణాలన్నీ చాలవన్నట్లు కడుపులో పెరిగేది ఆడపిల్లని స్కానింగుల ద్వారా తెలుసుకుని కనకుండానే అంతం చేస్తున్నారు. చదువుకోని వారు పేదరికంతో బాధపడేవారు ఇలాంటి పనిచేస్తున్నారనుకోడానికి ఆస్కారం లేదు. చదువుకుని ఉద్యోగాలు చేసే మహిళలు అమెరికా లాంటి విదేశాల్లో ఉన్నత పదవుల్లో స్త్రీలే ఈ దారుణాలకు పాల్పడుతున్నారంటే వింతగానూ , సిగ్గుగానూ ఉంది. ఆడపిల్లను కన్నందుకు ఈసడించుకునే భర్తలు, అత్తమామలు ఉన్నారు. కసాయి తండ్రులు ఈసారి కూడా ఆడపిల్లే పుట్టిందని నేలకేసి కొట్టి చంపుతున్నారు. స్కానింగు చేయించుకోవటానికి ముందుగా తెలుసుకుని కడుపులోనే కడతేర్చడానికి డబ్బు కావాలి. ఆ డబ్బు లేనివారు పుట్టిన తర్వాత ఆస్పత్రిలో వదిలివేయటం, చెత్తకుండీల్లో పారవేయటం, నాలాల్లో విసిరివేయటం చేస్తున్నారు. కొంతమంది కన్నతల్లులే తమ చేతులతో గొంతునులిమి చంపివేస్తున్నారు. తాము ఆడవారమే అన్న

సంగతి విద్యా విహీనులతోపాటు విద్యావంతులైన మహిళలు మరిచిపోతున్నారు. రోజు రోజుకీ ఆడశిశువుల మరణాల సంఖ్య అధికమవుతున్నది. మగ శిశువుల జనన నిష్పత్తితో పోల్చితే జనన నిష్పత్తి గణనీయంగా అన్ని రాష్ట్రాల్లోనూ (ఎక్కువ తక్కువలుగా) తగ్గిపోయింది. సమాజంలో ముందు ముందు ఇది దుష్ఫలితాలకు దారితీస్తుంది. వివాహ వ్యవస్థ కూడా దెబ్బతింటుంది. ఇకనైనా చదువుకున్న పురుషులు, స్త్రీలు దీనిని సామాజిక సమస్యగా భావించి ఆడశిశువుల హత్యలను ఆపుచేయాలి. ఆపుచేయించడానికి కృషి చేయాలి. స్వచ్ఛంద సంస్థలు, సామాజిక సేవకులు, మహిళా సంఘాలు ఈ దురాచారాలను దూరం చేయటానికి తమ వంతు కృషి చేస్తున్నాయి. ఎవరికి చేతనైనంత వారు సహకారాన్ని అందించాలి. అప్పుడే అవరోధాలన్నింటినీ అధిగమించగలుగుతాం.

ఉద్యోగినులైన మహిళలు ఇంటా బయటా సమస్యలను ఎదుర్కొంటున్నారు. ఏ కారణాలవల్లనైనా ఇంటికి ఆలస్యంగా వస్తే భర్త యక్ష ప్రశ్నలకు జవాబు చెప్పాలి. పనిచేసే చోట కొంతమంది మహిళలు పై అధికారుల, తోటి ఉద్యోగుల లైంగిక వేధింపులకు గురవుతున్నారు. గ్రామాల్లో వ్యవసాయం కుదేలవుతుంది. ఉపాధికోసం వ్యవసాయ కూలీల కుటుంబాలు పట్టణాలకు దారిపట్టాయి. కొంతమంది మహిళలు ఇళ్లల్లో పనిచేసుకుంటున్నారు. కొంతమంది మహిళలు భవన నిర్మాణ కార్మికులుగా పనిచేస్తున్నారు. వారిని మేస్త్రీలు వేధిస్తున్నారు. తమకు లొంగితేనే పని ఇస్తామని, లేకపోతే పనిలోనుంచి తీసివేస్తామని బెదిరిస్తున్నారు. దేశ రాజధాని అయిన ఢిల్లీలోనూ, మన రాష్ట్ర రాజధాని హైదరాబాదులోను ఒంటరిగా ఉన్న యువతిని కొందరు యువకులు కారులోకి గుంజుకుని కారుల్లో తిరుగుతూ ఆ యువతిపై సామూహిక అత్యాచారాలు జరిపారు. ఒక పక్క విజ్ఞానం వృద్ధి చెందుతూ రోజుకో కొత్త ఆవిష్కరణలు జరుగుతున్నాయి. టెక్నాలజీ దినదినాభివృద్ధి చెందుతోంది. మరోపక్క టెక్నాలజీని ఉపయోగించి యువతులను, మహిళలను వేధిస్తున్నారు. మొబైల్ ఫోన్లలో యువతులతో అశ్లీల సంభాషణలు, చెప్పినట్లు వినకపోతే ప్రతీకారం తీర్చుకుంటామన్న బెదిరింపులు, వారి నగ్న చిత్రాలను తీసి తల్లిదండ్రులకు, బంధువులకు పంపుతామని బ్లాక్‌మెయిల్ చేయటం ఇవన్నీ టెక్నాలజీ వేధింపులే. గ్రామాలలో చేతబడి, బాణామతి చేస్తున్నారన్న అనుమానంతో అనుమానించిన వారిని గ్రామస్థులంతా ఏకమై కిరోసిన్ పోసి సజీవంగా దహనం చేస్తున్నారు. తల్లి చేతబడి చేసినందున తన కొడుక్కి జ్వరం వచ్చిందని ఆ కసాయి కొడుకు తల్లి తలను గొడ్డలితో నరికి సైకిల్‌కి వేలాడదీసి ఊరంతా తిరిగి పోలీస్ స్టేషన్‌ల్లో లొంగిపోయాడు.

2010లో కామన్‌వెల్త్ క్రీడోత్సవాలు జరిగాయి. వివిధ దేశాల క్రీడాకారుల, క్రీడాకారిణులు పాల్గొన్నారు. హిమాచల్ ప్రదేశ్‌కు చెందిన ముగ్గురు క్రీడాకారిణులు స్వర్ణ పతకాలు విజేతలుగా తిరిగివచ్చారు. వారి మనోభావాలను తెలుసుకోవటానికి విలేకరులు వారిని కలిసారు. 17, 20సంవత్సరాల లోపు యువతులు 'మేము ఎన్ని పతకాలు సాధించినా, ఉన్నత ఉద్యోగాలు చేసినా పెండ్లి విషయంలో మాత్రం అస్వతంత్రులమని, తండ్రి కుదిరించిన వాని ముందు తలవంచవలసిందేనని వాపోయారు. వారి తండ్రులను కలిసి విలేకరులు పెండ్లిని గురించి ప్రశ్నించారు. కూతుళ్లు కోట్లు విలువచేసే పతకాలు తెచ్చినా, వేల రూపాయల ఉద్యోగాలు చేసినా మేము కుదిరించిన వారినే వివాహమాడాలి. అలా కాకుండా ప్రేమ వివాహాలను, వర్ణాంతర వివాహాలను చేసుకుంటే కనికరం లేకుండా కుత్తుకలు తెగనరకటానికి వెనకాడమని చెప్పారు. ప్రేమించి పెళ్లి చేసుకున్న జంటలను వెతికి వేటాడి గౌరవ హత్యలు అన్న పేరుతో హతమారుస్తున్నారు. మహిళలు అన్ని అవరోధాలను, ఆటంకాలను మనో ధైర్యంతో, విశ్వాసంతో ఎదుర్కొని దాటాలి. ఆకాశంలో సగం, జనాభాలో సగం అయిన మనం అన్నింటిలో సగమయ్యేవరకూ పోరాడి సాధిద్దాం!



# స్త్రీలలో రక్తహీనత

## మన దగ్గరే ఎక్కువ

మన దేశంలో సగానికి పైగా మహిళలు రక్తహీనతతో బాధపడుతున్నారు. బంగ్లాదేశ్, నేపాల్, శ్రీలంక, పాకిస్థాన్, ఇతర దక్షిణాసియా దేశాల్లో కన్నా ఇది మన దగ్గరే ఎక్కువ. ప్రముఖ వైద్య పత్రిక లాన్సెట్ తాజా అధ్యయనంలో ఈ విషయమే బయటపడింది. జాతీయ కుటుంబ ఆరోగ్య గణన ప్రకారం సంతాన సామర్థ్యం గల స్త్రీలలో 55.3 శాతం, ఐదేళ్ల లోపు పిల్లల్లో 69.5 శాతం మంది రక్తహీనతతో బాధపడుతున్నారని ఈ అధ్యయనం పేర్కొంది. ముఖ్యంగా నిరక్షరాస్యుల్లోనే ఇది ఎక్కువగా కనిపిస్తుండటం విశేషం. ప్రపంచ జనాభాలో సుమారు నాలుగోవంతు మంది రక్తహీనతతో బాధపడుతున్నారు. వీరిలో సుమారు 47కోట్ల మంది మహిళలు కాగా 30కోట్ల మంది పిల్లలు ఉన్నారు. మధ్య అల్పాదాయ దేశాల్లో కర్తహీనత తీవ్రత. దాని మూలంగా ఎదురవుతున్న ఇబ్బందులపై పరిశోధకులు అధ్యయనం చేశారు. తల్లికి రక్తహీనత ఉంటే అది బిడ్డకూ వచ్చే అవకాశం అధికంగా ఉన్నట్టు బయటపడింది. భారత్‌తోపాటు చాలా మధ్య అల్పాదాయ దేశాల్లో విద్య సామాజిక ఆర్థిక హోదాలకు రక్తహీనతతో సంబంధం ఉంటున్నట్టు దీని ద్వారా బయటపడిందని నిపుణులు చెబుతున్నారు. అభివృద్ధి చెందిన దేశాల్లో రక్తహీనత 9శాతం ఉంటే పేద దేశాల్లో ఇది 43 శాతం ఉండటం గమనార్హం. ప్రపంచ వ్యాప్తంగా రక్తహీనత మూలంగా 1.15 లక్షల మంది మహిళలు కాన్పు సమయంలో మరణిస్తున్నారు. 5.91 లక్షల శిశు మరణాలు సంభవిస్తున్నాయి. అందువల్ల రక్తహీనతను తగ్గించటానికి తగు జాగ్రత్తలు తీసుకోవాల్సిన అవసరముందని నిపుణులు సూచిస్తున్నారు.

# భ్రూణహత్యలపై సమరభేరి

- కె. స్వరూపరాణి




అఖిల భారత ప్రజాతంత్ర మహిళాసంఘం (ఐద్వా) 12వ రాష్ట్ర మహాసభలు జూన్ 27 నుండి 29 వరకు ఖమ్మం పట్టణం అహల్యా రంగ్నేకర్ నగర్ (భక్తరామదాసు కళాక్షేత్రంలో) అత్యంత ఉత్తేజపూరిత వాతావరణంలో జరిగాయి.

తెలంగాణా సాయుధ పోరాట యోధురాలు, ఐద్వా సీనియర్ నాయకురాలు మల్లు స్వరాజ్యం పతాకావిష్కరణతో సభలు ప్రారంభమయ్యాయి. 23 జిల్లాల నుండి 5,50,000ల సభ్యత్వానికి ప్రాతినిధ్యం వహిస్తూ 659 మంది ప్రతినిధులు సభకు హాజరయ్యారు. మహాసభలకు అధ్యక్ష వర్గంగా టి.జ్యోతి, ఎ.ఇ.రాణి, సి. అరుణ, వి. నిర్మల వ్యవహరించారు. 2008లో కర్నూలులో జరిగిన రాష్ట్ర మహాసభ తర్వాత ఈ కాలంలో అసువులు బాసిన నేతలకు సభ నివాళులర్పించింది. ఆహ్వాన సంఘం అధ్యక్షురాలు డా॥శైలజ సభకు స్వాగతం పలుకుతూ తొలిపలుకులు పలకగా జాతీయ కార్యదర్శి సుధాసుందరరామన్ ప్రారంభోపన్యాసం చేస్తూ ప్రపంచీకరణ విధానాల అమలు వలన మహిళలబతుకులు ఛిన్నాభిన్నమవుతున్నాయి. నిత్యం పెరుగుతున్న ధరల వలన ఆహార భద్రత లోపించి మహిళలు రక్తహీనతకు గురవుతున్నారు. ప్రజాపంపిణీని నిర్వీర్యం చేస్తూ ప్రభుత్వం నగదు బదిలీ పథకం ప్రవేశపెట్టే ఆలోచన చేస్తోంది. ఆధార్ కార్డు లేకపోతే గ్యాస్, రేషన్ కట్ అని చెపుతోంది. ప్రభుత్వాలు అనుసరిస్తున్న నూతన ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా మహిళలను సంఘటితపరిచి ఉద్యమాలు నిర్మించాలి. మరోవైపు అనేక రూపాలలో మహిళలపై ఇంటా బయటా హింస పెరిగింది. 0-6 సంవత్సరాల లోపు ఆడపిల్లల నిష్పత్తి గణనీయంగా తగ్గింది. ఉద్యమాల ద్వారా పోరాడి సాధించుకున్న చట్టాలు అమలు చేయకపోగా ఉన్న చట్టాలను (498 ఎ సెక్షన్‌ను) తొలగించేందుకు ప్రభుత్వాలు ఆలోచనచేస్తున్నాయి. మహిళా హక్కులను, చట్టాలను తొలగిస్తే మరో ఉద్యమం చేపడతామని ప్రభుత్వాన్ని హెచ్చరించారు. చట్టసభలలో 33 శాతం మహిళా బిల్లు, లైంగిక వేధింపుల బిల్లు కొరకు మహిళలు ఉధృతపోరాటాలు నిర్వహించాలన్నారు. ప్రారంభసభలో వివిధ అంశాలపై అలుపెరుగని పోరాటం చేస్తున్న మహిళల పోరాటగాథలు సభను ఆలోచింపచేసాయి.

రాజమండ్రి నుండి సభలో పాల్గొన్న అనూష మాట్లాడుతూ ప్రేమ ఉన్మాదం క్షమించరాని నేరం, దీని ఫలితంగా ఆ ఉన్మాది దాడిలో నా తల్లితండ్రులను కోల్పోయాను. ప్రేమ పేరుతో యువతులు బలయ్యే దుస్థితిని తప్పించేందుకు ప్రత్యేక చట్టాలు చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. తల్లితండ్రులు ఆడపిల్లల పెంపకంలో తీసుకుంటున్న శ్రద్ధ అబ్బాయిల పెంపకంలోనూ చూపితే ఇలాంటి దారుణాలు తలెత్తవని, కార్పొరేట్ విద్యాసంస్థలు సైతం విద్యార్థులకు ర్యాంకుల గురించే కాకుండా నైతిక ప్రవర్తన గురించి అవగాహన కల్పించాలి. నాకు జరిగిన అన్యాయానికి వ్యతిరేకంగా ఐద్వా నాకు అండగా నిలిచిందని పేర్కొంది.

ఖమ్మం జిల్లా భద్రాచలం నుండి సభలో పాల్గొన్న వెంకటమ్మ మాట్లాడుతూ హెచ్‌పివి టీకా వలన తన కూతురు మరణించిందని, తన కూతురితోపాటు మరో ముగ్గురు మృత్యువాత పడ్డారని వాక్సిన్ వేయించుకున్న ఎంతో మంది పిల్లలు అనారోగ్యానికి గురయ్యారని తెలిపింది. పేదరికాన్ని, వెనుకబాటుతనాన్ని ఆసరా చేసుకుని హాస్టల్‌లో చదువుకుంటున్న మా పిల్లలపై మా అనుమతి లేకుండానే గర్భాశయ ముఖద్వార క్యాన్సర్ నివారణకు తయారు చేసిన మందుల ప్రయోగాన్ని మా పిల్లలపై ప్రయోగించారు. ఐద్వా ఢిల్లీ నుండి ఇక్కడి దాకా ఆందోళన చేయటం వలన వ్యాక్సిన్‌ను ప్రభుత్వం నిలుపుదల చేసింది. ఐద్వా చేస్తున్న కార్యక్రమాలలో నేను కూడా పాల్గొంటానని ప్రకటించింది. విశాఖ జిల్లా ఏజెన్సీలో చైనాక్లేవ్ (తెల్లసుద్ద) తవ్వకాలకు వ్యతిరేకంగా పోరాటం చేస్తున్న కుసుమ సభలో మాట్లాడుతూ "ప్రభుత్వం తెల్లసుద్ద తవ్వకాలకు బహుళజాతిసంస్థలకు అనుమతినిచ్చింది. దీనికి వ్యతిరేకంగా

ఆందోళన చేస్తాన్నాం. భూముల పరిశీలనుక వచ్చిన అధికార్లను, ప్రజాప్రతినిధులను తరిమి తరిమి కొట్టాము. మా భూమి జోలికి వచ్చి మా బతుకులు బుగ్గి చేస్తే మా ప్రాణాలైనా ఇస్తాం కానీ మా భూములివ్వం" అని కుసుమ ప్రసంగానికి ప్రతినిధులు కరతాళ ధ్వనులతో మీకు మేమున్నాం అంటూ సంఘీభావాన్ని తెలిపారు.




గుంటూరు జిల్లా నుండి వచ్చిన రూతమ్మ సామాజిక న్యాయం కోసం జరుగుతున్న పోరాటాన్ని వివరించింది. ఆడపిల్ల పుట్టిందని భర్త పెట్టే చిత్రహింసలతోపాటు కుల పెద్దలు, కుల పంచాయితీలు కూడా భార్యా భర్తలను విడదీస్తున్నాయని ఐద్వా సహాయంతో కుల తీర్పులకు వ్యతిరేకంగా పోరాటం చేస్తున్నాం. బాధలు భరించేకన్నా తిరుగుబాటు చేస్తే పరిష్కారం దొరుకుతుందని పేర్కొంది.

మహాసభలో మల్లు స్వరాజ్యంగారు ప్రసంగిస్తూ రాజ్యాంగంలో పొందుపరిచిన హక్కులను ప్రభుత్వాలు అమలు చేయటంలేదని ఆనాటి తెలంగాణా సాయుధ పోరాటంలో ఐలమ్మ నుండి ఇప్పటి వరకూ ఎంతో మంది మహిళలు హక్కుల కోసం పోరాడుతూనే వున్నారు. మంచినీరు దొరకని గ్రామాలున్నాయి. గానీ మద్యం దొరకని గ్రామాలు లేవు. దోపిడీ పాలనకు వ్యతిరేకంగా పోరాటాలను ఉధృతం చేయాలని పిలుపునిచ్చారు. మహాసభలో 55సంవత్సరాలు దాటిన వారు 68మందివున్నారు. మహిళా ఉద్యమాలతోపెనవేసుకునిపనిచేసిన సీనియర్స్‌దండమూడి బిక్షావతి, అన్నే అనసూయ, టి.సి.లక్ష్మమ్మ, స్వరాజ్యేశ్వరమ్మ, లక్ష్మీదేవమ్మ, యార్లగడ్డజోయా, నర్సుబాయమ్మ, టి.కమలమ్మ, జయప్రద సభలో పాల్గొనటం, వారిఅనుభవాలు, కార్యకర్తలతో పంచుకోవటం యువతరాన్ని ఉత్తేజపరిచాయి. సీనియర్ నాయకులకు మెమెంటోలతో సభ సత్కరించింది.

ఐద్వా రాష్ట్ర కార్యదర్శి గత మూడు సంవత్సరాలలో ఐద్వా నిర్వహించిన కర్తవ్యాలు, విజయాలతోపాటు సంఘ నిర్మాణాన్ని గురించి నివేదిక ప్రవేశపెట్టారు. నివేదికను పరిపుష్టం చేస్తూ 48 మంది ప్రతినిధులు చర్చలలో పాల్గొన్నారు. మహాసభ కు వివిధ జిల్లాల నుండి హాజరైన కార్యకర్తలు సంఘం కృషి, పోరాటాల వలన సాధించిన విజయాలతో పాటు ప్రభుత్వాలు అనుసరిస్తున్న విధానాలవలన మహిళలు పడుతున్న అగచాట్లను వివరించారు. నూతన ఆర్థిక విధానాలు అమలు చేయటం వలన మహిళల సరిస్థితులు మరింత క్షీణిస్తున్నాయని స్త్రల మనుగడే ప్రమాదందాపురించిందని మహాసభ పేర్కొంది. సంస్కరణల వలన అభివృద్ధి సాధిస్తామని పాలకుల ప్రసంగాలు బూటకమని,నేడు సమాజంలో అంతరాలు పెరిగాయని,పేదలకు యిచ్చే సబ్సిడీలు ఎత్తివేసి కార్పొరేట్ సంస్థలకు రాయితీలు యిచ్చి ప్రోత్సహిస్తుంది. ఈవిధానాల వలన కూడు, గూడు, విద్య, వైద్యం వంటి కనీస అవసరాలకు కూడా మహిళలు దూరమవుతున్నారని మహాసభ పేర్కొంది. మోటూరుఉదయం ట్రస్టు నిర్వహిస్తున్న కార్యక్రమాలపై ట్రస్టు కార్యదర్శి పి.భారతి ప్రసంగించారు.

తగ్గుతున్న 0-6 సంవత్సరాల ఆడపిల్లల నిష్పత్తిపై మహాసభ ఆందోళన వ్యక్తం చేసింది. భ్రూణ హత్యలపై బి.సరళ అధ్యక్షతన జరిగిన సెమినార్‌లో వక్తలు డా॥నాగమణి, డా॥ రమ, పి.ఎ.దేవి, జాతీయ కార్యదర్శి సుధ ప్రసంగిస్తూ భ్రూణ హత్యలకు వ్యతిరేకంగా పిసి ఎన్‌డిటి యాక్టు అమలు కోసం క్షేత్రస్థాయి వరకూ ఉద్యమం నిర్వహించాలని పిలుపునిచ్చారు.

జాతీయ సహాయ కార్యదర్శి వాసుకి మాట్లాడుతూ క్షేత్రస్థాయిలో ప్రాథమిక కమిటీల నిర్మాణ ఆవశ్యకతను నొక్కి చెప్పారు. మూడోరోజు జాతీయ నాయకులు బృందాకరత్ సభలో ప్రతినిధులనుద్దేశించి ప్రసంగించారు. ప్రపంచీకరణ నేపథ్యంలో మహిళల సమస్యలు పెరుగుతున్నాయి. మహిళగా, వర్గ మహిళగా, పౌరురాలిగా ఎదుర్కొనే సమస్యలపై పోరాటాల ఆవశ్యకతను తెలియజేస్తూ కార్యకర్తల అధ్యయనం, స్వతంత్ర పనివిధానాన్ని అభివృద్ధి చేసుకోవాలన్నారు.

. సాధికారిత ముసుగులో ప్రభుత్వం మహిళలను మోసగిస్తోందని అసలైన సాధికారిత సాధించే ఈ క్రింది తీర్మానాలను ఏకగ్రీవంగా ఆమోదించి, వాటి అమలు కొరకు విస్తృతమైన ఉద్యమాలు నిర్వహించాలని పిలుపునిచ్చింది.

ప్రమాద ఘంటికలు మోగిస్తున్న బాలికల తగ్గుదలపై సభ ఆందోళన వ్యక్తంచేసింది. పిఎన్‌డిటి యాక్టు అమలుకొరకు ప్రభుత్వాలు సత్వరచర్యలు చేపట్టాలి. మహిళలపై పెరుగుతున్న హింసను అరికట్టాలి, వరకట్నం దురాచారాన్ని రూపుమాపాలి, వరకట్న

నిషేధ చట్టాన్ని అమలు చేయాలి, నిత్యావసర వస్తువుల ధరలు నియంత్రించాలని, ఫ్యూచర్ ట్రేడింగ్ విధానాన్ని రద్దు చేయాలి, ఆహారభద్రత కల్పించాలి-ప్రజాపంపిణీని పటిష్ట పరచాలి, డ్వాక్రా మహిళల సమస్యలు పరిష్కరించాలి, మైక్రోఫైనాన్స్ సంస్థలను నియంత్రించాలి, మద్యంఅమ్మకాలు నియంత్రిచాలి, ప్రపంచబ్యాంకువిధానాలకు లోబడి సంస్కరణల పేరుతో పట్టణ ప్రజలపై భారాలు మోపే చర్యలు విడనాడాలి, వర్షాకాల సమావేశాల్లో పార్లమెంటులో మహిళా రిజర్వేషన్ బిల్లును ప్రవేశపెట్టాలి, అసంఘటిత రంగ మహిళా కార్మికులకు వనిభద్రత-కనీస వేతనాలు కల్పించాలి,లైంగిక వేధింపులకి వ్యతిరేకంగా తయారు చేసిన ముసాయిదా బిల్లులోవున్న లోపాలను సవరించి చట్టం చేయాలి, బాలికలకు అన్ని స్థాయిల్లో నాణ్యమైన విద్యను ప్రభుత్వమే అందించాలి, ప్రజలందరికీ ప్రజారోగ్య సౌకర్యాలు కల్పించాలి, కులాల పేరుతో జరిగే గౌరవ హత్యలపై సమగ్ర చట్టాన్ని చేయాలి, సినిమా మరియు టివీ ఛానల్లో మహిళలను కించపరిచే విధంగా చూపే విధానాన్ని నిరోధించాలి, రాష్ట్ర మహిళా కమిషన్‌ను పునరుద్ధరించాలి.

శిశువిక్రయాలు అరికట్టాలని, నూతన ఆర్థిక విధానాలు-మహిళలపై ప్రభావం వంటి పలుఅంశాలపై గ్రామ,మండల జిల్లా స్థాయిల్లో ప్రత్యక్ష కార్యాచరణకు పూనుకోవాలని మహాసభ పిలుపునిచ్చింది.రాష్ట్ర సహాయకార్యదర్శి బి.ప్రభావతి అర్హతల నివేదికను ప్రవేశపెట్టారు. మహాసభ 79 మందితో నూతన కమిటీని 19 మంది ఆఫీస్ బేరర్స్‌ను ఏకగ్రీవంగా ఎన్నుకుంది. ఆహ్వానసంఘ కార్యదర్శి మచ్చా లక్ష్మి మహాసభలకు సహాయ సహకారాలు అందించిన శ్రేయోభిలాషులకు, ప్రజాసంఘాల నాయకులకు అభినందనలు తెలియజేసారు. 29వ తేదీ మధ్యాహ్నం వేలాదిమంది మహిళలు ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలను ఖండిస్తూ, అధిక ధరలను అరికట్టాలని, మద్యాన్ని నియంత్రించాలని, భ్రూణహత్యలు నిరోధించాలని, మహిళలపై హింసకు పాల్పడితే సహించం ప్రతిఘటిస్తాం అని నినదిస్తూ ఖమ్మం పురవీధులలో కదం తొక్కారు. ఎస్ఆర్ అండ్ బిజిఎన్ఆర్ డిగ్రీ కాలేజీ ప్రాంగణం నుండి ప్రారంభమైన ప్రదర్శన పెవిలియన్ గ్రౌండ్ వరకు సాగింది.

ఎర్ర అంచు తెల్లచీరలు, ఐద్వా పతాకాలు చేతబూని మహిళలు ప్రదర్శనలో పాల్గొన్నారు. ప్రదర్శన అగ్రభాగంలో 12వ మహాసభలకు చిహ్నంగా 12 మంది మహిళలు స్కూటరు ర్యాలీతోనూ, 12 మంది ఐద్వా నాయకురాళ్ళు 12 జెండాలు చేతపట్టుకుని ముందు భాగాన నడువగా మహిళా దళం డప్పు విన్యాసాలు, గిరిజన మహిళలు థింసా నృత్యం పుర ప్రజలను అబ్బురపరిచాయి. జాతీయ, రాష్ట్ర నాయకత్వం ప్రదర్శనలో పాల్గొన్నారు. పెవిలియన్‌గ్రౌండ్‌లో బి. హైమావతి అధ్యక్షతన జరిగిన బహిరంగసభలో జాతీయ నేత బృందాకరత్, జాతీయ కార్యదర్శి సుధాసుందరరామన్, సీనియర్ నాయకురాలు మల్లు స్వరాజ్యం, కె.వి.పి.ఎస్ గౌరవాధ్యక్షులు తమ్మినేని వీరభద్రం, రాష్ట్ర కార్యదర్శి కె.స్వరూపరాణి ప్రసంగించారు. ఖమ్మం జిల్లా కార్యదర్శి బుగ్గవీటి సరళ సభకు ఆహ్వానం పలుకగా రాష్ట్ర ఉపాధ్యక్షులు అఫ్రోజ్ సమీనా వందన సమర్పణ చేసారు.

**అర్హతల కమిటీ నివేదిక**

**23 జిల్లాల నుండి హాజరైన ప్రతినిధులు -659**

| | | |
|---|---|---|
| వయస్సు | -25 సం॥రాల లోపు | -27 |
| | 20-35 | -224 |
| | 36-45 | 220 |
| | 56 పైన | -39 |
| | 46-55 | -108 |
| చదువు | నిరక్షరాస్యులు | -39 |
| | ఎస్ఎస్‌సి | -386 |
| | ఇంటర్ | -48 |
| | డిగ్రీ | -64 |
| | పిజీ ఆపైన | -23 |
| తరగతి | ఎస్‌సి | -129 |
| | ఎస్టీ | -41 |
| | బిసి | -246 |
| | ఓసీ | -143 |
| | మైనార్టీ | -33 |
| వర్గం | వ్య.కా | -16లని |
| | పేదరైతు | -120 |
| | మధ్యతరగతి | -153 |
| | భూస్వామి | -5 |
| | వ్యాపారి | -23 |
| | ఇతరు | -182 |
| పెళ్ళికానివారు | | -25 |
| సంఘంలో చేరిన సం॥ | 5సం। | -159 |
| | 5-10 | -154 |
| | 11-20 | -182 |
| | 21 సం॥ పైన- | 68 |

అర్హతల కమిటీ నివేదికను నిశితంగా పరిశీలిస్తే సంఘ అభివృద్ధి సూచికలు అనేకం కనిపిస్తున్నాయి. 35సం॥ల లోపు వారు 220మంది హాజరయినారు. పై వివరం సంఘంలో పనిచెయ్యడానికి ముందుకొస్తున్న యువతుల కార్యదీక్షకు, ఉత్సుకతకు అద్దం పడుతున్నది. మారుతున్న కాలం, అవసరాలకు తగ్గట్టుగా హాజరైన ప్రతినిధులలో 620మంది ఎస్ఎస్‌సి మొదలు పోస్టు గ్రాడ్యుయేషన్ వరకు చదివిన వారున్నారు. సంఘంలో చేరిన సంవత్సరం చూస్తే 21 సం॥ల నుండి సంఘంలో పనిచేస్తున్న వారి నుండి 5సం॥ల నుంచి పనిచేసున్నవారు వున్నారు. సీనియర్లు, జూనియర్లు ఒకరి అనుభవాలు ఒకరు కలబోసుకుంటూ మహిళా ఉద్యమ దిక్సూచిగా ఐద్వాను నడపడంలో తమ వంతు కృషి చేస్తున్నారు.

**నూతనంగా ఎన్నికైన కార్యదర్శివర్గం**

ఎం. స్వరాజ్యం, ప్యాట్రన్

టి. జ్యోతి, అధ్యక్షురాలు

కె. స్వరూపరాణి, కార్యదర్శి

బి. హైమావతి, కోశాధికారి

ఆశాలత, ఎస్. పుణ్యవతి, సి. ఆరుణ, పి. నిర్మల, బి. సరళ, ఎన్. రత్నమాల, ఎ.ఇ.రాణి, కె. సుబ్బరావమ్మ, బి. ప్రభావతి, జి. విజయక్ష్మి, పి. భారతి, అఫ్రోజ్ సమీనా, బి. పద్మ, వి.సావిత్రి, ఎస్. లత. ●

# పార్వతీభాయ్ అధావతి

- వకుళాభరణం లలిత

పార్వతీభాయ్ అధావతి జీవితం ప్రత్యేకమైంది. ఆమె ఏ దేశంలో ఉన్నా భారతీయత కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. ఏమిటీ ఆ ప్రత్యేకత. ఆమె సారళ్యత, నిజాయితీలే స్త్రీలను ఉన్నత పథంలో నడిపించాయి. భారతదేశంలో వైధవ్యం పొందిన స్త్రీలు బాధపడ్డట్లు ఏదేశంలోనూ బాధపడరు. అందుకే ఆమె రాసిన "మై స్టోరీ ద ఆటో బయోగ్రఫీ ఆఫ్ ఎ హిందూ విడో" (భారతదేశంలో వైధవ్యాన్ని అనుభవించిన స్త్రీగా, ఆమెకథ) చాలా మంచి గ్రంథం. మొదట దీన్ని మరాఠీలో రాసినా, మిలియన్‌ల స్త్రీల వైధవ్య జీవితాన్ని కళ్ళకు కట్టినట్లు రాసారు. బాల్యంలోనే వివాహమై అటు తల్లి తండ్రులపైనో, ఇటు అత్తమామలపైనే ఆధారపడ్తూ జీవితంలో నానా యాతనలు పడ్తున్న వైధవ్యం పొందిన స్త్రీల గాథ ఇది.

అటువంటి స్త్రీలకు చదువుండదు. ఏ విషయంలోనూ నైపుణ్యం ఉండదు. తమకంటూ ఆస్తిపాస్తులంతకన్నా వుండవు. వాళ్లు జీవితాంతం తలకు మించిన భారాన్ని మోసి మరణంతో బానిసత్వ సంకెళ్ళను ఛేదించుకుని పరమపదిస్తారు. తాను 20వ సంవత్సరంలోనే భర్తను కోల్పోయి పడ్డపాట్లు వాటిని అధిగమించిన తీరుతెన్నులను గూర్చి తన గ్రంథంలో రాసింది.

దురదృష్టవంతులైన తన సోదరీమణులు కుంగిపోయినట్లు తాను కుంగిపోక, తానా స్థాయినుంచి పైకివచ్చి, ఆస్థాయిని తన సోదరీమణులను అందుకోమని సలహాలనిచ్చింది అధావతి. మొట్టమొదట తన బావగారైన కార్వే పండితుని వైధవ్య హోంలో పనిచేసింది. రెవరెండు జస్టిస్ ఇ. అబ్బాట్ చెప్పినట్లు "ఆమె తన 26వ ఏట విద్యాగంధం లేక తన గ్రామం నుంచి యువతలకు వచ్చింది" వైధవ్య హోంలో కాలుపెట్టిన తర్వాత ఆ సంస్థ కోసమే జీవితాన్ని వెచ్చించింది.

దక్షిణకొంకణ ప్రాంతంలో దేవరూఖ్ అనే గ్రామంలో పార్వతీభాయి 1870లో జన్మించింది. తన ఇంట్లో పుట్టిన 11 మంది పిల్లల్లో ఐదుగురు మాత్రమే బతికితే అందులో ఆమె ఒకరు. తండ్రి బాలకృష్ణకేశవ్‌జోషి, వ్యవసాయదారుడు. చిన్న వ్యాపారం కూడా చేస్తూ సొంత ఇంట్లో ఉండేవాడు. తల్లి బిడ్డల యోగక్షేమాలను చూస్తూ గడ్డికోసుకొచ్చి పశువులను మేపేది. వరి పొలాల్లో పనిచేసేది. వరి ధాన్యాన్ని దంచటం, అమ్మటం చేసేది. బావిలో నుంచి నీటిని చేదేది. ఈ పనులు చేయటంలో ఆమె అలసిపోయేది.

తండ్రికి మతమంటే మక్కువ ఎక్కువైనా ఛాందసుడు కాదు. హిందువులు ఉపయోగించే చెరువుల్లోకి హరిజనులను నీటిని తీసుకోనీయరు. అటువంటి వారికి నీటిని సరఫరాచేసిన పుణ్యాత్ముడాయన. హైందవ కుటుంబాల్లో ఆడపిల్ల పుట్టిందంటే వివాహాన్ని గూర్చి ఆలోచించేవారు. పార్వతీభాయ్ పెద్దక్కకు 7 సంవత్సరాలకే వివాహమైంది. మిగిలిన అక్కలకు 9 సంవత్సరాలకు వివాహమైంది. తనకు మాత్రం 11 సంవత్సరాలకు వివాహమైంది. అంత ఆలస్యంగా వివాహమైనందుకు తమ కులం ఎంత వ్యతిరేకిస్తుందోనని, కనీసం కూతురికి కూడా చెప్పక నెలకు 15 రూపాయల వేతనాన్ని తెచ్చుకునే ఒక అనామకునితో వివాహం జరిపించింది తల్లి.

పార్వతీభాయ్‌కి 15 సంవత్సరాలు వచ్చేసరికి మొదటి బిడ్డ పుట్టటం, ఒకేరోజులో గిట్టటం కూడా జరిగింది. 18వ ఏట ఇంకో కొడుకు పుట్టాడు అతడే నారాయణ్. తర్వాత కార్వే పండితుని స్త్రీల హోంలో రిజిస్ట్రార్‌గా ఒక విభాగానికి ప్రిన్సిపల్‌గా పనిచేసాడు. ఆమెకు 20వ సంవత్సరంలో భర్తకు మలేరియా జ్వరం వచ్చి తన సొంత గ్రామం దేవరూఖ్‌లోనే కన్నుమూసాడు. మొదటినుంచీ ఆయన ఇతరులను ఎంతో ఆదరించేవాడు. ఆస్తి పాస్తులు గానీ, అత్తమామలు గానీ లేకపోవటంతో పార్వతీభాయి పుట్టింటికి చేరింది. బిడ్డకూడా తల్లితోపాటే వచ్చాడు. అప్పటకే తన అక్కలిద్దరూ వైధవ్యాన్ని అనుభవిస్తూ పుట్టింట్లోనే ఉండేవారు. ఆ రకంగా పుట్టినింట్లో 5 సంవత్సరాలున్న సమయంలో ఆమె సోదరి ఆనందభాయ్ కార్వే పండితుణ్ణి వివాహమాడింది. ఆరోజుల్లో భర్త మరణానంతరం స్త్రీ గుండు కొట్టించుకునే ఆచారం ముఖ్యంగా భారతదేశంలోని బ్రాహ్మణ కులాల్లో ఉండేది. సోదరి పునర్వివాహం బ్రాహ్మణ సమాజాన్ని అల్లకల్లోలం చేసింది. ఈ సంక్షోభం వల్ల ఒక సంవత్సరంపాటు వారినందరినీ సంఘం నుండి వెలివేసారు కూడా. తండ్రి జోషి మనస్పూర్తిగా వివాహానికి అంగీకరించాడు. నా కూతురు పునర్వివాహం చేసుకున్నదాంట్లో ఏమాత్రం దోషంలేదు. తాము దాన్ని అంగీకరించటంలో తప్పు అంతకన్నా లేదు. సమాజం నిందిస్తే నిందించనీయమని అన్నాడు.

కార్వే దంపతులు సోదరిని తమతో వచ్చి ఉండమన్నా పార్వతి మొదట ఒప్పుకోలేదు. తన కొడుకు చదువు కోసం ఆ సంస్కర్తలతో ఉండాల్సిన పరిస్థితి ఏర్పడింది. తాను కూడా పాఠశాలలో చేరి చదువుకోవటం ప్రారంభించింది. ఆ వయస్సులో చదువుకోవటం చాలా కష్టం. అయితే అధ్యయనానికి అలవాటుపడి ఉపాధ్యాయ శిక్షణ తరగతిలో స్కాలర్‌షిప్ పొందింది. మూడు సంవత్సరాల తర్వాత ఉపాధ్యాయినిగా అనుమతి పత్రాన్ని పొందింది.

ఇంతలో కార్వే పండితునికి వితంతువుల కోసం హోం ప్రారంభించాలనే ఆలోచన తలెత్తింది. పూనా సమీపంలో 18 మంది అమ్మాయిలతో సంస్థను ప్రారంభించాడు. ఈ సంస్థలోనే పార్వతీభాయి శిక్షణ పొందిన

ఉపాధ్యాయినిగా చేరింది. బావా [illegible]గదళ్ళకు అధ్యయనకాలంలో ఎన్నో [illegible]లు జరిగాయి. ఫలితంగా తనకు గౌరవ [illegible]రువైన కార్వే పండితుని ఆధ్వర్యంలో నడిచే హోమ్‌లో చేరింది.

1902 నాటికి హోంలో మూడే గదులుండేవి. ఒకటి వంటకు, ఒకటి అ[illegible]యనానికి, ఒకటి నిద్రపోవటానికి, కార్వే పండితుడు ఆమెకు సహాయం చేయటానికి ఇంకో స్త్రీని కూడా ఇచ్చాడు. ఆమెను 'బాయా' అని సంభోదించేది పార్వతీభాయి. 1906 నాటికి ఈ సంస్థ పెరిగింది. ఎంతోమంది ఉద్యోగులు కూడా చేరినందువల్ల పార్వతీభాయికి డబ్బు వసూలు చేసేపని మాత్రమే మిగిలింది. ఈ సంస్థ ప్రచారానికి పోతూ, మొదట్లో రైలు ఖర్చును భరించటం కూడా కష్టమైన పరిస్థితుల్లో నెమ్మదిగా మంచి వక్తగా మారింది పార్వతీభాయ్. ఆమె చేసిన సేవ [illegible]రువరానిది. 1904 నుంచి 1928 వరకు [illegible]ంస్థకు కావాల్సిన ధనాన్ని పోగుచేస్తూ కాలం గడిపింది. మధ్యలో మూడు సంవత్సరాలు ఆమెరికాకు పయనమైంది. బొంబాయిలో మహిళా పర్యవేక్షకురాలిగా ఒక సంవత్సరం పనిచేసింది. ఆమె అనుభవాలు చాలా గొప్పవి. ప్రతి సంవత్సరం మూడు లేక నాలుగు వేల రూపాయలు వసూలు చేసేది. విధవాహోంకు పార్వతీభాయి ఆ రకంగా 60, 70 వేల రూపాయలను వసూలు చేయగలిగేది. రెవరెండ్‌అబ్బాట్ బొంబాయిలో 1904లో ఒక సామాజిక సమావేశంలో వేదిక మీద మాట్లాడుతుంటే విని, అబ్బురపడ్డాడు. వేలాదిమంది ప్రజలు ఆమె ఉపన్యాసానికి ముగ్ధులైనారు. కరతాళ ధ్వనులు మార్మోగాయి.

1912లో పార్వాతీభాయి తల గొరిగించుకునే ఆచారానికి స్వస్తి పలికింది. వైధవ్యాన్ని అనుభవిస్తూన్న స్త్రీలు ఆ రకంగా తమకు ఇష్టం లేకుండా తల గొరిగించుకునే పద్ధతిని వదిలివేయాలనే సందేశాన్నిచ్చింది. ఆ జుట్టు అంతకుముందులాగే పెరిగి మానవ సంబంధాల్లో ముఖ్యభాగం కావాలని కోరింది. ఇటువంటి అన్యాయమైన అలవాటుకు స్వస్తి పలకాలని స్త్రీలను కోరింది.

ఎప్పుడైతే హోంకు డబ్బు వసూలు చేయటం మొదలు పెట్టిందో ఆ పనికి ఆంగ్లభాష అవసరమైంది. 1912లో ఆంగ్లంలో ప్రాథమిక గ్రంధాన్ని అధ్యయనం చేయటం ప్రారంభించింది. 43వ సంవత్సరంలో కాన్వెంటు స్కూలుకు వెళ్ళి ఆంగ్లభాషను అధ్యయనం చేసింది. అక్కడ చదువుకుంటున్న అమ్మాయిలతో కలిసి చదువుకోవటం ఎంతో కష్టమైంది. అట్లే మూడు సంవత్సరాలు స్కాటిష్ మిషన్‌లో చేరి ఆంగ్లభాష నేర్చుకుంది. ఆమెను ఆంగ్లం మాతృభాషగా గల దేశానికి పంపించటం అవసరమని కార్వే పండితుడు భావించాడు. ప్రొఫెసర్ కొసాంబి రక్షణలో ఆమెను 1918లో హాంగ్‌కాంగ్‌కు, అక్కడ నుంచీ అమెరికాకు పంపటం జరిగింది.

ఓడలో ప్రయాణం చేస్తూ అలవాటులేని ఆహారాన్ని ఆమె తినలేకపోయింది. శాన్‌ఫ్రాన్సిస్కో చేరేటప్పటికి బలహీనంగా తయారయింది. వై.డబ్యు.సి.ఎ లో ఆమెను ఉంచితే తాను సొంతంగా సంపాదిస్తే తప్ప చదువుకోలేనన్న విషయాన్ని గ్రహించింది పార్వతీభాయ్. ఓక్‌లాండ్‌లో మిషనరీలతో కలిసి పనిచేసింది. అక్కడ ఆమె చేసిన పని గిన్నెలు కడగటం. ప్రతిరోజు 400 గిన్నెలను తోమాల్సిన పరిస్థితి ఏర్పడింది. 10 రోజులు ఆ రకంగా పనిచేసి భారతీయ విద్యార్థులతో బర్క్‌లీ విశ్వవిద్యాలయానికి వెళ్ళింది. గోఖలే ఆమెను స్కెనెక్టడీకి పంపాడు. అక్కడ పనిమనిషిగా వారానికి 5 డాలర్లు సంపాదించింది. తర్వాత అదే పనికోసం ఒక ఆసుపత్రిలో చేరింది. ఇంకో అమెరికా కుటుంబంతో కలిసి పనిచేస్తూ ఆమె న్యూయార్క్ చేరింది. ఎంతో ధైర్యంతో ముందడుగువేసిందే తప్ప ఏనాడూ వెనుకంజవేయలేదు పార్వతీభాయి. చిట్టచివరకు యన్.వై.బ్రాక్ అనే కుటుంబంలో చేరి, తాను ఆశించిన ఆశయాన్ని సాధించగలిగింది. తర్వాత హోటల్ ఆస్టోరియాలోను, మహిళా క్లబ్బుల్లోను భారతదేశ స్త్రీల దుస్థితిని గూర్చి ఉపన్యసించింది. అమెరికాలోను, భారతదేశంలోను తన స్నేహితులు చూపిన ఆదరణకు సంతోషించింది పార్వతీభాయి.

తిరుగు ప్రయాణంలో లండన్‌లో పారిస్‌లో గడిపి ఎంతో అనుభవాన్ని పొందింది. పారిస్‌లో రవీంద్రనాథ్ పార్టీని కలుసుకుంది. వాళ్ళతో కలిసి బొంబాయి చేరింది. ఆ ప్రయాణంలో ఎన్నో గంటలు చంద్రుని చల్లదనాన్ని అనుభవిస్తూ రవీంద్రనాథ్ ఠాగూర్ అమూల్యమైన మాటలను విని పొంగిపోయింది. "ఆ చల్లని రాత్రులను, ఆ అనుభవాలను నేను జీవితంలో మరువలేను" ఆమె అన్నారు. 1920 జులైలో బొంబాయికి వచ్చిన ఆమె విడో హోం చేరింది.

ఆమె జీవితగాథలో ఈ రకంగా చెప్పారు. "సోదర సోదరీ మణురాలా! స్త్రీ మహిళా శ్రేయస్సుకోసం ముఖ్యంగా వైధవ్యాన్ని అనుభవిస్తున్న స్త్రీల కోసం ఈ గ్రంధాన్ని అంకితం ఇస్తున్నాను"ఈ దేశ సోదర సోదరీమణుల అభివృద్ధి కోసం ఆమె గ్రంధాన్నే కాదు, జీవితాన్ని అర్పించింది. ముఖ్యంగా మహిళల్లో ఎన్నో చేదు అనుభవాలను అనుభవిస్తున్న వైధవ్యం పొందిన స్త్రీల కోసం తన విలువైన కాలాన్ని అర్పించింది. వారి కోసమే తన కన్నీరు.

మహిళామణుల్లోనే మణిపూస అయిన పార్వతీభాయి జీవితం ఎంతో ఆదర్శవంతమైంది. ఆమె జీవిత అనుభవాలు, వైధవ్యం అనుభవించిన మహిళల కన్నీరు పోగొట్టడానికి చేసిన అపురూప కానుకగా, పరిస్థితుల వలయంలో చిక్కుకుని నిరాశ చెందక ముందుకు చొచ్చుకుపోయే మార్గదర్శకురాలిగా మిగిలింది.

●

# ఆహార భద్రత బిల్లు

# ఇచ్చేది తక్కువ-హరించేది ఎక్కువ

- బృందాకరత్

దీర్ఘకాలంగా ఎదురుచూస్తున్న ఆహార భద్రతా బిల్లును మంత్రుల బృందం ఖరారు చేసింది. దేశంలో అపారమైన ఆహార ధాన్యాలు నిల్వ ఉండి వాటిని పెద్ద మొత్తంలో విదేశాలకు ఎగుమతి చేయనున్న నేపథ్యంలో పౌష్టికాహార లోపం సమస్యను పరిష్కరించేందుకు ఒక బిల్లును తీసుకురావాల్సి రావడం సిగ్గుచేటయిన వాస్తవం. మంత్రుల బృందం ఖరారు చేసిన ఆహార భద్రతా బిల్లును పార్లమెంటు ప్రస్తుత రూపంలో ఆమోదించరాదు. ఈ ప్రతిపాదిత బిల్లులో సానుకూల అంశాల కంటే ప్రతికూల అంశాలే ఎక్కువగా ఉన్నాయి. అసలు బిల్లు మౌలిక స్వరూపమే ప్రశ్నార్థకంగా ఉంది. లబ్దిదారుల సంఖ్యను వారి అర్హతలను నిర్దేశించడం, చేపట్టాల్సిన పథకాలను రూపొందించే అధికారాలన్నింటినీ ఈ బిల్లు కేంద్ర ప్రభుత్వానికి కట్టబెట్టింది. రాష్ట్ర ప్రభుత్వాలపై కూడా ఈ బిల్లు భారాన్ని మోపుతోంది. అపారమైన ఆహార ధాన్యాల నిల్వల కారణంగా అవకాశం ఉన్నప్పటికీ సార్వత్రిక ప్రజాపంపిణీ వ్యవస్థ మౌలిక అవసరాలను తీర్చడానికి బదులు ప్రజలు, రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రస్తుతం ఉన్న హక్కులను హరించేదిగా ఉంది.



ఈ బిల్లు అర్హులైన కుటుంబాలను తగ్గిస్తుంది. లక్షిత ప్రజాపంపిణీ వ్యవస్థను దారిద్రరేఖకు ఎగువన (ఏపిఎల్) దిగువన (బిపిఎల్) ఉన్న 18.03 కోట్ల కుటుంబాలకు పిడిఎస్ వర్తిస్తుందని 2010 ఫిబ్రవరిలో జరిగిన రాష్ట్రాల ముఖ్యమంత్రుల సమావేశంలో సమర్పించిన ఎజెండా పత్రం పేర్కొంది. ఇది కేంద్ర ప్రభుత్వం అంచనా వేసిన జనాభాలో 90 శాతం జనాభాతో సమానం. అయితే గ్రామీణ ప్రాంతాల్లోని 75 శాతం కుటుంబాలకు, పట్టణాల్లోని 50 శాతం కుటుంబాలకు మాత్రమే ఈ బిల్లును పరిమితం చేసారు. ఫలితంగా ఏపిఎల్ కుటుంబాలతోసహా లక్షలాది కుటుంబాలకు పిడిఎస్ వర్తించబోదు.

### అర్హుల సంఖ్య తగ్గింపు

ఇక రెండవ అంశం, బిపిఎల్ కుటుంబాలపై రాష్ట్ర ప్రభుత్వాల అంచనాలను బిల్లు విస్మరిస్తుంది. కేంద్ర ప్రభుత్వం 6.52 కోట్ల కుటుంబాలకు చెందిన వారిని పేదలుగా గుర్తించింది. రాష్ట్ర ప్రభుత్వాలు 11.03 కోట్ల కుటుంబాలను బిపిఎల్ కుటుంబాలుగా గుర్తించాయి. దేశ జనాభాలో 56 శాతం మంది ఈ జాబితాలో ఉన్నారు. అయితే మంత్రుల బృందం ఖరారు చేసిన బిల్లు గ్రామీణ ప్రాంతాల్లో 46 శాతం, పట్టణాల్లో కేవలం 28 శాతం జనాభాను మాత్రమే బిపిఎల్ పరిధిలోకి తీసుకువచ్చింది. ప్రణాళికా సంఘం నిర్ధారించిన అమానుషమైన దారిద్ర్యరేఖ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల జనాభా అంచనాల మధ్య తేడాకు ప్రధాన కారణంగా ఉంది. ఈ బిల్లులోని సెక్షన్ 13(1) కేంద్ర ప్రభుత్వం ప్రతి రాష్ట్రంలో ప్రాధాన్యతా బిపిఎల్ కుటుంబాలను నిర్ణయిస్తుంది. జాతీయ సలహా మండలి (ఎన్ఎసి) రూపొందించిన బిల్లును ప్రభుత్వం సాకుగా చూపుతోంది. కేంద్ర ప్రభుత్వం నోటిఫై చేసిన అంశాల ప్రాతిపదికగా ప్రాధాన్యతా కుటుంబాలను నిర్ణయిస్తారని ఎన్ఎసి ముసాయిదా బిల్లులోని 21వ సెక్షన్ స్పష్టం చేస్తోంది. ప్రాధాన్యతా కుటుంబాలను నిర్ణయించడంతోపాటు పిడిఎస్ సేవలను ఎవరెవరికి ఉపసంహరించాలో కూడా తెలియజేసే మార్గదర్శక సూత్రాలను కేంద్ర ప్రభుత్వమే రూపొందిస్తుంది. బిపిఎల్ సర్వేలో ఏమి వెల్లడైనప్పటికీ గ్రామీణ ప్రాంతాల్లోని కుటుంబాల్లో దాదాపు 25 శాతం మంది కనీసం ఏపిఎల్ కార్డులను కూడా పొందలేరు. ఆహార హక్కు గురించి ప్రచారం చేయాల్సిన ఎన్ఎసి ఇటువంటి అనుచిత విధానాన్ని ఆమోదించటం దురదృష్టకరం. ప్రణాళికా సంఘం రూపొందించిన లోపభూయిష్టమైన విధానానికి సోనియాగాంధీ, అనేకమంది సామాజిక కార్యకర్తలు సభ్యులుగా గల జాతీయ సలహా మండలి న్యాయప్రతిపత్తి కల్పించడం ఆహార భద్రతా చట్టం అసలు లక్ష్యాన్నే హరిస్తుంది.

### కోటా కుదింపు

ఈ బిల్లు ఇంతకుముందు నిర్ణయించిన కేటాయింపులపై కోత విధిస్తుంది. పిడిఎస్ కోటా ప్రస్తుతం కుటుంబానికి 35 కిలోలు కాగా దానిని ఒక్కొక్క సభ్యునికి ఏడు కిలోలుగా నిర్ణయించారు. సభ్యుల సంఖ్య ప్రాతిపదికగా అమలయ్యే వ్యవస్థ సముచితంగా ఉన్నట్లు కనిపిస్తున్నప్పటికీ తక్కువ సభ్యులున్న పేద కుటుంబాలకు ఇది నష్టం కలుగజేస్తుంది. ఉదాహరణకు దేశంలోని ఇతర ప్రాంతాల కుటుంబ సభ్యులకంటే సాధారణ కుటుంబ సభ్యుల సంఖ్య తక్కువగా ఉండే కేరళ వంటి రాష్ట్రాల్లో ప్రస్తుతం ఇస్తున్న కోటాను (కుటుంబానికి 35 కిలోలు) తగ్గించనున్నారు. నలుగురు సభ్యులుగల కుటుంబం ఇకముందు 28 కిలోల ఆహార ధాన్యాలను మాత్రమే పొందుతుంది. కుటుంబానికి కనిష్ట కోటాను 35 కిలోలుగా నిర్ణయించి ఐదుగురు కంటే ఎక్కువ మంది సభ్యులుగల కుటుంబానికి అదనంగా కొంత మొత్తం కేటాయించే విధానం ప్రవేశపెట్టడం సమంజసంగా ఉంటుంది. ఎపిఎల్ కుటుంబాల పరిస్థితి మరింత దుర్భరంగా ఉంది. ఆ కుటుంబాలకు సభ్యునికి మూడు కిలోల చొప్పునే ఆహార ధాన్యాలను కేటాయిస్తున్నారు. మూడు కిలోలతోనే ఆహార భద్రత చేకూరుతుందా? ఈ బిల్లు సామాజిక అవగాహనారాహిత్యాన్ని విశదం చేస్తోంది. ఒక వయోజన సభ్యునికి ఉన్న అర్హత కుటుంబంలోని పిల్లలకు కూడా ఉంటుందా అనే విషయం స్పష్టం కావాల్సి ఉంది. వారికి కూడా వయోజనుల మాదిరిగా ఏడు కిలోల రేషన్ ఇస్తారా? ఈ విషయం గురించి బిల్లులో ఎటువంటి ప్రస్తావనాలేదు.

ఇక నాల్గవది ధరలకు సంబంధించిన సమస్య. సుమారు పది రాష్ట్రాల్లో బిపిఎల్ కుటుంబాలకు కిలో రెండు రూపాయల బియ్యం పథకం అమలు చేస్తున్నారు. తమిళనాడులో కిలో బియ్యం ఒక రూపాయికే సరఫరా చేస్తున్నారు. కొన్ని వర్గాలకు ఉచితంగా కూడా సరఫరా చేస్తున్నారు. ప్రతిపాదిత ఆహార భద్రతాబిల్లు ఈ ప్రత్యేక పథకాలను విస్మరిస్తోంది. అయితే ఈ ధరలను ఎప్పుడైనా మార్చేహక్కు కేంద్ర ప్రభుత్వానికి ఉంది. రైతులకు చెల్లించే కనీస మద్దతు ధరల్లో 50 శాతం ధరలకు బియ్యం, గోధుమలను ఎపిఎల్ కార్డుదారులకు సరఫరా చెయ్యాలని బిల్లులోని ఒకటవ షెడ్యూల్ నిర్దేశిస్తోంది. ప్రస్తుతం ఉన్న నిర్దిష్ట ధరకు కాకుండా కనీస మద్దతు ధర ప్రాతిపదికగా ధరను నిర్ణయించడం వల్ల ఈ ధరలు నిలకడగా ఉండవు. ప్రతి సంవత్సరం కనీస మద్దతు ధరను పెంచాలని రైతులు చేసే సమంజసమైన డిమాండ్‌కు అనుగుణంగా పిడిఎస్ ధరలు పెరుగుతూ ఉంటాయి. ఈ బిల్లు వినియోగదారులు, రైతుల మధ్య వివాదానికి దారితీసే అవకాశం ఉంది. రైతులు కనీస మద్దతు ధరను పెంచాలని డిమాండ్ చేస్తుంటారు. మరోవైపు ఎపిఎల్ కార్డుదారుల ప్రయోజనాలు ఎంఎస్‌పి ధరలు తక్కువగా ఉండటంపై ఇమిడిఉన్నాయి.

### ఎపిఎల్ కుటుంబాల పట్ల వివక్ష

ఈ బిల్లు ఎపిఎల్ కుటుంబాల పట్ల పూర్తి వివక్షత ప్రదర్శిస్తోంది. ఎపిఎల్ కుటుంబాల సంఖ్యను భారీగా తగ్గించడంతోపాటు వారికి సరఫరా చేసే కోటాను తగ్గించడం శోచనీయం. కుటుంబంలోని ప్రతి వ్యక్తికీ ఐదు కిలోల చొప్పున లేదా కుటుంబానికి పదిహేను కిలోల చొప్పున గరిష్ట కోటాను నిర్ణయించారు. ఈ విధానం ఆహార భద్రతను అవహేళన చేస్తుంది. ఈ కోటా ధర నిర్ణయం కూడా పూర్తిగా లోపభూయిష్టంగా ఉంది. ప్రస్తుతం ఎపిఎల్ కుటుంబాలకు గోధుమ కిలోకు రూ॥6.10న, బియ్యం రూ॥8.30కు సరఫరా చేస్తున్నారు. ఎపిఎల్ కుటుంబాల సంఖ్యను తగ్గించడంతోపాటు వారికి సరఫరా చేసే ఆహార ధాన్యాల కోటాను తగ్గిస్తారు. ధరను కూడా పెంచుతారు.

నయా ఉదారవాద విధానాలను ముందుకు తీసుకెళ్ళేందుకుగాను చేపట్టాల్సిన సంస్కరణలను కూడా ఈ బిల్లులో పొందుపరిచారు. ఆహార ధాన్యాలను లక్షిత లబ్ధిదారులకు సబ్సిడీపై అందించడానికి బదులుగా నగదు రూపంలో చెల్లించాలని ఈ బిల్లులోని 13వ అధ్యాయం సెక్షన్ 3(జి) నిర్దేశిస్తోంది. దీనిని ఏయే ప్రాంతాల్లో, ఏ విధంగా అమలు చేయాలో కేంద్ర ప్రభుత్వం నిర్ణయిస్తుంది. భారతదేశంలో అమలువుతున్న సామాజిక రక్షణా పథకాలపై జరిపిన విశ్లేషణలో ప్రపంచ బ్యాంక్ చేసిన సిఫార్సులకు అనుగుణంగా ఈ పథకాన్ని ప్రవేశపెట్టారు. ఎక్కువ మంది నిపుణులు వ్యతిరేకిస్తున్న నగదు బదిలీ పథకాన్ని తప్పనిసరి చేసారు. దీనిని విధిగా అమలు పరచాలని రాష్ట్ర ప్రభుత్వాలను ఆదేశించారు. ప్రజాపంపిణీ వ్యవస్థలో సంస్కరణల పేరుతో నగదు బదిలీ పథకాన్ని ప్రవేశపెడుతున్నారు. కేంద్ర ప్రభుత్వం జారీ చేసిన మార్గదర్శక సూత్రాల ప్రకారం అర్హతగలవారికి నిర్ణీత కోటాను సరఫరా చేసేందుకు నిరాకరిస్తే నష్టపరిహారం చెల్లించే బాధ్యత రాష్ట్ర ప్రభుత్వానిదేనని బిల్లు నిర్దేశించింది. అయితే ఏయే పరిస్థితుల్లో ఈ నష్టపరిహారం చెల్లించాలో కూడా కేంద్ర ప్రభుత్వం నిర్ణయిస్తుంది. ఐదు వేల రూపాయలను గరిష్ట పరిమితిగా నిర్ణయించారు. బాధ్యులను ప్రాసిక్యూట్ చేసే అవకాశాన్ని ఈ బిల్లు కల్పించలేదు. సకాలంలో కోటాను సరఫరా చేయకపోతే కేంద్రం ఇందుకు బాధ్యత వహించబోదు.

ఆధార్ కార్డులు లేదా బయోమెట్రిక్ సమాచారం ప్రాతిపదికగా విశిష్ట గుర్తింపు కార్డుల వ్యవస్థతో దీనిని అనుసంధానం చేసారు. ఆధార్ కార్డులను తప్పనిసరి చెయ్యాలని ఈ చట్టం నిర్దేశించింది. పిడిఎస్‌లో అసలు సమస్య గుర్తింపు కారణంగా ఉత్పన్నమయ్యే అవినీతి కాదు (దీనిని యుఐడి ద్వారా పరిష్కరించాలని భావిస్తున్నారు) ప్రయివేటు వర్తకులకు సరుకులను దొంగచాటుగా సరఫరా చెయ్యడం అసలు సమస్య. ఈ టెక్నాలజీలో అనేక పొరపాట్లు జరిగే ఆస్కారం ఉంది. శారీరక శ్రమ చేసేవారు అత్యధిక సంఖ్యలో ఉండే భారత్‌లో 15 నుండి 20 శాతం పొరపాట్లు చోటుచేసుకునే అవకాశం ఉంది. బయోమెట్రిక్ సమాచారాన్ని తప్పనిసరి చెయ్యడం ఈ పథకం నుండి వారిని తప్పించడానికే ఉపయోగపడుతుంది.

### సానుకూల అంశాలు

బిల్లులో కొన్ని సానుకూల అంశాలు కూడా ఉన్నాయి. మధ్యాహ్నభోజన పథకాన్ని ఈ బిల్లు పరిధిలోకి తీసుకురావడం ఇందులో ముఖ్యమైంది. గర్భిణీలు, ప్రసవించిన ఆరు మాసాల వరకు బాలింతరాళ్ళకు వండిన పౌష్టికాహారాన్ని అందించడం ఎంతో ఉపయోగకరం. నిరాశ్రయులకు, వలస కార్మికులకు కమ్యూనిటీ వంటశాలల ఏర్పాటు, ఆకలి బాధితులుగా గుర్తించిన కమ్యూనిటీలు లేదా గ్రూపులకు ప్రత్యేక

సదుపాయాలు కల్పించడం వంటి ఇతర సదుపాయాలు కూడా ఉన్నాయి. అయితే వికలాంగులను విస్మరించడం, వారికి ఎటువంటి సదుపాయాలూ కల్పించడకపోవడం పెద్ద వెలితిగా ఉంది.

మరి ఈ పథకానికి నిధులు ఎక్కడ నుండి వస్తాయి? కేంద్ర ప్రభుత్వం ప్రతిపాదించిన ఈ ఉచిత పథకాలు అమలు చేసేందుకు అయ్యే ఖర్చును రాష్ట్ర ప్రభుత్వం భరించాల్సికేంద్ర ప్రభుత్వం ప్రతిపాదించిన ఈ ఉచిత పథకాలు అమలు చేసేందుకు అయ్యే ఖర్చును రాష్ట్ర ప్రభుత్వం భరించాల్సి వుంటుంది. పేద ప్రజలు ఎక్కువ భాగం నివశించే పరిమిత వనరులున్న రాష్ట్రాలు ఈ ఖర్చును భరించలేవు. ఇప్పటికే విద్యాహక్కు చట్టం ఆచరణలో పలు సమస్యలను ఎదుర్కొంటోంది. రాష్ట్ర స్థాయిలో వనరులు లేకపోవటం ఇందులో ప్రధానమైనది. ఆహార భద్రతా బిల్లుకు కూడా అటువంటి పరిస్థితే ఏర్పడే ప్రమాదం ఉంది. వనరుల లేమి ఈ పథకానికి శాపంగా పరిణమించనుంది.

సార్వత్రిక పిడిఎస్‌లకు నిధుల కేటాయింపు బాధ్యత నుండి పూర్తిగా వైదొలగాలనే ప్రభుత్వ ఆకాంక్షను ఈ బిల్లు స్పష్టం చేస్తోంది. మరోవైపు కోటాలను, లబ్ధిదారుల సంఖ్యను తగ్గించడం ప్రభుత్వ ధ్యేయంగా ఉంది. ఇవే ఈ బిల్లులోని ముఖ్యమైన ప్రాతిపదికలు. గ్రామీణ ఉపాధిహామీ పథకం, అటవీ హక్కుల చట్టం విషయంలోనూ ఇదే అనుభవం ఎదురైంది. తొలి యుపిఏ ప్రభుత్వం వామపక్షాల మద్దతుపై ఆధారపడినది కావడంతో లెఫ్ట్ హెచ్చరికలకు దిగొచ్చి ఈ చట్టాల్లో కీలకమైన మార్పులు తీసుకొచ్చింది. పార్లమెంటులో వామపక్షాల బలం తగ్గడంతో, ఎన్ఏసి మౌలిక అంశాలపై రాజీపడుతుండటంతో బిల్లులో ప్రజానుకూలమైన సవరణలు తీసుకొచ్చేందుకు విస్తృత పోరాటాలే మార్గం వుంటుంది. పేద ప్రజలు ఎక్కువ భాగం నివశించే పరిమిత వనరులున్న రాష్ట్రాలు ఈ ఖర్చును భరించలేవు. ఇప్పటికే విద్యాహక్కు చట్టం ఆచరణలో పలు సమస్యలను ఎదుర్కొంటోంది. రాష్ట్ర స్థాయిలో వనరులు

లేకపోవటం ఇందులో ప్రధానమైనది. ఆహార భద్రతా బిల్లుకు కూడా అటువంటి పరిస్థితే ఏర్పడే ప్రమాదం ఉంది. వనరుల లేమి ఈ పథకానికి శాపంగా పరిణమించనుంది.

సార్వత్రిక పిడిఎస్‌లకు నిధుల కేటాయింపు బాధ్యత నుండి పూర్తిగా వైదొలగాలనే ప్రభుత్వ ఆకాంక్షను ఈ బిల్లు స్పష్టం చేస్తోంది. మరోవైపు కోటాలను, లబ్ధిదారుల సంఖ్యను తగ్గించడం ప్రభుత్వ ధ్యేయంగా ఉంది. ఇవే ఈ బిల్లులోని ముఖ్యమైన ప్రాతిపదికలు. గ్రామీణ ఉపాధిహామీ పథకం, అటవీ హక్కుల చట్టం విషయంలోనూ ఇదే అనుభవం ఎదురైంది. తొలి యుపిఏ ప్రభుత్వం వామపక్షాల మద్దతుపై ఆధారపడినది కావడంతో లెఫ్ట్ హెచ్చరికలకు దిగొచ్చి ఈ చట్టాల్లో కీలకమైన మార్పులు తీసుకొచ్చింది. పార్లమెంటులో వామపక్షాల బలం తగ్గడంతో, ఎన్ఏసి మౌలిక అంశాలపై రాజీపడుతుండటంతో బిల్లులో ప్రజానుకూలమైన సవరణలు తీసుకొచ్చేందుకు విస్తృత పోరాటాలే మార్గం. ★

# అమ్మలకు అమ్మ అమ్మమ్మ

– వి. శ్రీనివాసరావు

లక్ష్మీదేవమ్మగారు రాసిన మాఅమ్మమ్మకథ చదివాక ఆపుస్తకం గురించి నాలుగుమాటలు రాయాలనిపించింది. చూసేసేందుకు చిన్న పుస్తకంలాగానే అనిపించిన, చదివాక సూదంటూరాయిలా ఆకట్టుకుంది. ప్రతిఅక్షరంలోనూ మానవత్వం ఉట్టిపడుతుంది. దుష్టసమాజాన్ని అడుగడుగునా ప్రశ్నిస్తుంది. అన్యాయాలను ఎదిరించాలన్న సందేశం ఇస్తుంది. సమాజమార్పుకోసం ఆక్రోశిస్తున్న ఆమె హృదయం కనిపిస్తుంది. అందులో అమ్మమ్మ కథమాత్రమే కాదు వర్తమాన సమస్యలనేకం చర్చించారు. వైవిధ్యభరితమైన అనేక అంశాలను హృద్యంగా మలిచారు. ఒక చిన్న పుస్తకంలో ఇన్ని విషయాలను ఎంతో చక్కగా వివరించవచ్చని ఆమె నిరూపించారు. 1971 నుండి 2010 వరకు వివిధ పత్రికలకు రాసిన వ్యాసాలు, కవితలు ఇందులో పొందుపరిచారు. ఈ రూపంలో పుస్తకాన్ని అందించిన, లక్ష్మీదేవమ్మగారు అభినందనీయులు.

లక్ష్మీదేవమ్మగారు అమ్మమ్మ జీవితకాలం ఇందులో పేర్కొనకపోయినా బహుశా ఇప్పటికి డెబ్బయిఐదు లేదా ఎనభైఏండ్ల క్రితం అయి ఉండొచ్చు అంటే సుమారు 1920లలో అన్నమాట. నాడు నిజాంనిరంకుశపాలనకు వ్యతిరేకంగా తెలంగాణాలో ప్రజాస్వామిక భావాలు వికసిస్తున్నరోజులు. నాడు వనపర్తి లాంటి సంస్థానాల్లో పరిస్థితి ఎలా ఉండేదో దాశరథి రంగాచార్య రాసిన మోదుగుపూలు, చిల్లర దేవుళ్లు వంటి నవలల్లో మనకు కనిపిస్తుంది. అలాంటి ప్రభావాలు పరోక్షంగా సమాజంపై పడతాయి అందులో ఒకరు చెన్నమ్మగారు. అంటే లక్ష్మీదేవమ్మగారి అమ్మమ్మ. భావాలు భౌతికపరిస్థితులను నిర్ణయించవు, తద్విరుద్ధంగా భౌతికపరిస్థితుల నుండే భావాలుద్భవిస్తాయన్న మార్క్స్ మాటలు అక్షరసత్యాలని చెన్నమ్మ అనే సామాన్య వనిత నిరూపించారు. మారుతున్న సమాజం దానికనుగుణంగా మారాలనుకుంటున్న వారిలో వస్తున్న భావసంఘర్షణ ఇందులో లక్ష్మీదేవమ్మగారు చిత్రీకరించారు. ఆ అమ్మమ్మ ప్రభావంతోనే తాను కూడా రూపుదిద్దుకున్నట్లు లక్ష్మీదేవమ్మగారు ప్రకటించారంటే ఆభావాలు ఎంత బలంగా ఉంటాయో మనం ఊహించుకోవచ్చు. ఆ పునాదితోనే తాను కమ్యూనిస్టునయ్యానని కూడా ఆమె గర్వంగా చెప్పుకున్నారు.

లక్ష్మీదేవమ్మగారు తాను మాటల మనిషిని కాదని, చేతల మనిషిని ఆచరణ ద్వారా నిరూపించారు. ఒట్టిమాటలు కట్టిపెట్టోయ్ గట్టిమేలు తల పెట్టవోయ్ అన్న గురజాడ సూక్తి ఆమెను చిన్నతంలోనే ప్రభావితం చేసింది. తన కుంటుబాన్ని యావత్తు కమ్యూనిస్టు లేదా అభ్యుదయభావాలతో తీర్చిదిద్దేందుకు ఆమె ప్రయత్నించడమే కాదు సఫలమయ్యారు కూడా. తానే ఇప్పుడు ఒక అమ్మమ్మ. అనేకమంది అమ్మలకు అమ్మ పిల్లలను ఎలా తీర్చిదిద్దేందుకు ఆమె చెప్పిన తీరు, చిట్కాలు చాల గొప్పవి. పిల్లలను ఎలా పెంచాలి? అంటూ చైతన్యమానవి పత్రికలో రాసిన వ్యాసం ఇలాంటి కొన్ని చిట్కాలను మనకు అందిస్తుంది. కుటుంబబాధ్యత, సామాజిక స్పృహతో కూడిన పిల్లల పెంపకం వారి

(మిగతా 34వ పేజీలో)

# మారకపు విలువలే తప్ప మానవ విలువలు పట్టని ప్రకటనలు

- ఎ. రవి




"ఇందుగలడందులేడని సందేహం వలదు ఎందెందు వెదికినా అందందే కలదు"..... ఈ మాటలు తెలుగు ప్రజలందరికీ సుపరిచితమే.

భగవంతుడెక్కడ? అనే ప్రశ్నకు చెప్పే జవాబిది. భాష, పదాల పొందికలో మార్పు అన్ని మతాల వారు కూడా చెప్పే జవాబిదే.

ఈ మాటలు దైవం పట్ల విశ్వాసం ఉన్నవారికి సత్యం. విశ్వాసం లేనివారికి అసత్యం..

అయితే ప్రస్తుతం విశ్వాసాలతో నిమిత్తం లేకుండా పైమాటలు వర్తించేది మాత్రం సరుకుకే-వాటిని కొనమనే వాణిజ్య ప్రకటనలకే. ఈ ప్రకటనలను చూస్తే సర్వం సరుకుతోనే సాధ్యమనిపిస్తాయి. మానవునిలోని విశిష్టతలు, నవరసాలతోపాటు సహజసిద్ధ గుణాలన్నీ సరుకుతోనే సొంతమవుతాయి. మానవత్వం, దేశసేవ కూడా సాధ్యమన్పిస్తాయి.

కోపాన్ని మింగేయాలంటే సహనం అక్కర్లేదు. 7 అప్ డ్రింక్ త్రాగితే చాలు. ఆశ్చర్యం కలగాలంటే ప్రపంచంలో ఏడు వింతలు చూడక్కర్లేదు. రెక్సోనా సబ్బుల ప్యాక్‌పైన 9 రూపాయల తగ్గింపు చూస్తేచాలు. శరీరానికి శక్తి కావాలంటే శారీరక శ్రమతోపాటు పౌష్టికాహారంతో పనిలేదు. గ్లాసుడు బూస్ట్ త్రాగితే చాలు కావలసినంత వస్తుంది. జ్ఞానం కావాలంటే అధ్యయనంతో పనిలేదు. రోజుకు గ్లాసుడు గ్లూకోవీటా త్రాగితే సరి.

మానవునికి మానవత్వం, సంస్కారం వంటి విశిష్ట గుణాలు సంతరించుకోవాలంటే సమాజం నుండి నేర్చుకున్న కాసింత విశాల దృక్పథం అవసరంలేదు. ××× బట్టల సబ్బుతో ఉతికిన బట్టలు వేసుకుంటే వాటంతటవే వచ్చేస్తాయి. స్నేహమే జీవితం, స్నేహమే శాశ్వతం కావాలంటే స్నేహితుల మధ్య సదభిప్రాయంతో పనిలేదు. మలబార్ గోల్డ్ [illegible] కొన్న బంగారు ఆభరణాలు [illegible]గా ఇస్తేసరి. దేశసేవ చేయాలంటే కాసింత సమయం, విస్తృత ఆలోచనలతో సమయం వృధా. తమ బ్రాండ్ల ఉత్పత్తులు కొంటే పేదపిల్లలకు బడులు (శిక్షా) పెట్టించొచ్చు.

ఇవన్నీ ఎందుకు అన్నీ కలగలసిన సంపూర్ణ మానవునిగా మారాలంటే రేమండ్స్ బట్టలు తొడిగితే సరి. ఆహారానికే రోజూ 20 రూపాయలు మించి ఖర్చు చేయలేని 70 కోట్లమందికి వేల రూపాయలు పెట్టి రేమండ్స్ బట్టలు కొనలేరన్న విషయం తెలియందేమీ కాదు. అంటే వీరు సంపూర్ణ మానవులు కాలేరన్నది (వీరు చెప్పే సంపూర్ణ మానవులు) ప్రత్యేకంగా చెప్పేదేమీలేదు. ప్రేమ పుట్టినప్పటి నుండి పిల్లలు పుట్టే వరకూ భార్యాభర్తల మధ్య ఉండాల్సిన పరస్పర అవగాహన అక్కర్లేదు. "చెవ్రోలెట్" కారులో ప్రయాణిస్తే సరి. కుటుంబ సభ్యుల మధ్య ప్రేమ, కలహం, శాంతి, ప్రణయంతో కూడిన సంతోషాలకు "నానో" కారు డోరు తాళం తీస్తే అన్ని మన చేతుల్లోనే. భర్తకు పెళ్ళిరోజు గుర్తుండడమంటే నిరంతరం పనిచేసే 'సిఆర్‌బి కాన్స్టోల్' లాగే భార్యకు బంగారు ఆభరణాలు కానుకలివ్వాలట. ఇంత ఖరీదైన ప్రేమలు ఎందరికి సాధ్యం. అంటే సరుకుల ప్రకటనలకు ఏ మానవ విలువలు అవసరం లేదు. వారికి కావల్సింది మారకపు విలువలు మాత్రమే.

సరుకుల ప్రకటనల్లో ఇదో పార్శ్వం మాత్రమే. అన్నింటా విరుద్ధాంశాలున్నట్లే వీటిల్లోనూ మరో పార్శ్వం చూడొచ్చు. అన్ని విలువలూ తమ సరుకులతోనే సమకూరుతాయని చెప్తాయి. అంతే విరుద్ధంగా మానవుడు సుఖంగా, యదేచ్ఛగా జీవించడానికి ఏ విలువలూ అవసరం లేదంటాయి.

ప్రేయసి పక్కన ఉండగానే మరో అమ్మాయిని చూడటమెలా? చిట్కా కావాలా? "స్ప్రైట్" త్రాగితే కావాల్సినన్ని చావు తెలివితేటలు తన్నుకువస్తాయి. ఎక్కడైనా, ఎప్పుడైనా, ఎవరితోనైనా, ఎలాగైనా ముక్కు మొహం తెలీని మగాడితో పలువురు మహిళల సాంగత్యం కావాలంటే తమ కంపెనీల స్ప్రేలు చల్లుకుంటే చాలట. "ఏక్స్ ఎఫెక్ట్" స్ప్రే కొట్టుకుంటే విమానాశ్రయంలో ఉద్యోగిని సంయమనం కోల్పోతుంది. బహిరంగ ప్రదేశంలోనే తనిఖీ మాని స్ప్రే చేసుకున్న మగాడ్ని వాటేసుకుని వాసన ఆస్వాదిస్తుంది "ఏక్స్ ఎడిక్షన్" స్ప్రే చేసుకుంటే యువతులంతా మీద పడిపోతారు. కారులో మరో యువతితో ప్రేమికుడు అభ్యంతరకరంగా ప్రవర్తించినా నిలదీయదు సరికదా! ఆమెతోపాటు తనకూ

అవకాశమివ్వమంటుంది. "వైల్డ్‌స్టోన్" స్ప్రే వాడితే పక్కింటి అమ్మాయి ఆ అబ్బాయి వెంట గదిలోకి సైతం వెళ్ళిపోతుంది. ఇవన్నీ చూస్తే మహిళలు ఏ విలువలు లేనివారని చెప్పడం ఓ ఎత్తైతే తమ స్ప్రే కంపులముందు ఏ విలువలు ఆగలేవని చెప్పడాన్ని బట్టి వారికి (సదరు కంపెనీలు) ఏ విలువాలేని చెత్తకుప్పలుగా తోస్తాయన్నమాట.

వివాహాలకు నిజమైన కానుకలివ్వాలంటే నాగరికతను జోడించాలంటే తమ వద్ద లభించే నిఖార్సైన బంగారు ఆభరణాలు కొనమంటున్నాయి. అగ్రశ్రేణి తారలతోనే చెప్పిస్తున్నాయి. కాసు బంగారం కూడా కొనలేని పేదలకు తామసలు మనుష్యులే కాదని న్యూనతను పెంచుతాయన్న విషయంలో వారికెటువంటి సంబంధం లేదు.

తమ సరుకులు కొనలేని వారితో కొనిపిస్తే మార్కెట్ విస్తృతమవుతుంది. అందుకు ఏం చెయాలి? ఎలాగైనా సరుకులు కొనడమే జీవితపరమావధిగా మార్చాలి. ఇందుకు పాలుత్రాగే పసిబిడ్డ నుండి పండు ముదుసలి వరకూ సరుకుల కోసం వెంపర్లాడాలి. 'కాస్త దాహం తీర్చే థమ్స్అప్ కోసం నేనెంతో చేసాను మరి మీరు' అని అగ్రశ్రేణి నటుడు ప్రేక్షకుల్ని సూటిగా ప్రశ్నిస్తాడు. ఓ ప్రక్క నిత్యావసర సరుకుల దరువు మరోప్రక్క ఇంటినిండా సరుకులతో కమ్మేయమనే ప్రచారహోరు. దీంతో సరుకుల్ని ఎలాగయినా దక్కించుకోవాలన్న వినిమయ సంస్కృతి మానవ సమాజంలో ఊడల్లా బయలుదేరి వేళ్ళలా పాతుకుపోతోంది. ఇందుకోసం మనుష్యుల్ని డబ్బులు సంపాదించే యంత్రాలుగా మారుస్తోంది. సాటి మనుష్యులతో సహజ సంబంధాలు కూడా సరుకుల సంబంధాలుగానే మార్చేస్తున్నాయి. ఇందుకేనేమో సరుకులు డబ్బుతో ప్రేమలో పడతాయని మార్క్స చమత్కరిస్తారు. దీనికి విరుగుడు శ్రమైక జీవన సంస్కృతిని పెంపొందించడమే. మన అవసరాలకే సరుకులు తప్ప; సరుకుల కోసం మనం కాదన్న స్పృహ ఎల్లెడలా ఉండడమే.



**కేస్ స్టడీ**

# ఆత్మస్థైర్యంతో ముందడుగు

ఆత్మ విశ్వాసం, ఆర్థిక స్వాతంత్ర్యం ఉన్న స్త్రీ సమస్యలను ధైర్యంగా ఎదుర్కొని నిలబడగలదనటానికి ఒక ఉదాహరణ రమ ఉదంతం. నలుగురు ఆడపిల్లలు ఉన్న చిన్న ప్రయివేటు ఉద్యోగి నరసింహారావు. అతని రెండో కూతురే రమ. 20 ఏళ్ళకు డిగ్రీ పూర్తి చేయించి తనలాంటి మరో ప్రయివేటు ఉద్యోగికిచ్చి పెళ్ళిచేసాడు. తన బాధ్యతను నిర్వర్తిస్తున్నానన్న ఆనందంతో ఆ తండ్రి పెళ్ళి కోసం అప్పులు చేయటానికి కూడా వెనుకాడలేదు. పి.జి చేసి టీచర్‌గా చేస్తున్న అల్లుడి ఆర్థిక స్థితిగతుల గురించి పెద్దగా ఆశించలేదు ఆ మధ్యతరగతి తండ్రి. రమ పెళ్ళి తర్వాత పిజి కూడా చేసినా, భర్త ఉద్యోగరీత్యా ఊరూరా అతనితోపాటు తిరుగుతూ గృహిణిగానే తన జీవితం కొనసాగించింది. ఆమె భర్త రమేష్‌కి ఎలాంటి దుర్వ్యసనాలు కనిపించకపోవటంతో అతనిని పూర్తిగా నమ్మింది. మామగారి నుండి వారసత్వంగా వచ్చిన ఆస్తుల అమ్మకం గూర్చి గాని, ఆర్థిక వ్యవహారాల గూర్చిగానీ ఎన్నడూ భర్తను ప్రశ్నించలేదామె. కానీ డబ్బు ఖర్చు విషయంలో, భవిష్యత్ గూర్చి ప్లాన్ లేదని గుర్తించినా డబ్బు గూర్చి ఘర్షణ పడటమెందుకని సర్దుకు పోయింది. దానికి తోడు పదేళ్ళయినా వాళ్ళకు పిల్లలు కలగకపోవటం, తన మరిది, తోడికోడళ్ళకు పిల్లలుండటంతో అవసరమైన ఉద్యోగం చేస్తూ, అంతో ఇంతో ఇంటికి సాయపడిందేకానీ డబ్బేమవుతుందని నిలదీయలేదు. కానీ తరచూ తనతో గడిపే సమయాన్ని తగ్గించటం, డబ్బు ఖర్చుపెట్టడం, రోజుల తరబడి నైట్‌డ్యూటి పేరుతో ఇంటికి రాకపోవటం గమనించి ప్రశ్నించింది. ఫలితం ఒక్కసారిగా మనిషి ఇంటికి రావటం మానేసాడు. రెండు నెలలు, ఆరు నెలలు గడిచినా మనిషి జాడలేదు. తన స్టూడెంట్ అయిన తొమ్మిదో తరగతి అమ్మాయిని తీసుకుని వెళ్ళిపోయినట్లు సమాచారం. ఏం చేయాలో తెలియని స్థితి. దీనికి తోడు రమ వల్లే తన అన్న అలా అయ్యాడని మరిది అభాండం, పుట్టింటి, అత్తింటి వాళ్ళ కొట్లాటలు, తగాదాల మధ్య రమ నలిగిపోయింది. వెంటనే ఒక ఉద్యోగం చూసుకుని ముందు తన కాళ్ళ మీద తను నిలబడింది. తరువాత తన భవిష్యత్ గురించి ఆలోచించుకుని ఒక నిర్ణయానికి వచ్చింది. పదేళ్ళ కాపురంలో నమ్మకం లేక నైతిక విలువలకు తిలోదకాలిచ్చిన వ్యక్తితో కలిసి వుండలేనని అతను మళ్ళీ వచ్చినా కలిసి కాపురం చేయలేనని మనసుని, ఆత్మగౌరవాన్ని చంపుకుని బతకలేనని నిర్ణయించుకుని అతనికి విడాకులివ్వదలుచుకుంది. అదే సమయంలో తన జీవితాన్నిలా నట్టేట ముంచినందుకు తను కట్నం కిందిచ్చిన డబ్బు, తన తల్లి తండ్రులు పెట్టిన నగలు పొందటం తన హక్కుగా భావించింది. తనకు చెందాల్సింది తను పొందాలని పోరాటం ప్రారంభించిం రమకు తగిన ఆత్మస్థైర్యాన్ని, మ నిబ్బరాన్ని అందిస్తూ అత్తగారి కుటుం నుండి ఆమెకు రావాల్సింది పొందేట మోటూరు ఉదయం కౌన్సిలింగ్ సెం ఆమెకు సహకరించింది. ఇది ఒక స్త్రీ విజయం మాత్రమే కాదు. సమాజంలో జరుగుతున్న ఆర్థిక, సామాజిక, కుటుంబ అన్యాయాలకు ఒక స్త్రీ చెప్పిన సమాధానం కూడా.

# తెగువ చూపిన మహిళలు

"మా భూముల్లోకొస్తే.. పాతరేస్తాం. ప్రాణంకన్న మిన్నగా కాపాడుకున్న ఏజెన్సీ గనుల్ని కాజేయాలని చూస్తే కాళ్లు చేతులు విరగ్గొడతాం. పేదోళ్ల పొట్టలు గొట్టే కుట్రలు చేస్తే ఎవరినైనా తరిమికొడతా" ఇది విశాఖపట్నం జిల్లా అరకు ప్రాంతంలోని ఏజెన్సీ గిరిజన మహిళల పోరాట పటిమ.

కుల కట్టుబాట్లను ఛేదించాం. పెద్ద మనుషుల బంధనాలను తెంచుకున్నాం. కుల పంచాయితీ ఆటను కట్టించాం. బాల్య వివాహాలు, కొంగులో రెండు రూపాయలు కట్టి చేసుకునే విడాకుల తంతుకు స్వస్తి పలికాం. ఐద్వా అండతో న్యాయ పోరాటాలు సాగించాం. ఇదీ గుంటూరు జిల్లాలోని బుడగ జంగాల మహిళలు సాగించిన పోరాటాల తెగువ.

"ఏ తల్లికీ నాలాంటి కడుపుకోత రాకూడదు. కూలినాలి చేసే మాలాంటి ఎట్టి బతుకులు మా పిల్లలకొద్దనుకున్నాం. మంచి చదువులు చెప్పించి పెద్దోళ్లను చేయాలని ఆశపడ్డాం. పేదరికాన్ని ఆసరా చేసుకున్న పెద్దోళ్లు పేదోళ్ళ శరీరాలను ప్రయోగశాలలుగా మార్చుకున్నారు. మంచి కోసమే చేశారనుకున్నాం. ప్రాణం పోయేదాకా తెలీదాయే పాపాత్ముల కుట్రలు" ఇదీ ఖమ్మం

జిల్లా దుమ్ముగూడెం ప్రాంతానికి చెందిన వెంకటమ్మ కన్నీటి గాథ.

ఒకరు భూమి కోసం పోరాడితే.. మరొకరు సామాజిక కట్టుబాట్లపై తిరగబడ్డారు. ఇంకొకరు అనాగరిక దుశ్చర్యలకు వ్యతిరేకంగా ఉద్యమాన్ని నడిపారు. విశాఖ, గుంటూరు, ఖమ్మం జిల్లాలకు చెందిన పోరాట విజయాలు అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం(ఐద్వా) మహాసభలకు ప్రేరణ కలిగించాయి. విశాఖపట్నం జిల్లాకుచెందిన కిమిడి కుసుమ, ఖమ్మం జిల్లాకు చెందిన వెంకటమ్మ, గుంటూరు జిల్లాకు చెందిన రూతమ్మ, రాజమండ్రికి చెందిన అనూషలు ప్రసంగించారు.

**మా భూమి, మా సంపద మాక్కావాలి:**

**కుసుమ**

విశాఖ ఏజెన్సీ ప్రాంతంలోని గిరిజనుల భూముల్లో అక్రమ మైనింగ్ తవ్వకాలకు వ్యతిరేకంగా గిరిజన మహిళలు పెద్ద ఎత్తున పోరాడారు. చైనా క్లేవ్ బహుళజాతి సంస్థ ఏజెన్సీ ప్రాంతంలో తెల్లసుద్ద తవ్వకాలకు పూనుకోవడంతో మహిళలు తిరగబడ్డారు. 'తవ్వకాల కోసం ప్రజాభిప్రాయ సేకరణ పేరిట నిర్వహించిన సభకు



హాజరైన స్థానిక ఎంపిపి, ఎమ్మెల్యేలు పేదల పక్షాన కాకుండా బహుళజాతిసంస్థల ప్రయోజనాల కోసం నిలబడిన తీరు మాలో ఆగ్రహం తెప్పించింది. సభకు హాజరైన ఎంపిపి, ఎమ్మెల్యేలను బట్టలూడదీసి చెట్టుకు కట్టేసి తెగువచూపారు. ఎమ్మెల్యే గన్‌మెన్‌లను సైతం లెక్క చేయకుండా అంతా ఒక్కటై ప్రజా ప్రతినిధులను వెంటాడిన తీరు మమ్మల్ని మరింత ఉత్సాహపరిచింది. గిరిజన కొండలు మావి. మాకే కావాలంటూ హెచ్చరించడంతో దముకు పంచాయితీ పరిధిలో సైతం అక్రమ మైనింగ్ తవ్వకాలు కూడా నిలిపివేయక తప్పలేదు" అని పేర్కొన్నమాటలు ప్రతినిధులకు స్ఫూర్తినిచ్చింది.

**పేదోళ్ళ శరీరాలే ప్రయోగశాలలా?**

**వెంకటమ్మ**

పేదోళ్ల శరీరాలను ప్రయోగశాలలుగా మార్చి ప్రాణాలు తీస్తున్నారని ఖమ్మం జిల్లా దుమ్ముగూడెంకు చెందిన వెంకటమ్మ ఆవేదన వ్యక్తం చేశారు. గర్భకోశ ముఖద్వార కాన్సర్ నివారణ పేరిట వేసిన హెచ్‌పివి వ్యాక్సిన్ తన బిడ్డ సరిత(8) ప్రాణాలు



తీసిందన్నారు. ముక్కుపచ్చలారని బిడ్డకు వేసిన వ్యాక్సిన్ మంచి కోసమే వేశారని నమ్మాము. పాత్ అనే స్వచ్ఛంద సంస్థవాళ్లు జిల్లాలో 14వేలమంది మహిళలపై వ్యాక్సిన్ ప్రయోగాలు చేసినట్లు మహిళా సంఘం విచారణలో తేలిందన్నారు. అందులో తన బిడ్డ సరితతోపాటు మరో ముగ్గురు బలయ్యారని ఆవేదన వ్యక్తం చేసిన తీరు మహాసభ ప్రతినిధుల్ని కంటతడి పెట్టించింది. ఉపాధి కూలి పనులు చేసి పొట్టపోసుకునే తమకు బిడ్డకు ఏమైందో తెలుసుకోలేకపోయామని, ఐద్వా ద్వారానే వాక్సిన్ ప్రయోగం వల్ల మరణించిందనే విషయాన్ని తెలుసుకున్నాము. ఇంత వరకూ ప్రభుత్వం ఎలాంటి ఆర్థిక సహాయమూ అందజేయలేదు. పాలకులు చేసే కుట్రలకు అమాయకంగా మోసపోకుండా తిరగబడాల్సిన సమయం ఆసన్నమైందని పిలుపునిచ్చారు వెంకటమ్మ.

### ప్రేమోన్మాదంపై నిరసన గళం! (అనూష)

రాష్ట్ర మహాసభల్లో అనూష నిరసన గళం ప్రత్యేక ఆకర్షణగా నిలిచింది. రాజమండ్రిలో ప్రేమోన్మాది రాజేశ్ దాడికి గురై తల్లి దండ్రులను కోల్పోయిన అనూష తన మనోగతాన్ని సభలో పంచుకున్నారు. "ప్రేమోన్మాదం క్షమించరాని నేరం" అని పేర్కొంటూ ఎవడి ప్రేమకో తాను బలవడంతోపాటు తల్లి,తండ్రి, చెల్లిని కోల్పోయి అంతులేని దు:ఖానికి గురయ్యాను. ప్రేమ పేరుతో యువతులు బలయ్యే దుస్థితిని తప్పించేందుకు ప్రత్యేక చట్టాలు చెయ్యాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఐద్వాతోపాటు ఇతర సంఘాలు నా తరపున పోరాడటం వల్లే కేసులో తీర్పు త్వరగా వెలువడింది. కష్టకాలంలో అండగా నిలబడ్డ సంఘానికి కృతజ్ఞతలు. తల్లితండ్రులు ఆడపిల్లలతోపాటు అబ్బాయిల పెంపకంలోనూ శ్రద్ధ



చూపితే ఇలాంటి పరిస్థితులు తలెత్తవు.అనైతిక చర్యలకు పాల్పడే మగవారు తమ ఇంటిలో ఉన్న అమ్మ, చెల్లి, అక్క గురించి ఆలోచించాలి. విద్యా సంస్థలు సైతం విద్యార్థులకు ర్యాంకుల గురించే కాక, నైతిక ప్రవర్తనను అలవర్చి నడవడికను తీర్చిదిద్దాలి. ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ తీసుకొని పాఠశాల స్థాయి నుండే ఆడపిల్లలను గౌరవించేలా చైతన్యం పెంచేందుకు కృషి చెయ్యాలి.ప్రేమోన్మాదంపై సమాజంలో అన్ని స్థాయిల్లో విస్తృతమైన చర్చ జరగాలి. ఈ దురాగతాలకు అడ్డుకట్ట వెయ్యాలి. నాలా మరే యువతి కూడా ఈ ఉన్మాదుల దాడులకు బలికావద్దు" అని దృఢ నిశ్చయంతో పలికిన అనూష మాటలకు సభ హర్షధ్వానాలు తెలిపింది.

### కట్టుబాట్లపై తిరగబడ్డాం: రూతమ్మ

కుల కట్టుబాట్లపై పెద్ద మనుషుల బంధనాలపై తిరుగుబాటు చేశామని గుంటూరు జిల్లాకు చెందిన రూతమ్మ పేర్కొన్నారు. "తెలంగాణా ప్రాంతం నుంచి 50 ఏళ్ల క్రితం గుంటూరు జిల్లా పరిసర ప్రాంతాలకు వలసొచ్చిన బుడగ జంగాలు ఇంకా కుల కట్టుబాట్లలో మగ్గిపోవాల్సివస్తుంది. కుల పంచాయితీ వల్ల 387 కాపురాలు కూలిపోయాయి, 11మంది పిల్లలు వేధింపులు,



అన్యాయాలకు గురై మరణించారు. తనకు జరిగిన అన్యాయానికి వ్యతిరేకంగా ప్రారంభమైన పోరాటం నేడు వందలాది మంది బుడగజంగాల మహిళలకు అండగా నిలస్తుంది. ఐద్వా అండతో అనేకమంది కుల పెద్ద మనుషుల కుట్రల నుంచి అమాయక మహిళలను కాపాడిన ఉదంతాలున్నాయి. తనకు తొమిదేళ్ళ వయసులో బాల్య వివాహం చేసిన ఫలితంగా కాపురం అనేక ఇబ్బందులకు గురైంది. చిన్న తనంలో పెళ్ళిళ్ళు చేయడంలో పెద్ద మనుషుల పాత్ర కీలకంగా ఉంటుంది. పిల్లలు పుట్టలేదని, కట్నం ఇవ్వలేదని, సంపాదన లేదని, రోగాల పాలైందనేనెపంతో విడాకులు ఇవ్వడం మరో వివాహం చేసుకోవటం బుడగ జంగాల్లో పరిపాటిగా మారింది. విడాకులు పొందాలంటే కొంగులో రెండు రూపాయలు కట్టి 'పుల్ల' చేస్తే సరిపోతుంది. ఇలాంటి దురాచారాల వల్ల అనేకమంది పేద మహిళల కాపురాలకు దూరమై అన్యాయానికి గురవుతున్నందువల్ల నేను ఐద్వా ఆధ్వర్యంలో పోరాటలకు శ్రీకారం చుట్టాను. సామాజిక కట్టుబాట్లను వ్యతిరేకిస్తూ పోరాటాలు చేసే క్రమంలో కుల పెద్ద మనుషులతోపాటు పోలీసులు, అధికారులు సైతం నన్ను వేధింపులకు గురిచేశారు. అయినా ప్రాణాలకు తెగించి ముందుకు వచ్చిన ఫలితంగానే నేడు ఐద్వా అండతో వందలాది మహిళలకు న్యాయం జరిగిందని అదే స్ఫూర్తితో ముందుకు పోవాలని, కుల కట్టుబాట్లపై పోరాడాలని" సభా వేదిక ద్వారా పిలుపునిచ్చింది రూతమ్మ.

\- మానవి డెస్క్

# పరివర్జిత

-గోపాలుని విజయలక్ష్మి (అమ్మాజి)

"భాగ్యలక్ష్మిని నేనే సార్. అర్జంటుగా రమ్మని ఫోన్ చేశారు?"అడిగింది ఆమె.

తను ఆఫీసుకి బయల్దేరుతుండగా డాక్టర్ ప్రభాకర్ దగ్గర్నుండి ఫోన్ వచ్చింది. "మీరు అర్జంటుగా హాస్పిటల్‌కి రండి మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి" అని చెప్పి ఫోన్ పెట్టేశాడు. అది విని భాగ్యలక్ష్మి చాలా కంగారు పడింది. పిల్లలకేమైనా అయిందేమో అని. వెంటనే వాళ్ళిద్దరికి ఫోన్ చేసింది. వాళ్ళు కాలేజిలో వున్నారని రూఢీ చేసుకున్నాక గానీ ఆమె భయం తగ్గలేదు. పిల్లలకి ఫోన్ కాల్ గురించి మాత్రం చెప్పలేదు.

డాక్టర్ ప్రభాకర్ ఆమె వంక పరీక్షగా చూసి 'కూర్చోండి'అన్నాడు కుర్చీ చూపిస్తూ.

"చెప్పండి ఏదో ముఖ్య విషయమన్నారు' కూర్చుంటూ మళ్ళీ అడిగింది భాగ్యలక్ష్మి.

''రామచంద్ర రావు మీకేమవుతారు?'' అడిగాడు ప్రభాకర్.

ఈ పేరువినగానే ఆమె ముఖంలో వచ్చిన మార్పుని అతను గమనించకపోలేదు. కొన్ని క్షణాల మౌనం తర్వాత అడిగింది భాగ్యలక్ష్మి 'విషయం ఏంటో చెప్పండి డాక్టర్' అని.

"నాలుగు రోజులక్రితం ఎవరో ఒక వ్యక్తి రామచంద్ర రావుని ఈ హాస్పిటల్‌లో చేర్చి వెళ్ళి పోయాడు. అతనున్న పరిస్థితి చూసి అతనికి కొన్ని పరీక్షలు చేశాం. దురదృష్టవశాత్తు ఆ రిపోర్ట్స్ ప్రకారం అతనికి మేం ఊహించినట్టే ఎయిడ్స్ అని నిర్ధారణ అయింది. అతన్ని హాస్పిటల్‌లో చేర్చిన వ్యక్తి మళ్ళీ యిక్కడికి రాలేదు. అందుకని రామచంద్రరావుని 'మీ వాళ్ళెవరైనా ఉన్నారా?' అని అడిగితే మీ పేరు చెప్పి, ఫోన్ నంబరు యిచ్చారు. మీరు అతని భార్య అని కూడా చెప్పాడు'. భాగ్యలక్ష్మి ముఖంలోని భావాలను అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నట్లు ఆమె వంక పరీక్షగా చూస్తూ చెప్పాడు ప్రభాకర్.

కానీ ఆయన ఊహించినట్టు భాగ్యలక్ష్మి ముఖంలో ఎటువంటి



మార్పులేదు. స్థిమితంగా కూర్చుని వింటోంది. కానీ మనసులో మాత్రం 'నా ఫోన్ నెంబరు గుర్తుంది అంటే యింకా నన్ను మర్చిపోలేదన్నమాట'అనుకుంది.

'ఇప్పుడు నన్నేం చేయమంటారో చెప్పండి డాక్టర్' అంది ప్రభాకర్‌తో చాలా కూల్‌గా.

ఆ ప్రశ్నకి ప్రభాకర్ నిజంగానే షాక్ అయ్యాడు. భర్తకి అంత భయంకరమైన జబ్బు వచ్చిందని చెప్తే సాధారణంగా ఏ భార్యయినా కంగారుపడి వంద ప్రశ్నలతో డాక్టర్‌ని పూపిరాడకుండా చేస్తారు. కానీ ఈమె మాత్రం ఎటువంటి స్పందన లేకుండా అతనిపట్ల ఏ మాత్రం ఆసక్తి లేనట్లు ప్రవర్తిస్తోంది. అదే అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

ఒక నిమిషం తర్వాత ప్రభాకర్ ఒక నిర్ణయానికి వచ్చినట్లు తన సీట్లోంచి లేచి "మీకభ్యంతరం లేకపోతే ఒకసారి వార్డ్‌లోకి వచ్చి అతన్ని చూడండి.'' అని ఆమె సమాధానం కోసం ఆగకుండా గబగబా వార్డ్ వైపు నడిచాడు.

ఏమనుకుందో ఏమో, భాగ్యలక్ష్మి అతన్ని అనుసరించింది.

అది ప్రభుత్వ ఆస్పత్రి కావటంతో ప్రపంచంలోని కుళ్ళు, కంపు అంతా అక్కడే పోగేసుకుని కూర్చున్నట్లు ఎటు చూసినా మురికి, అపరిశుభ్రత రాజ్యం ఏలుతున్నాయి. 'బహుశా నరకం అంటే యిలాగే ఉంటుందేమో' అనుకుంది మనసులో ఆమె.

అది జనరల్ వార్డ్ కావటంతో యింకా భయంకరంగా వుంది. ప్రభాకర్ ఒక బెడ్ దగ్గర ఆగి వెనక్కి తిరిగి ఆమె వంక చూశాడు. 'ఇతడే రామచంద్రరావు'అన్నట్టు ఉన్నాయి అతని చూపులు. భాగ్యలక్ష్మి రామచంద్రరావు వైపు చూసింది. చిందర వందరగా పెరిగిన జుట్టు, బాగా మాసిన గడ్డం, మురికి పట్టిన గుడ్డలు అతని జబ్బుని యింకా భయంకరంగా చూపిస్తున్నాయి. బెడ్ మీద అతను పడుకున్న భంగిమ చాలా అస్తవ్యస్తంగా వుంది. అతని జీవితంలాగానే.

నిద్రపోతున్న అతన్ని తట్టి లేపాడు డాక్టర్ ప్రభాకర్. బలవంతంగా కళ్ళు తెరిచిన అతనితో 'చూడండి ఎవరొచ్చారో' అన్నాడు.

భాగ్యలక్ష్మిని చూడగానే అతని ముఖం విప్పారింది. 'భాగ్యం, భాగ్యం' అంటూ ఏదో మాట్లాడబోయాడు. కానీ దు:ఖం అతని గొంతుకడ్డుపడి మాటలు

రాకుండా చేసింది. ఆ సమయంలో అతని కళ్ళలోని చావు భయం భాగ్యలక్ష్మికి చాలా స్పష్టంగానే కనపడింది. జీవితంలో ఎదుటివారిని భయపెట్టటమే కానీ భయపడటం అనేదే తెలియని రామచంద్రరావు కళ్ళల్లో మొదటిసారిగా భయాన్ని చూస్తోంది ఆమె. అలా అతన్ని చూస్తుంటే ఆమెలో ఏదో తెలీని సంతృప్తి. తను, తన పిల్లలు యితని చేతిలో చిత్ర హింసలు అనుభవిస్తూ 'అచ్చం ఇలాగే' భయం భయంగా బ్రతికిన క్షణాలు ఆమె యింకా మర్చిపోలేదు. ఒకటా రెండా? పన్నెండేళ్ళు అతను పెట్టిన నరకయాతనల్ని భరించారు. అర్ధరాత్రి అయిందటే చాలు, ఎక్కడ తలుపు శబ్దం అవుతుందో, తప్పతాగివచ్చి తనని, పిల్లల్ని గొడ్లని బాదినట్టు ఎక్కడ బాదుతాడో అని ప్రతిక్షణం ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని బ్రతికారు. ఆ క్షణంలో పిల్లల కళ్ళలో కనిపించిన ప్రాణభీతిని ఆ తల్లి మనసు మర్చిపోగలదా? అందుకే రామచంద్రరావు కళ్ళల్లో భయం ఆమెని కదిలించలేకపోయింది.

'ఇతన్ని జాయిన్ చేసి ఈ రోజుకి ఐదు రోజులయింది. మా రూల్స్ ప్రకారం యింకో వారం కన్నా వుండనివ్వరు. కాబట్టి మీరు అతనితో మాట్లాడాక మీ అభిప్రాయం చెప్తే దాన్ని బట్టి మేం డెసిషన్ తీసుకుంటాం' అన్నాడు ప్రభాకర్.

డాక్టర్ మాటలతో ఆలోచనల్లోంచి బయటకొచ్చింది భాగ్యలక్ష్మి. 'అతనితో మాట్లాడాల్సింది ఏమీ లేదు డాక్టర్' చాలా స్పష్టంగానే చెప్పింది.

ఆ మాటలు విని కంగారు పడ్డాడు రామచంద్రరావు. అప్పటిదాకా గొంతులో దాగి వున్న దు:ఖం యిప్పుడు కట్టలు తెంచుకుని బయటికి తన్నుకొచ్చింది. అతను కంగారుగా 'భాగ్య'అంటూ ఆమె చెయ్యి పట్టుకున్నాడు. అంతే. కరెంట్ షాక్ కొట్టినట్టు చప్పున తన చేతిని వెనక్కి లాగేసుకుంది భాగ్యలక్ష్మి. పద్దెనిమిదేళ్ళ క్రితం ఆ చేయి తన చేతిని పట్టుకోవటం వల్లే తన బ్రతుకు సర్వ నాశనం అయిపోయింది. అందం, చదువు, తెలివితేటలు, డబ్బు అన్ని ఉండి, ఇద్దరు అన్నలు, ఇద్దరు అక్కల మధ్య ఎంతో గారాబంగా పెరిగిన తనని తండ్రి ఎంతో నమ్మకంగా అతని చేతిలో పెట్టాడు. పెళ్ళి చూపుల్లో అతనిపేరు, ఆస్థి, అందం, చదువు చూశారేకానీ అతని నిజస్వరూపాన్ని మాత్రం చూడలేకపోయారు. వేద మంత్రాల మధ్య, అగ్ని సాక్షిగా అతనితో ఏడడుగులు నడిచిన భాగ్యలక్ష్మికి, అత్త గారింట్లో అడుగు పెట్టాకగానీ అతనేంటో తెలీలేదు. అతనికి చదువుంది కానీ ఉద్యోగం చేసే నిలకడ లేదు. అందం ఉంది కానీ మానవత్వం లేదు. జూదానికి, త్రాగుడికి బానిస. ఇదీ అతని నిజస్వరూపం. వీటన్నిటితో పెళ్ళయిన రెండేళ్ళకి ఆస్థి అంతా హారతి కర్పూరంలా హరించుకుపోయింది. వీటన్నిటి ఫలితంగా భాగ్యలక్ష్మి జీవితం బలైపోయింది. అందుకే ఆ చేయంటే ఆమెకి చచ్చేంత భయం.

ఆమెకి యింక అక్కడ నిలబడటం యిష్టం లేనట్టు 'డాక్టర్! వెళ్దామా' అంది.

ఇద్దరూ డాక్టర్ ఛాంబర్‌లోకి వచ్చి కూర్చున్నారు.

''వాటీజ్ హిజ్ ప్రెజెంట్ కండిషన్''అడిగింది భాగ్యలక్ష్మి.

'వ్యాధి లక్షణాలు ఎక్కువగానే ఉన్నాయి. బహుశా ఒకటి, ఒకటిన్నర సంవత్సరాలు బ్రతకవచ్చు. అదీ టైంకి మందులు, మంచి పౌష్టికాహారం యిస్తేనే'చెప్పాడు డాక్టర్.

డాక్టర్ చెప్పిన దానికి తలవూపి, లేచి నుంచుంటూ ''నేను రేపు మిమ్మల్ని తప్పకుండా కలుస్తాను డాక్టర్'' అంటూ నమస్కారం చేసి బయటికి నడిచింది భాగ్యలక్ష్మి. తాను పడుకున్న వార్డ్ కిటికీలోంచి భాగ్యలక్ష్మి వెళ్ళి పోవటం చాలా స్పష్టంగానే కనిపిస్తోంది రామచంద్రరావుకి. 'ఆమె తప్పకుండా వచ్చి నన్ను యింటికి తీసుకువెళ్తుంది' అనుకున్నాడు రామచంద్రరావు ఎంతో కాన్ఫిడెంట్‌గా. నిజానికి అతనలా అనుకోవటానికి గల ప్రధాన కారణం భాగ్యలక్ష్మి మీద అతనికున్న నమ్మకం అనుకుంటే మాత్రం పొరపాటే. మన హైందవ సాంప్రదాయం మీద అతనికున్న గట్టి విశ్వాసమే అతనికంత కాన్ఫిడెన్స్‌నిచ్చింది. అయినా అతను భాగ్యలక్ష్మి మీద నమ్మకం పెట్టుకోవటానికీ, పెట్టుకోకపోవటానికి ఆమెనెప్పుడైనా అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తే కదా!

భాగ్యలక్ష్మికి యింక ఆఫీసుకి వెళ్ళబుద్ధి కాలేదు. అలా అని యింటికీ వెళ్ళబుద్ధి కాలేదు. ఒంటరిగా ఇంట్లో వుంటే పాత జ్ఞాపకాలతో మనసంతా పాడవుతుంది. అందుకే రాధికకి ఫోన్ చేసి ఇద్దరూ కలిసి సినిమాకెళ్ళారు.

భాగ్యలక్ష్మి సినిమానుంచి వచ్చేసరికి పెద్ద కొడుకు అవినాష్ ఇంట్లో ఉన్నాడు. తల్లిని చూడగానే "ఏంటి మమ్మీ లేటయింది. ఆఫీస్‌లో వర్క్ ఎక్కువగా వుందా?" అని అడిగాడు మంచినీళ్ళు యిస్తూ.

"లేదు నాన్నా, అసలు యివాళ ఆఫీసుకి వెళ్ళలేదు. రాధిక ఆంటీతో కలిసి సినిమాకెళ్ళాను"అంది.

"ఏంటి మమ్మీ విశేషం. ఆఫీసు ఎగ్గొట్టి మరీ సినిమాకెళ్ళారు. ఆంటీ బర్త్‌డేనా?" అడిగాడు అవినాష్.

"అదేం లేదు. జస్ట్ ఫర్ ఛేంజ్, అన్నట్టు అభి యింకా కాలేజీ నుంచి రాలేదా?"

'మా కాలేజీలో స్పోర్ట్స్ వీక్ జరగబోతోంది కదా మమ్మీ. వాడు టి.టి.లో పార్టిసిపేట్ చేస్తున్నాడు. ప్రాక్టిస్ కోసం వుండిపోయాడు" చెప్పాడు అవినాష్.

"మరి నువ్వు దేనిలోనూ పార్టిసిపేట్ చేయడం లేదా?''ప్రేమగా అడిగింది భాగ్యలక్ష్మి.

" నేను చెస్ ఆడుతున్నాను మమ్మీ. ఈ సంవత్సరం కూడా ఛాంపియన్‌షిప్ నాదే" కళ్ళెగరేస్తూ చాలా కాన్ఫిడెంట్‌గా చెప్తున్న కొడుకుని చూస్తే చాలా ముచ్చటగా అనిపించింది ఆమెకి.

పిల్లలిద్దరూ తల్లిలాగా చాలా తెలివైనవాళ్ళు. చదువులో, ఆటల్లో ఎప్పుడూ ఫస్టే. ఆ మాటకొస్తే రామచంద్రరావు కూడా చదువులో బ్రిలియంట్ అని చెప్పాలి. అవినాష్, అభిరామ్ చదువు, ఆటల్లోనే కాదు బుద్ధిలో కూడా బంగారాలే. ఎవరైనా భాగ్యలక్ష్మితో ఆ మాటంటే ఆమె ఆనందంతో ఉబ్బితబ్బిబ్బవుతుంది. పిల్లలిద్దరికీ తల్లంటే ప్రాణం. ఆమె తమ కోసం పడే ఆరాటం, కష్టం చూస్తుంటే వాళ్ళకి

ఒకొక్కసారి కళ్ళల్లో నీళ్ళు వచ్చేవి. 'తాము పెద్దయి జీవితంలో సెటిలయాక అమ్మకి కష్టం అంటే ఏమిటో తెలీకుండా చూసుకోవాలి' అనుకునే వాళ్ళు వాళ్ళిద్దరూ. రోజూ సాయంత్రం ఇంటికి రాగానే ముగ్గురూ కూర్చుని ఆ రోజు జరిగిన అన్ని విషయాలు ఒకరితో ఒకరు షేర్ చేసుకుంటారు. ఆ ముగ్గురికీ ఒకరంటే ఒకరికి ప్రాణం. ఇప్పుడిప్పుడే వాళ్ళు తమ గతాన్ని మర్చిపోయి హాయిగా, ఆనందంగా జీవించగల్గుతున్నారు. 'ఇంకో నాలుగేళ్ళు కష్టపడితే చాలు పిల్లల చదువులు పూర్తయిపోతాయి. ఆ తర్వాత మంచి ఉద్యోగాలొచ్చి వాళ్ళు సెటిల్ అయితే తన జీవిత లక్ష్యం నెరవేరినట్టే' అనుకుంటూ వుంటుంది భాగ్యలక్ష్మి.

రామచంద్రరావు యిల్లు వదిలి పోయిన ఈ ఆరేళ్ళల్లో పిల్లలు అతని కోసం దిగులుపడటం కానీ, అతని కోసం ఎదురు చూట్టంగానీ ఎప్పుడూ జరగలేదు. అతను యిల్లు విడిచి వెళ్ళిన కొద్ది రోజులకి మాత్రం పిల్లలిద్దరూ భాగ్యలక్ష్మి దగ్గర కూర్చుని సందేహిస్తూ అడిగారు. "మమ్మీ! నాన్న ఎక్కడికి వెళ్ళారు? ఇంక రారా?"అని. భాగ్యలక్ష్మికి ఏం చెప్పాలో తోచలేదు. "వస్తారు నాన్నా, తప్పకుండా వస్తారు" అని చెప్పాలనుకుంది. వాళ్ళ కళ్ళల్లోకి పరీక్షగా చూశాక అలా చెప్పబుద్ధి కాలేదు. "లేదు నాన్నా, ఇంక ఎప్పటికీ రారు" అంది. ఆమె ఆలోచన నిజమే అయింది. ఆ సమాధానం విన్న పిల్లల ముఖంలో ఏదో తెలీని రిలీఫ్. అది చూసిన భాగ్యలక్ష్మికి మనసు కుదుటపడింది. ఆ క్షణంలో ఆమె దేవుణ్ని కోరుకుంది 'అతనెప్పటికీ తమ జీవితాల్లోకి మళ్ళీ రాకూడదని.'

అందుకే రామచంద్రరావు విషయం పిల్లలకి చెప్పదల్చుకోలేదు. వాళ్ళు పోగొట్టుకున్న బాల్యాన్ని మళ్ళీ వాళ్ళకి గుర్తు చేయటం గానీ, భవిష్యత్తు మీద భయాన్ని కల్గించటం గానీ ఆమెకి అసలు ఇష్టం లేదు. ఇప్పుడు వాళ్ళు ఎంతో ఆనందంగా ఉన్నారు. వాళ్ళు తమ భవిష్యత్తు మీద ఎన్నో కలలు కంటూ, దాని కోసం ఎంతో శ్రమిస్తున్నారు. ఈ టైంలో వాళ్ళకి ఎలాంటి డిస్ట్రబెన్స్ రాకూడదు అనుకుంది భాగ్యలక్ష్మి. ముందు తను ఒక నిర్ణయానికి వచ్చాక అప్పుడు చూడొచ్చులే అనుకుంది.

రాత్రి పదకొండు గంటలయింది. పిల్లలిద్దరూ పగలంతా అలసిపోవటం వల్ల మంచి నిద్రలో వున్నారు. రోజూ అయితే భాగ్యలక్ష్మి కూడా ఈ పాటికి హాయిగా నిద్రపోతూనే ఉండేది. కానీ ఈ రోజు ఆమెకి నిద్రపట్టడం లేదు. ఎంత వద్దనుకున్నా గతం తాలూకు జ్ఞాపకాలు ఆమెని వీడటంలేదు. ఉదయం డాక్టర్ చెప్పిన మాటలు జ్ఞాపకమొచ్చాయి. 'టైంకి మందులు, పౌష్టికాహారం ఇస్తే ఒకటి రెండు సంవత్సరాలు బ్రతుకుతారు'అని. ఆమెకి నవ్వు వచ్చింది. 'టైంకి పౌష్టికాహారం'. భర్తగా తనకి గానీ, తండ్రిగా పిల్లలకి గానీ ఏనాడైనా ఒక్కపూట కడుపునిండా తిండి పెట్టాడా? కిరాణా షాపు నుంచి సరుకులు యింటికి రావాలంటే ఇంట్లో పెద్ద యుద్ధమే జరిగేది. ఏ పూట కాపూట తిండికి వెతుక్కోవటమే. పిల్లల చదువుకి ఎప్పుడైన ఫీజు కట్టారా? అదేమంటే 'నా దగ్గర డబ్బుల్లేవు నేను చదివించలేను' అని నిర్లజ్జగా, నిర్లక్ష్యంగా మాట్లాడేవాడు. అతని తాగుడికి, వ్యసనాలకి మాత్రం డబ్బు వేలకి వేలు వుండేవి. తండ్రిగా అతను బాధ్యతని మర్చిపోయినా తల్లిగా తను మాత్రం మర్చిపోలేదు. అందుకే తనకి పుట్టింటి వారు, అత్తింటివారు పెట్టిన నగలు అమ్మి వాళ్ళను చదివించింది. ఈ బాధలు పడలేకే తను ఉద్యోగంలో చేరింది. కానీ తన జీతం కోసం కూడా ఎన్ని హింసలు పెట్టేవాడు?

ల్యాండ్ లైన్ మ్రోగటంతో భాగ్యలక్ష్మి ఆలోచనల్లోంచి బయటకొచ్చింది. గోడ గడియారంలో పదకొండున్నర అయింది. 'ఇంత రాత్రప్పుడు ఎవరు ఫోన్ చేశారా' అనుకుంటూ లేచి వెళ్ళింది. 'ఒకవేళ హాస్పటల్ నుంచి కాదుకదా!' అనుకుంటూ ఫోన్ లిఫ్ట్ చేసింది.

"హాలో నేనమ్మా. ప్రతాప్‌ని. నిద్రలేపానా?" అట్నుంచి భాగ్యలక్ష్మి పెద్దన్నయ్య అడిగాడు.

ఈ టైంలో ఫోన్ చేశాడేంటి? అమ్మ ఎలా వుందో? కొంచెం కంగారు పడింది. "అదేం లేదన్నయ్యా. ఇంకా నిద్ర పట్టలేదు. ఇంత రాత్రప్పుడు ఫోన్ చేశావేంటి?" మనసులో ఖంగారుని కప్పి పుచ్చుకుంటూ అన్నది.

"నీతో ఒకసారి మాట్లాడాలని పించింది. అంతే. పిల్లలు నిద్రపోయారా?"అతని మాటలు పొడిపొడిగా వున్నాయి. ప్రతిసారి పలకరించే ఆప్యాయత కనిపించటంలేదు. ఏదో ముఖ్యమైన విషయం తనతో చెప్పటానికే ఈ టైంలో ఫోన్ చేశాడని అతను మాట్లాడే తీరునుబట్టి అర్థం అయింది భాగ్యలక్ష్మికి.

"పిల్లలు పడుకుని చాలా సేపయింది. అమ్మ ఎలా ఉంది? ఏదైనా ముఖ్య విషయం మాట్లాడాలని చేశావా? సూటిగానే అడిగింది.

"అమ్మ బాగానే ఉంది. నువ్వన్నట్టు విషయం చాలా ముఖ్యమైందే. ఉదయం డాక్టర్ ప్రభాకర్ ఫోన్ చేశారు. నీతో కూడా మాట్లాడానని, నువ్వు వెళ్ళి ఆయన్ని కలిసి వచ్చావని చెప్పారు. ఆ విషయం గురించి మాట్లాడదామనే చేశాను." అన్నాడు తటపటాయిస్తూ.

ఒక్క నిమిషం ఆశ్చర్యపోయింది భాగ్యలక్ష్మి. రామచంద్రరావుకి తెలివి ఏమాత్రం తగ్గలేదు అనుకుంది.

"కలిసి రాలేదు. చూసొచ్చానంతే. అదీ డాక్టర్ అడిగారు కాబట్టి ఆయన మీద గౌరవంతో."

"నీకు చెప్పేంత వాళ్ళం కాదు. నువ్వు అతనితో ఎన్ని బాధలు పడ్డావో మాకు తెలుసు. కానీ ఎంతైనా భర్త కదా! పైగా చివరి దశలో ఉన్నాడు. ఇలాంటప్పుడు ఎవరైనా ఆయినవాళ్ళు దగ్గర వుండాలని కోరుకుంటారు. డాక్టర్ చాలా క్లియర్‌గానే చెప్పారు. సంవత్సరం, సంవత్సరంనర కన్నా బతకడని. అన్నేళ్ళు భరించావు. ఈ కొద్ది రోజులు నీ బాధ్యతని కొంచెం ఓర్పుతో నిర్వహించావంటే నీకు, నీ పిల్లలకు కూడా మాట దక్కుతుంది. నలుగురి చేత మాటనిపించుకోకుండా వుంటారు. అదీ కాకుండా ఈ స్థితిలో అతను మిమ్మల్ని బాధించగలిగేదీ లేదు. ఏదో పెద్ద వాడిగా నీ మంచికోరి చెపుతున్నాను. నువ్వూ ఆలోచించుకో" అన్నాడు.

అతను మాట్లాడుతున్న ఒక్కొక్కమాట ఒక్కొక్క శూలంలా ఆమెగుండెల్లో దిగుతోంది.

"ఇది చెప్పటానికేనా ఇంత అర్ధరాత్రి ఫోన్ చేశావు?" అడిగింది భాగ్యలక్ష్మి.

అవునన్నట్టు 'ఊ'అన్నాడు ప్రతాప్.

నువ్వు నా గురించి ఇంత శ్రద్ధ తీసుకుంటున్నందుకు చాలా థాంక్స్. మరి వుంటాను. గుడ్‌నైట్" ఫోన్ పెట్టేసింది.

ఆమె ఆలోచనల్లో ఆరేళ్ళ వెనక్కి వెళ్ళాయి.

రామచంద్రరావు కొట్టిన దెబ్బలకి రక్తం ఓడుతూ ప్రతాప్ దగ్గరికి పరుగెత్తికెళ్ళింది భాగ్యలక్ష్మి. అసలేం జరిగిందని అడిగాడు ప్రతాప్. "రాత్రి నుంచి ఒకటే గోల. నా వంటి మీద ఉన్న నాలుగు జతల గాజులు, సూత్రపుతాడు, నల్లపూసలు యివ్వమని. అవి అమ్మేసి అప్పులు తీరుస్తారట. లేకపోతే అప్పులవాళ్ళు తనని బ్రతకనివ్వటంలేదని గొడవపెట్టాడు. బంగారమంతా అమ్మగా మిగిలింది ఈ కొద్దిపాటి బంగారమే. అది కూడా యిచ్చేస్తే రేపు పిల్లలకి గానీ, నాకు గానీ ఏదైనా ప్రాణావసరం వస్తే మా పరిస్థితేంటో ఆలోచించు అన్నయ్య. అందుకే ఆయన నిద్రలేచే సరికి అవన్నీ తీసి దాచిపెట్టేశాను. అవి తీసి యిమ్మని గొడ్డుని బాదినట్టు బాదాడు. అన్నయ్యా, నేనింకా అతనితో కలిసి బ్రతకలేను. పైగా పిల్లలు కూడా యిలాంటి వాతావరణంలో పెరగటం అంత మంచిది కాదు. వాళ్ళు మాత్రం ఎన్నాళ్ళు యిలా నరకం అనుభవిస్తారు. అందుకే ఒక నిర్ణయానికి వచ్చాను. అతనికి విడాకులు యిచ్చి పిల్లలతో విడిగా వుండాలనుకుంటున్నాను. ఉద్యోగం ఉంది కాబట్టి నేనెవరి మీద ఆధారపడాల్సిన అవసరం లేదు. ఈ విషయం గురించే నీతో మాట్లాడదామని వచ్చాను'' అంది భాగ్యలక్ష్మి.

అంతే, ఇంటిల్లిపాది ఏదో పిడుగు నెత్తినపడ్డట్టు ఒక్కసారిగా అదిరిపడ్డారు. ఎవరికి తోచిన పద్ధతిలో వాళ్ళు పతివ్రతా ధర్మం గురించి బోధించారు. తండ్రి లేని పిల్లలు సమాజంలో ఎన్ని అవమానాలు ఎదుర్కోవాలో వివరించారు. చివరికి 'అసలు ఆ బంగారం ఇచ్చేసి వుంటే యింత గొడవ వుండేది కాదు కదా!' అని భాగ్యలక్ష్మిని మందలించారు. భాగ్యలక్ష్మి నివ్వెరపోయింది. వాళ్ళు అలా మాట్లాడినందుకు కాదు. వాళ్ళకి విషయం అలా అర్థం అయినందుకు.

అందుకే ఇపుడు భాగ్యలక్ష్మికి అన్నగారి మాటలు ఆశ్చర్యాన్ని కలిగించలేదు. కానీ ప్రతిసారి ధర్మం, న్యాయం అనే వాటిని కాపాడాల్సిన బాధ్యత కేవలం ఆడదానిదే అన్నట్టు మాట్లాడుతుంటేనే బాధ కలిగింది. ఎన్ని తరాలు యిలా? మగవారికి మాత్రం ఎటువంటి బాధ్యతలు, ధర్మాలు, న్యాయాలు ఉండవు.

తన గోడు తోటి మనుషులకి అర్థం కాలేదు గానీ భగవంతుడికి బాగా అర్థం అయింది. అందుకే ఆ రోజు వెళ్ళిన రామచంద్రరావు మళ్ళీ ఇంటికి తిరిగిరాలేదు.

కుక్క తోక లాంటిదే రామచంద్రరావు బుద్ధి కూడా. అతనికొచ్చిన రోగం కన్న భయంకరమైనది అతని స్వభావం. అలాంటి వ్యక్తిని క్షమించాలా? అసలు క్షమ అనే పదానికి సరైన నిర్వచనమేమింటి? ఒక్క సంవత్సరమేగా అని ఎంత తేలికగా చెప్పాడు అన్నయ్య. తన పిల్లలు భవిష్యత్తు మీద ఎన్నో ఆశలతో ముందుకెళుతున్నారు. ఒక్క పది రోజులు చాలు అతనికి ఆ ఆశల్ని నేలమట్టం చేయటానికి. పైగా మొగుణ్ణన్న అధికారంతో పశువులా ప్రవర్తించిన వాడు ఇప్పుడు తనకున్న రోగాన్ని నాకంటించడని ఏంటి నమ్మకం. అప్పుడు తన పిల్లలకి దిక్కెవరు? ఆ ఆలోచన రాగానే ఆమె దృష్టి ప్రక్క మంచం మీద ఎంతో నిర్మలంగా, నిశ్చింతగా పడుకున్న అవినాష్, అభిరామ్‌లపై పడింది. ఆమెకి తన కర్తవ్యం ఏంటో బోధపడింది. అందుకే వెళ్ళి నిశ్చింతగా పడుకోగలిగింది.

'గుడ్ మార్నింగ్ డాక్టర్.' ఉదయం పది గంటలకే డాక్టర్ ప్రభాకర్‌ని కలిసింది భాగ్యలక్ష్మి.

'రండి కూర్చోండి'అన్నాడు చిరునవ్వుతో.

ప్రభాకర్‌కి థాంక్స్ చెప్పి అతనికెదురుగా కుర్చీలో కూర్చుంది.

ప్రభాకర్‌కి ఆమె వస్తుందని ఖచ్చితంగా తెలుసు. అందుకే చాలా కాన్ఫిడెంట్‌గా టేబుల్ సొరుగులోంచి రామచంద్రరావు ఫైలు తీసి భాగ్యలక్ష్మి ముందు పెడుతూ "చూడండి మేడమ్, అతని రిపోర్టులు, ట్రీట్‌మెంట్‌కి సంబంధించిన డిటెయిల్స్ అన్నీ యిందులో వున్నాయి. మీరు ఆయన్ని చెకప్‌కి తీసుకువచ్చినప్పుడల్లా మర్చిపోకుండా ఈ ఫైల్ తేవాల్సి వుంటుంది."అతని మాటలు యింకా పూర్తికాలేదు. "సారీ డాక్టర్. ఈ ఫైల్‌తో నాకు సంబంధం లేదు. సో, అది మీ దగ్గరే ఉంచండి"అంది. భాగ్యలక్ష్మి దాన్ని సున్నితంగా డాక్టర్ వైపు నెడుతూ.

అతను అయోమయంగా చూశాడు ఆమె వంక. అది గ్రహించిన భాగ్యలక్ష్మి "అయాం సారీ డాక్టర్. ఈ రోజు మిమ్మల్ని తప్పకుండా కలుస్తానని చెప్పాను కదా! అందుకే వచ్చాను. అదీ కాక మీరు అతని విషయంలో ఒక నిర్ణయం తీసుకోవాలంటే నా సైడ్ నుంచి ఒక క్లారిటీ వుండాలికదా? అది మాట్లాడటానికే వచ్చాను. అతను నన్ను తన భార్యనని మీకు చెప్పాడు. కానీ భర్త వున్నాడనే విషయం నేను, తండ్రి ఉన్నాడనే విషయం పిల్లలు ఏనాడో మర్చిపోయాము. ఇప్పుడు అతనికీ, మాకూ ఏ సంబంధం లేదు. ఇక్కడ అతన్ని ఎన్ని రోజులుంచుతారో, ఎప్పుడు డిశ్చార్జి చేస్తారో మీ యిష్టం. అది చెప్పటానికే వచ్చాను. వుంటాను." ప్రభాకర్‌కి రెండు చేతులు జోడించి నమస్కరించి కుర్చీలోంచి లేచింది.

ఆమె వంక అయోమయంగా చూస్తుండిపోయాడు డాక్టర్ ప్రభాకర్. అతని కేబిన్‌లోంచి బయటికి వస్తూ వెనక్కి తిరిగి చెప్పింది. 'అన్నట్టు మరో ముఖ్య విషయం. ఈరోజు నుంచి మా యింట్లో ల్యాండ్‌లైన్ మోగదు. డిస్‌కనెక్ట్ చేయించాను."

వేగంగా నడుచుకుంటూ వెళ్ళిపోతున్న భాగ్యలక్ష్మిని వార్డ్ కిటికీలోంచి నిస్సహాయంగా చూస్తుండిపోయాడు రామచంద్రరావు.

ఆ నరక కూపం లోంచి బయటపడ్డ భాగ్యలక్ష్మికి ఎక్కడో దూరంగా రేడియోలోంచి జానకి గొంతు ఆక్రోశించటం వినిపిస్తుంది. "భర్తలుండి విధవయైన ద్రౌపది

ఆక్రందనలో....." అంటూ. •

# మహిళలు - హక్కులు



-పొత్తూరి సురేష్ కుమార్ (అడ్వకేట్)

**గృహహింస నుంచి రక్షణ:**

మానసికంగా కాని, శారీరకంగా, ఆర్థికంగా, లైంగికంగా, మౌకికంగా ఏ విధంగానైనా మహిళలను హింసించరాదు. అలా హింసించితే బంధుత్వం ఏదైనా పురుషుడు శిక్షింపబడతాడు. క్రిమినల్ చట్టాల క్రింద స్త్రీలని హింసించిన స్త్రీలు కూడా శిక్షింపబడతారు.

**కుటుంబ హింస చట్టం క్రింద మహిళలు ఈ క్రింది ఉత్తర్వులు పొందవచ్చు.**

1. బాధితురాలను ఇంటి నుండి గెంటివేయకుండా, ఆ ఇంటిని ఎవరికి అన్యాక్రాంతం చేయకుండా లేదా హింసిస్తున్న వారిని ఇంటి నుంచి బయటికి పంపే విధంగా ఉత్తర్వులు.
2. బాధితురాలు ఆర్థిక పరిహారం ఖర్చులు పొందవచ్చు మరియు భరణం పొందవచ్చు.
3. పిల్లలను తన సంరక్షణలో ఉండే విధంగా ఉత్తర్వులు పొందవచ్చు.
4. తనను కట్నంకోసం హింసిస్తున్న వారిపై క్రిమినల్ కేసులు పెట్టవచ్చు.

**పనిచేసే చోట లైంగిక వేధింపులు:** మహిళలు పనిచేసే చోట అది పబ్లిక్ లేదా ప్రైవేట్ రంగమైనా, జీతం తీసుకుని పనిచేస్తున్న లేదా స్వచ్ఛందంగా పనిచేస్తున్న వారిపై ఎటువంటి లైంగిక వేధింపులు ఉండకూడదు. సంస్థ యజమానులు దీని నివారణకు తగిన చర్యలు తీసుకోవలెను. ఒకవేళ ఎవరైనా లైంగిక వేధింపులకు పాల్పడితే వారిపై క్రమశిక్షణ చర్యలతోపాటు క్రిమినల్ చర్యలు తీసుకొనవచ్చును.

**మహిళలు ఆస్తిహక్కు:** మహిళలకు మూడు రకాలైనటువంటి ఆస్తులుంటాయి.

1. **స్వార్జితం:** అనగా మహిళలు, తమ శక్తియుక్తులతో, నైపుణ్యంతో సంపాదించుకున్న సంపాదన. ఈ ఆస్తిపై ఆ స్త్రీకి సంపూర్ణ హక్కులుంటాయి.
2. **స్త్రీ ధనం:** వివాహానికి ముందుగాని, వివాహ సమయంలో గాని లేదా మెట్టినింటికి పంపించేటపుడు గాని లేదా ఆ తరువాత గాని, బహుమతులుగానీ లేదా ఇతర ఆస్తులుగాని ఆమె తల్లితండ్రుల ద్వారా అందిన లేదా ఆమె తండ్రి లేక తల్లి తరుపు లేక తండ్రి తరుపు పూర్వీకుల ద్వారా గాని సంక్రమించిన ఆస్థిని "స్త్రీ ధనం" అంటారు. ఇది స్థిరాస్తి లేదా చరాస్థి కావచ్చు. ఈ స్త్రీ ధనానికి సంబంధించి స్త్రీకి సంపూర్ణమైన హక్కులుంటాయి.
3. భర్త ద్వారా సంక్రమించే ఆస్తి దీనినే ఉమన్ ఎస్టేట్ అంటారు. భర్త చనిపోతే పిల్లలతోపాటు భార్యకు కూడా ఆస్థిలో హక్కు వస్తుంది.

**2005 హిందూ వారసత్వ సవరణ చట్టం తర్వాత మహిళలకు ఆస్థిహక్కు ఈ క్రింది విధంగా ఉంది.**

1. కూతురికి కొడుకుతో సమానంగా సమిష్టి కుటుంబ సభ్యత్వం, ఆస్థిలో సమవాటా లభించింది.
2. పిత్రార్జితమయిన తండ్రి ఆస్థిలో పుట్టుకతోనే సమాన వాటా లభించింది.
3. తండ్రి నివాస గృహంలో తండ్రి తదనంతరం కూతురికి సమానమయిన వాటా లభించింది.
4. తండ్రి స్వార్జితమయిన ఆస్థిలో సమాన వాటా పొందేహక్కు ఉంటుంది.
5. వ్యవసాయ భూముల పంపకంలో కొడుకులకు ప్రాధాన్యతలుగానీ, అధిక భాగాలు కానీ, ఇతర ప్రత్యేక హక్కులుగానీ ఇచ్చే చట్టాలు ఆయా రాష్ట్రాల్లో ఉంటే అవి చెల్లవు.
6. మామగారింటి ఆస్తిలో మరణించిన భర్త వాటాను కోడలి హోదాలో ఆమె పొందవచ్చు. మళ్ళీ వివాహం చేసుకున్నప్పటికి మొదటి భర్త తండ్రి నుంచి భర్త వాటా పొందే అధికారం ఆమెకు వుంది.
7. తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, కర్నాటక, మహారాష్ట్రలలో సమిష్టి కుటుంబ సభ్యత్వం కూతురికి పుట్టుకతో ఇచ్చినా, ఆ చట్టాలకు ముందు వివాహితులైన కూతుళ్ళకు, విభజించబడిన ఆస్తులకు ప్రయోజనాలు లభించవు. కాని 2005 చట్టం ప్రకారం కూతుళ్ళందరికీ వివాహితులైనా, కాకపోయినా, సమిష్టి ఆస్తిలో వాటా లభిస్తుంది. కొడుకుతో సమానమయిన వాటా ఉంటుంది. రిజిస్టర్ పత్రం ద్వారా ఆస్తుల విభజన 2004 డిసెంబర్ 20కి ముందు జరిగి ఉన్నా లేదా ఈ తేదీకి ముందు కోర్టు డిక్రీ ద్వారా ఆస్తి విభజన జరిగిపోయినా ఈ చట్టం వర్తించదు.
8. భర్తతో విభేదాలు వచ్చినా, ఇంటి హింస పెరిగిపోయినా అత్తగారింటినుంచి వెళ్ళిపోవలసివచ్చినా, మహిళ-తండ్రి ఇంటికి ఒక హక్కుతో దర్జాగా రావచ్చు. నివాస హక్కు మాత్రమే కాకుండా ఇంట్లో భాగాన్ని పొందవచ్చు.
9. సమిష్టి ఆస్తిలో కొడుకుకు లభించే అన్ని హోదాలు లభిస్తాయి. కనుక కూతురు కూడా కర్తగా సమిష్టి కుటుంబ యాజమాన్య అధికారాన్ని పొందవచ్చు.
10. పిత్రార్జితమయిన ఆస్తి తండ్రి చేతిలో ఉండగానే జన్మతో వాటా సాధించుకున్నారు. కనుక, కూతుళ్ళకు, కొడుకులకు చెందే భాగాన్ని అమ్మే అధికారం తండ్రికి, తదితరులకు ఉండబోదు. (స్వార్జితమైన ఆస్తి విషయంలో తప్ప)

# అస్పష్ట హామీలు

- టి.కె. రాజ్యలక్ష్మి

అసంఘటిత రంగ కార్మికులకు వర్తించే ప్రభుత్వ ఆరోగ్య భీమా పథకం ఇప్పుడు ఇంటిపనివారికి కూడా వర్తిస్తుంది. దేశంలోని మొత్తం 47.5 లక్షల మంది ఇంటిపనివారిలో 10 శాతం మందికి ఈ ఆర్థిక సంవత్సరంలో ఈ పథకాన్ని అమలు చేయాలని ప్రభుత్వం ప్రతిపాదించింది. కాని ఈ 10 శాతాన్ని ఏ విధంగా ఎంపిక చేస్తారనే విషయంకానీ లేక దారిద్ర్య రేఖ దిగువనున్నవారు దీనిద్వారా లబ్ది పొందుతారా? అనే విషయం కానీ ప్రభుత్వం స్పష్టం చేయలేదు.

రుక్సానా అనే ఒక మహిళ బీహార్ నుండి ఢిల్లీకి వలస వచ్చిన ఒక ఇంటిపని కార్మికురాలు. ఆమె భర్త గతంలో రిక్షా కార్మికుడుగా పనిచేసాడు. వీరికి నలుగురు పిల్లలు. ఈ కుటుంబం ఒక చిన్న ఇరుకైన గదిలో నివసిస్తున్నారు. ఈ గదికిగాను వారు నెలకు 1500 రూ॥లు అద్దె చెల్లిస్తున్నారు. దేశ రాజధాని నగరంలోని 4 ఇళ్ళలో రుక్సానా పనిచేస్తుంది. ఆమె భర్తకు ఒక పెద్ద ఆపరేషన్ కావడంతో ఆయన పని మానేయాల్సి వచ్చింది. దారిద్ర్యరేఖ దిగువవారికి వర్తించే పథకాల ద్వారా లబ్దిపొందేందుకు ఆమెకు ఒక్క గుర్తింపుకార్డు కూడా లేదు. దాని కోసం ఆమె ఒక ఏజెంట్ సహాయం కోరగా అతను 2000 రూ॥లు ఖర్చు పెడితే ఒక రేషన్ కార్డు ఇప్పిస్తానని చెప్పాడు. ఆమె వద్ద అంత డబ్బు లేదు. ఒకవేళ వుండి ఖర్చుపెట్టినా రేషన్ కార్డు వస్తుందనే నమ్మకం ఆమెకు లేదు. ఆమె నివసిస్తున్న ఇంటి యజమాని ఆమె తన ఇంట్లో నివసిస్తున్నదని ధృవీకరించడానికి సిద్ధంగా లేదు. ధృవీకరిస్తే తనకు ఎలాంటి ఇబ్బందులు వస్తాయోనని అతని భయం.



రుక్సానా నివాస ధృవీకరణ పత్రం లేనందున ఆమెకు గుర్తింపుకార్డు కూడా లేదు. లంచం ఇవ్వకుండా ఏ విధంగా గుర్తింపు కార్డు పొందాలో ఆమెకు తెలియదు. భారతదేశంలోని పేదవారి జాబితాలో ఆమె పేరే లేదు. ఆమెకు తనలాంటి వారికోసం ప్రభుత్వం ఆరోగ్య భీమా పథకాన్ని అసంఘటితరంగ కార్మికుల నుండి ఇంటిపనివారి వరకూ విస్తరించిందనే విషయం తెలియదు.

ఎటువంటి గుర్తింపు కార్డులూ లేకుండా ఎక్కడా ఇంటిపని కార్మికులుగా పేర్లు నమోదు కాకుండా ఉన్న రుక్సానాలాంటి ఇంటిపని కార్మికులు కొన్ని మిలియన్ల మంది ఉన్నారు. దారిద్ర్యరేఖకు సంబంధించిన గుర్తింపు కార్డు (బిపిఎల్ కార్డు ) కూడా లేకపోవటమంటే ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా అసంఘటితరంగ కార్మికుల కోసం ప్రారంభించి ఇపుడు గుర్తింపు పొందిన ఇంటిపని కార్మికులకు కూడా విస్తరించిన ఆరోగ్య భీమా పథకాన్ని (ఆర్ఎస్‌బిఆర్) అందుకోలేకపోవడమే. ఇంటిపనివారి కోసం ప్రభుత్వం ముందుగా ఒక అధ్యయన బృందాన్ని ఏర్పాటు చేసి ఈ పథకాన్ని 2011 జూన్ 23వ తేదీన ప్రకటించింది.

ప్రభుత్వం చెబుతున్న దాని ప్రకారమే ఇంటిపని కార్మికులు అసంఘటితరంగ కార్మికులుగా వుంటూ ఎటువంటి కార్మిక చట్టాల రక్షణా లేనివారుగా ఉన్నారు. వీరు సమాజంలోని అణగారినవారుగా ఉన్నారు. వెనుకబడిన తరగతులకు చెందిన వీరిలో ఎక్కువ శాతం మంది పేదలుగాను, విద్య లేనివారుగాను, ఎటువంటి నైపుణ్యం లేనివారుగాను, పట్టణ పని పరిస్థితులపై అవగాహన లేనివారుగా ఉన్నారు. అనేక రాష్ట్రాలలో ఇంటిపనిని గుర్తించి దానికి చట్టబద్ధత కల్పించాలని కార్మిక మంత్రి మల్లికార్జున్ కార్గే ఈ సంవత్సరం మార్చిలో పార్లమెంటుకు తెలిపారు. ఆరు రాష్ట్రాలలో ఇంటిపని కార్మికులకు గంటకు, రోజుకు మరియు నెలవారీ కనీస వేతనాలను కూడా నిర్ణయించడం జరిగింది.

జాతీయ సర్వే సంస్థ (ఎన్ఎస్ఎస్ఓ) 2004-2005 సంవత్సరంలో సేకరించిన లెక్కల ప్రకారం దేశంలో మొత్తం 47.5 లక్షల మంది ఇంటిపని కార్మికులున్నారని. వీరిలో 30 లక్షల మంది పట్టణ మహిళలు. దేశంలోని మొత్తం కార్మిక వర్గంలో అసంఘటిత రంగ కార్మికులు 94 శాతం మంది ఉన్నారు. పట్టణ ప్రాంతాలలోని మహిళా కార్మికులలో ఎక్కువ భాగం ఇంటిపని కార్మికులే ఉన్నారు. ప్రభుత్వం 2011-12 సంవత్సరానికి గాను ఇంటిపని వారిలో 10 శాతానికి అంటే 4.75 లక్షల మందికి మాత్రమే ఆరోగ్య భీమా పథకాన్ని అమలు చేయపూనుకుంది.

18 సంవత్సరాల వయస్సు దాటిన ఇంటిపని వారిని గుర్తించాల్సిందిగా రాష్ట్ర

ప్రభుత్వాలను కోరారు. ఈ నిర్ణయం వలన ఇంటిపనివారిగా పనిచేస్తున్న లక్షలాదిమంది మైనర్ బాలలు, యుక్త వయస్సుకు దగ్గరగా వున్న పిల్లలు ఈ పథకం పరిధిలోకి రాకుండా పోతున్నారు. 2001 జనాభా లెక్కల ప్రకారం 1,85,505 మంది పిల్లలు ఇంటి పనిచేస్తున్నారు. వీరిని ఏవిధంగా పరిగణించాలనే ప్రణాళిక ప్రభుత్వం వద్ద లేదు. ఆరోగ్యభీమా పథకం క్రిందికి ఈ 10 శాతాన్ని ఏవిధంగా ఎంపిక చేస్తారనే విషయంకానీ, ఇంత చిన్న భాగాన్ని ఎందుకు ఎంచుకున్నారనే విషయాన్ని కానీ ప్రభుత్వం స్పష్టం చేయలేదు. ఈ ఆరోగ్యభీమా పథకానికి దారిద్ర్య రేఖ దిగువనున్న ఇంటి పని కార్మికులే అర్హులా? అనే విషయాన్ని కూడా ప్రభుత్వం స్పష్టం చేయలేదు. ఆరోగ్యభీమా పథకం (ఆర్‌ఎస్‌ఎస్...)లో అంతర్లీనంగా దారిద్ర్యరేఖవారిని పరిగణనలోకి తీసుకోవాలనే అంశం కూడా ఉంది.

2007 సెప్టెంబరు 1వ తేదీన ఈ పథకాన్ని ప్రారంభించినా అది ఏప్రిల్ 2008 నుండి అమలులోకి వచ్చింది. ఈ పథకం క్రింద దారిద్ర్యరేఖ దిగువనున్న కుటుంబాల వారికి ( 5 మంది కుటుంబ సభ్యులకు) ఒక కార్డు ద్వారా రూ॥ 30,000/- ఆరోగ్య భీమా సదుపాయాన్ని కల్పిస్తారు. ఈ కార్డును స్మార్ట్‌కార్డ్ అంటారు. ఈ స్మార్ట్ కార్డ్ గలవారు సంబంధిత జాబితాలోని దేశంలోని ఏ ఆసుపత్రిలోనైనా వైద్యం చేయించుకోవచ్చు. ఇంటిపని కార్మికుల భీమా కోసం ఈ నిధులను అసంఘటిత రంగ కార్మికుల కోసం ఏర్పాటు చేసిన జాతీయ సాంఘిక భద్రతా నిధి ( నేషనల్ సోషల్ సెక్యూరిటీ ఫండ్ ) నుండి ఖర్చు పెట్టాల్సివుంది. ఈ ఖర్చులో కేంద్రం 75 శాతం భరించాలని నిర్ణయించారు. ఇన్సూరెన్స్ వాయిదాల విషయంలో కూడా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు 75:25 చెల్లించాలని నిర్ణయించారు. జమ్ము కాశ్మీర్‌లోనూ మరియు ఈశాన్య రాష్ట్రాల్లోనూ ఈ నిష్పత్తి 90:10గా ఉంది.

ఈ పథకం అనేక పరిమితులతో కూడుకొని ఉంది. ఈ పథకం క్రింద లబ్ది పొందాలంటే కార్మికులు గుర్తింపు పొందిన నాలుగు సంస్థలలో ఏవైనా రెండు సంస్థల నుండి అర్హత పత్రాలు పొందాలి. అవి 1. యజమాని నుండి 2. నివాసితుల సంక్షేమ సంఘం నుండి 3. రిజిస్టరు కాబడిన కార్మిక సంఘం నుండి 4.స్థానిక పోలీసుల నుండి. ప్రభుత్వం ప్రకటించే పథకాలలో పైకి కనిపించినంత సులువుగా లబ్దిపొందే అవకాశాలు ఉండడంలేదు. ఈమధ్యనే ప్రభుత్వం అంగన్‌వాడీ ఉద్యోగులకు, హెల్పర్లకు జీతాలను రెట్టింపు చేస్తున్నట్లు ప్రకటించింది. కానీ ఆచరణలో దానికి సంబంధించి అనేక నిబంధనలు ఉన్నాయి. ఇప్పుడు ప్రకటించిన ఈ భీమా పథకంలో కూడా లబ్దిదారులు తమ ఆరోగ్య సమస్యలకు ఆమోదం పొందాలంటే అనేక సమస్యలు ఎదుర్కొవాల్సి వస్తుంది.

ఆరోగ్యభీమా పథకం ఇప్పుడు 25 రాష్ట్రాలలోనూ, కేంద్ర పాలిత ప్రాంతాలలోను అమలవుతున్నది. మే 31వ తేదీ వరకూ 2 కోట్ల 34 లక్షల స్మార్ట్ కార్డులను జారీ చేసారు. భవన మరియు ఇతర నిర్మాణ కార్మికుల చట్టం 1996 కింద రిజిస్టరు చేయబడిన సంక్షేమబోర్డులలో నమోదైన భవన నిర్మాణ కార్మికులకు ఈ పథకాన్ని విస్తరించారు. అంతేకాక వీధులలో చిన్న వర్తకాలు చేసేవారికీ, బీడీ కార్మికులకు మరియు మహాత్మాగాంధీ జాతీయ ఉపాధిహామీ పథకం క్రింద అంతకు ముందు ఆర్థిక సంవత్సరంలో 15 రోజుల కంటే ఎక్కువ రోజులు పనిచేసిన వారికి ఈ పథకాన్ని విస్తరించారు.

## ఒక్క క్షణం ఆలోచిద్దాం

మన పని మనం చేసుకునే సమయం, ఓపిక లేకే కదా! పనివాళ్ళను పెట్టుకుంటున్నాం. అంట్లుతోమడం, ఇల్లు ఊడ్చటం, బట్టలుతకడం మున్నగు పనులేకాక అవసరమైతే మన పిల్లల మలమూత్ర విసర్జనానంతరం శుభ్రపరిచే పనికీ వారు నెరవడం లేదు. మానవతా దృక్పథం ఉన్నవారు ఎలానూ వారి శ్రమకు తగ్గవేతనం తప్పకుండా ఇస్తారు. కానీ, అన్ని చోట్ల ఈ విధమైన న్యాయం అమలు జరుగుతుందా అంటే ఖచ్చితంగా లేదని చెప్పొచ్చు.

మరికొన్ని చోట్ల పనిచేసే స్త్రీలు గృహ యజమానుల నుండి లైంగిన వేధింపులు, అత్యాచారాలకు గురైన సంఘటనలు పరిపాటిగా మారుతున్నాయి. పనిచేసే ఇంట్లో జారిపడటం లాంటిది సంభవించే సందర్భంలో అంతేకాకుండా ఒక్క ఇల్లు కాక రెండుమూడు ఇళ్ళలో పని చేయడం వలన అనారోగ్యానికి ఏ ఒక్కరూ పూర్తి బాధ్యత వహించని యజమానులూ చాలామందే ఉన్నారు. ఇటువంటి పరిస్థితులు చోటు చేసుకుంటున్న మన సమాజంలో ఇంటిపనివారూ సంఘం ఏర్పాటు చేసుకోవడం అభినందించాల్సిన విషయమే.

-ఎందుకంటే ఆయా వృత్తుల వారు సంఘాలనేర్పాటు చేసుకొని తమ హక్కులను పరిరక్షించుకోగలుగుతున్నారు. సంఘాల ద్వారా తగిన న్యాయం పొందగల్గుతున్నారు. చిన్న చేపను పెద్ద చేప మింగేసే దమన నీతి నశించాలంటే అల్పులకి అస్థిత్వం నిరూపణ ఉండాలి మరి!

– కనీస వేతనం అమలు జరిగి తీరాలి. ఒక్కోసారి అనుకున్న సమయం కంటే రెట్టింపు సమయం, రెట్టింపు పని కేవలం యజమానులనే విధేయతతోనే చేస్తున్నారు. అలాంటి సందర్భంలో మొహమాటం కొద్దీ ఇస్తే తీసుకోవడం లేదంటే సర్దుకుపోవటం వారికీ మామూలే!

-అలానే ఇళ్ళ స్థలాలు, ఇన్సూరెన్స్ కల్పన, రేషన్ కార్డులు, స్కాలర్‌షిప్‌లు మున్నగు సౌకర్యాలు కల్పించాలని వారు ప్రభుత్వాన్ని వేడుకుంటున్నారు. పై కోర్కెల సాధనలో మనకేమీ నష్టము లేదు. సగటు బతుకు సుభిక్షంగా మారేందుకు ఇవి దోహదం చేస్తాయి కూడా. మనుషులుగా... మానవీయ కోసంలో సాటివారి సౌకర్యాలను వాంఛించడం ముదావహం. అందుకే అటువైపుగా అడుగులేద్దాం!

– ఇల్ల ప్రసన్నలక్ష్మి

ఆసక్తికరమైన విషయమేమంటే ఇంటిపనివారికి ఒక సమగ్ర జాతీయ చట్టం చేయాలని జాతీయ మహిళా కమిషన్ సూచించింది. అంతేకాక " ఇంటిపనివారి సంక్షేమ మరియు సాంఘిక భద్రతా చట్టం 2010 " అనే పేరుతో ఒక ముసాయిదా బిల్లును రూపొందించింది. దీనిలో ఇంటిపనిలో భాగంగా వున్న దోపిడీతోపాటు ఈమధ్య కాలంలో పుట్టగొడుగుల్లా వెలుస్తున్న ఉపాధి ఏజెన్సీలు మహిళలు, పిల్లలను ఇంటిపని పేరుతో ఏవిధంగా అక్రమ రవాణా చేస్తున్నదీ వివరించారు. ఇంటిపనివారి పని పరిస్థితులపై వారి రిజిస్ట్రేషన్‌కు సంబంధించిన విషయాలపై ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకోవడం కోసమే ఈ ముసాయిదా బిల్లును రూపొందించినట్లు జాతీయ మహిళా కమిషన్ ( ఎన్‌సిడబ్ల్యు ) చెప్పింది. ఉపాధి ఏజెన్సీలను క్రమబద్ధీకరించాల్సిన అవసరాన్ని ఈ ముసాయిదా బిల్లులో నొక్కి చెప్పారు. గతకొన్ని దశాబ్దాలుగా ఇంటిపనివారి కోసం డిమాండ్ బాగా పెరిగిందనీ దానితోపాటుగా ఉపాధి ఏజెన్సీలు కూడా విపరీతంగా పెరిగాయనీ జాతీయ మహిళా కమిషన్ తెలిపింది. అంతేకాక ఒక కేంద్ర చట్టమనేది లేకపోతే రాష్ట్ర ప్రభుత్వాలు ఇంటిపనివారిని కనీస వేతన చట్టం పరిధిలోకి తేవడానికి ఎన్ని ప్రయత్నాలు చేసిన వృధాయేనని కమిషన్ తెలిపింది.

ఈచట్టం క్రింద ఒక జాతీయ సలహా కమిటీ మరియు రాష్ట్ర సలహా కమిటీలతోపాటు జిల్లా బోర్డులు కూడా ఉండాలనీ, ఇంటిపని కార్మికుల, యజమానుల మరియు ఏజెన్సీల రిజిస్ట్రేషన్ జరిగేటట్లు చూడడం వీటి ప్రధాన బాధ్యతగా ఉండాలనీ ముసాయిదా సూచించింది. ప్రమాదాలు జరిగినపుడు బాధితులకు సహాయం అందించడానికీ, పిల్లల చదువులకు ఆర్థిక సహాయం అందించడానికి, లబ్దిదారులకు వైద్యం కోసం సహాయం చేయడానికి మరియు ప్రసూతి సౌకర్యాల కల్పనకు ఈ బోర్డులకు తగిన అధికారాలు ఉండాలని సూచించారు. ఈ బోర్డులు ఏవైనా వివాదాలు తలెత్తినపుడు వాటిని పరిష్కరించడానికి కూడా పూనుకోవాలి.

ఈ బోర్డుల కేంద్రం రూపొందించిన స్కీములు మరియు సంక్షేమ కార్యక్రమాలను రాష్ట్ర బోర్డులతో సంప్రదించి అవి అమలు జరిగేలా కూడా చూడాలి. ఇంటిపని కార్మికులు రిజిస్టర్ అయి ఉండేలా చూడాల్సిన బాధ్యత వారి యజమానులదేననీ, ముఖ్యంగా ఏజెన్సీల ద్వారా నియమించబడిన మరియు పూర్తి సమయం పనిచేసే ఇంటిపని వారి విషయంలో ఈ బాధ్యత మరింత ఎక్కువగా ఉండాలనీ ముసాయిదా బిల్లులో పేర్కొన్నారు.

ఇంటిపని కార్మికుల కోసం ఒక సంక్షేమ నిధిని తప్పనిసరిగా ఏర్పాటు చేయాలనీ, దానిని జిల్లా బోర్డుల పర్యవేక్షణలో ఉంచాలనీ ముసాయిదా బిల్లులో నిబంధనలు ఉన్నాయి. మరియు ఇంటిపనివారి పని పరిస్థితుల విషయంలో దీనిలో అనేక అభ్యుదయకరమైన, అనుకూల అంశాలు ఉన్నాయి., పూర్తి సమయం పనిచేసే కార్మికులకు గరిష్టంగా 8 గంటల పని ఉండాలనీ, ఆహారం ఇవ్వాలనీ, కొంత విశ్రాంతి సమయం ఇవ్వాలనీ వారానికి ఒకరోజు సెలవు ఇవ్వాలనీ ముసాయిదాలో పేర్కొన్నారు. అదనపు పనికి అదనపు వేతనం రేట్లను కూడా నిర్ణయించారు. దీనిలో దాడులు, పరిహారాలకు సంబంధించిన విభాగం కూడా ఉంది. సమగ్రమైన ప్రతిపాదనలున్న ఈ ముసాయిదా బిల్లును బయటికి రాకుండా రహస్యంగా ఉంచారు. ఇంటిపనివారికి ఆరోగ్యభీమాని పోలిఉండే ఈ కొద్దిపాటి సదుపాయమైనా కలిగించే ఆలోచన చేస్తున్న ఈ సమయంలో కూడా దానిని బహిర్గతపరచలేదు. ఇంటిపని కార్మికుల రిజిస్ట్రేషన్ అనేది ఒక పెద్ద సవాలుగా ఉంది. ఎటువంటి సమగ్ర చట్టం లేని పరిస్థితుల్లో ఏ యజమాని అయినా ఏజెన్సీ అయినా తన వద్ద పనిచేసే ఇంటిపని కార్మికులు రిజిష్టరై ఉండడాన్ని కోరుకోరు. ఇటువంటి పరిస్థితుల్లో ఈ ఆరోగ్య భీమా పథకం విజయవంతమవడం కష్టసాధ్యమే.

నిజానికి ప్రభుత్వం ఏర్పాటు చేసిన అధ్యయన బృందం (టాస్క్‌ఫోర్స్) ప్రతిపాదించిన దాని ప్రకారం ఇంటిపనివారిని గుర్తించి వారిని రిజిస్టర్ చేయించే పనిని కార్మికశాఖయే చేపట్టాలి. మరియు ఇంటిపనిని కనీస వేతనాల చట్టం ఉత్తర్వు క్రింద కేంద్ర జాబితాలో చేర్చాలని ప్రతిపాదించారు. ముసాయిదా చట్టం ప్రకారం ఇంటిపని కార్మికులకు కనీస వేతనాలను నిర్ణయించని రాష్ట్రాలు కూడా కనీస వేతనాలు నిర్ణయించాలని సూచించారు. ఇంటిపనివారికి ఒక జాతీయ చట్టం చేయాలనీ ఇంటిపని కార్మికులకు ఉపాధి కల్పించే అన్ని ఏజెన్సీలూ, వ్యక్తులూ సంస్థలూ " షాప్స్ అండ్ ఎస్టాబ్లిష్‌మెంట్స్ చట్టం " క్రింద తప్పనిసరిగా రిజిస్ట్రేషన్ అయి ఉండాలనీ ఈ ముసాయిదా చట్టంలో పేర్కొన్నారు.

సెంటర్ ఆఫ్ ఇండియన్ ట్రేడ్ యూనియన్స్ ( సిఐటియు ) అధ్యక్షులు ఎ.ఆర్. పద్మనాభన్ చెప్తున్న ప్రకారం ఆరోగ్యభీమా పథకాన్ని ఇంటిపని కార్మికులకు విస్తరించడంలో ఎదురవుతున్న పెద్ద సమస్య దారిద్ర్యరేఖను ఏవిధంగా నిర్వచిస్తారు అనేదే. దారిద్ర్యరేఖ పరిధిలోకి వచ్చే ప్రజల సంఖ్యను తగ్గించడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తున్నదని ఆయన చెప్పారు. ఈ మధ్య జరిగిన జనాభా లెక్కల సేకరణలో ఈ విషయం తేటతెల్లమైంది. దారిద్ర్యరేఖకు సంబంధించిన అనేక విషయాలను ఈ లెక్కలలో పరిగణనలోకి తీసుకోలేదు. భవన నిర్మాణ కార్మికులందరూ సంక్షేమ బోర్డుల ద్వారా ఈ పథకంలో లబ్ది పొందుతున్నపుడు ఇంటి పనివారందరు దారిద్ర్యరేఖ అంశం ద్వారా ఈ పథకంలో లబ్ది పొందేటట్లు చూడాలని ఆయన చెప్పారు. కార్మిక వర్గంలో 94 శాతం మంది అసంఘటిత రంగంలోనే ఉన్నారని జూన్‌లో జరిగిన ఐఎల్‌ఓ మహాసభలో కార్మిక శాఖామంత్రి ఒప్పుకున్నారు. అలాంటపుడు ఈ ఆరోగ్య భీమా పథకాన్ని మొత్తం అందరికీ ఎందుకు వర్తింపచేయకూడదని ఆయన ప్రశ్నించారు. గరిష్ట భీమా మొత్తంగా నిర్ణయించిన ఈ 30,000/- రూపాయలు 5 మంది కుటుంబ సభ్యులున్న ఒక కుటుంబంలో ఒక వ్యక్తి ఆసుపత్రి ఖర్చులకు మాత్రమే సరిపోతాయని ఆయన చెప్పారు.

అసంఘటిత రంగ కార్మికుల యొక్క జాతీయ ప్రచార కమిటీ ప్రతినిధి మరియు చాలా సంవత్సరాల నుండి అసంఘటిత రంగ కార్మికుల కోసం పనిచేస్తున్న సుభాష్ భట్నాగర్ చెబుతున్న ప్రకారం ఈ ఆరోగ్య భీమా పథకంలోని పెద్ద సమస్య దాని గురించి కార్మికులకు సరైన

అవగాహన లేకపోవడమే. ఈ పథకం క్రింద లబ్ది పొందాలంటే కార్మికులకు కొంత అవగాహన అవసరం. కానీ ఏ ఇంటి పని కార్మికురాలూ కూడా రిజిస్ట్రేషన్ ఏ విధంగా చేయించుకోవాలి? ఎక్కడ చేయించుకోవాలి? అనే విషయాలు తెలుసుకోవడంలేదు. యూనియన్లకు వీరి అర్హత విషయం ప్రకటించే అవకాశం లేదు.

**అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐఎల్ఓ) మహాసభ**

100వ ఐఎల్ఓ అంతర్జాతీయ మహాసభలు జనీవాలో జూన్‌లో జరిగాయి. ఈ మహాసభలలో "ఇంటిపని కార్మికుల సదస్సు 2011" పేరుతో ఒక ప్రత్యేక సదస్సును నిర్వహించారు. ఈ సభలో ఇంటిపని కార్మికుల మానవ హక్కులను పరిరక్షించాలని పిలుపునిచ్చారు. ప్రపంచీకరణ దుష్ప్రభావాలు ఎక్కువైన ఈ తరుణంలో కార్మికులకు కనీస సాంఘిక భద్రత కల్పించే ఒక వేదిక అవసరమని ఈ సదస్సు నొక్కి చెప్పింది. ప్రపంచంలో నేడు ఏవిధమైన సాంఘిక భద్రతా లేని ప్రతి 10 మందిలో 8 మందికి సాంఘిక భద్రత కల్పించాల్సిన అవసరం ఉందని ఐఎల్ఓ డైరెక్టర్ జనరల్ జునాన్ సోమాలియా సభ్య దేశాలను కోరారు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో ఇంటిపని కార్మికుల పాత్రనూ, ఇంటిపనిని తక్కువ అంచనా వేస్తున్న పరిస్థితులనూ సదస్సు గుర్తించింది. మరియు అభివృద్ధి చెందుతున్న దేశాలలోని జాతీయ కార్మిక వర్గంలో అధిక సంఖ్యలో ఇంటిపని కార్మికులున్నారని సదస్సు గుర్తించింది. కనుక వారి పని పరిస్థితులు మరియు వేతనాలకు సంబంధించిన ఒక సమగ్ర హక్కుల జాబితాను ఈ సదస్సులో రూపొందించారు.

సదస్సులో జూన్ 13వ తేదీన కార్మిక మంత్రి ఖార్గి మాట్లాడుతూ ఐఎల్ఓ డైరెక్టర్ జనరల్ ప్రవేశపెట్టిన "సాంఘిక న్యాయం యొక్క క్రొత్త శకం" అనే నివేదికను స్వాగతించారు. మరియు భారతదేశంలోని అసంఘటిత రంగ కార్మికులకు కనీస ఆరోగ్య సౌకర్యాలు కల్పించడానికి ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా ప్రవేశపెట్టి విజయవంతంగా నడుపుతున్న ఆరోగ్య భీమా పథకం గురించీ, దాన్ని విస్తృతంగా ప్రజానీకంలోకి తీసుకువెళుతున్న తీరును గురించీ వివరించారు. కార్మికులకు కనీస సాంఘిక భద్రత కల్పించేందుకు భారత ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఈ పథకం లాంటి పథకాలను అన్ని దేశాలలోనూ వారి వారి పరిస్థితులను బట్టి అన్ని దేశాలలోనూ దానిని అమలు చేయడానికి ఎలాంటి నిర్దిష్ట కాలపరిమితీ ఉండరాదని చెప్పారు.

ఈ విధమైన పథకాలు దేశంలోని ఆర్థిక వనరులకూ, ఉపాధి విధానాలకు మరియు ఇతర సాంఘిక విధానాలకు అనుసంధానంగా ఉండాలని ఆయన చెప్పారు. భారత ప్రభుత్వం పథకాల ప్రాతిపదిక నుండి హక్కుల ప్రాతిపదికన సాంఘిక భద్రతా పథకాలు చేపడుతూ ముందుకు పోతుందని ఖార్గి చెప్పారు. కానీ ఆయన భారతదేశంలో ఈ హక్కులలో చాలా వరకూ అందరూ ఒకేవిధంగా పొందే వీలులేనివిగానే ఉన్నాయనీ, ప్రభుత్వంచే పేదలు అని గుర్తించబడితేనే ప్రజలకు ఈ పథకాలు అందుతాయని చెప్పడం మరిచిపోయారు. భారత ప్రభుత్వం ఈ సదస్సులోని విషయాలను ఆమోదించిన నేపథ్యంలో నిర్ణీత సమయంలోగా దానిపై చట్టం చేసి దానిని ఆమోదింపచేస్తుందా లేదా అనేది వేచి చూడాలి. ఒక సమగ్ర ముసాయిదా ఇప్పటికే తయారై ఉంది కనుక ఈ విషయంలో ప్రభుత్వం పెద్దగా చేయాల్సినదికూడా ఏమీ లేదు.

ఏది ఏమైనప్పటికీ ఒక ప్రాథమిక నియంత్రణా చట్టం లేని పక్షంలో ఇంటిపనివారికి ఆరోగ్య భీమా పథకం గురించిన ఆలోచన సుదూరమైనదిగానే మిగులుతుంది. ప్రపంచంలోని "రుక్సానా" లాంటి వారికి సాంఘిక సంక్షేమానికి సంబంధించిన ఏ పథకమైనా కొంతైనా అందుబాటులోకి రావాలంటే ఇంకొక దశాబ్దకాలం పట్టవచ్చు.

(ఫ్రంట్‌లైన్ సౌజన్యంతో)

(అనువాదం: కె. నాగలక్ష్మి)

(21వ పేజీ తరువాయి)

భవిష్యత్తుకే కాదు నవజాజ భవిష్యత్తుకూ అవసరమంటారు లక్ష్మీదేవమ్మగారు భర్తలకు ఎదురు తిరిగి సాధించలేని పనిని బిడ్డల పెంపకంలో జాగర్తలు పాటించి వారిని భావి పౌరులుగా తీర్చిదిద్దితే మరో పొగరుబోతు భర్త, ఆగడ్డలపెట్టే అత్తలు పుట్టరని చెప్పారు. స్త్రీ పురుష సంబంధాల గురించి బహిరంగంగా మాట్లాడటానికే భయపడే రోజుల్లో నిర్భయంగా తన భావాలను స్త్రీకి స్వేచ్ఛ అనే పేరుతో ప్రగతి పత్రికలో రాసిన వ్యాసంలో వెల్లడించారు. తన మరదలిని ఎదిరించడానికి ప్రోత్సహించారు. హేతువాదభావాలను ప్రచారం చేశారు. దేవుడిగుడిలో గంటలు కాదు మోగించేది పేదవాడి గుండెలో ఆకలిమంటలు ఆర్పాలన్న సందేశం ఇచ్చారు. మగవాళ్లే కాదు ఆడవాళ్లు తలకొరివి పెట్టొచ్చునంటూ సంప్రదాయాలపై తిరుగుబాటు చేసి తన తల్లికి తానే కొరివి పెట్టారు సామాజిక రుగ్మతలకు స్త్రీ పురుష తేడా లేకుండా అందరూ గురుపుతున్నారు. అందరూ దీనికి భాద్యత వహించాలంటూ సిస్టర్స్ రోగుల పట్ల ఎలా వ్యవహరించాలో బోధించారు. ఆపదలో ఉన్న రోగికి ఆమె మాటలే అమృతం కావాలన్నారు. నర్సులు మందులతో పాటే మమతనూ పంచాలన్నారు. నేటి యువతను సినిమాలు ప్రభావితం చేస్తున్న తీరుపై బాధపడుతూనే చెడ్డసినిమాలు చూసి డబ్బు అంతకన్నా ముఖ్యమైన సమయాన్ని వృధా చేసుకోవద్దన్నారు. కరువుకోర్లలో చిక్కుకున్న మహబూబ్‌నగర్ జిల్లాలో ఆకలిచావులు చూసి చలించపోయిన ఆమె ప్రత్యక్షంగా రంగంలో దిగి ఆపన్నహస్తమందించారు. మానవతకు వర్గపోరాటాన్ని జోడించి నడిచారు. అందరూ పెండ్లిండ్లయ్యాక హనీమూన్ వెళతారు కాని పాలమూరు జంటలు పొట్టికూటికోసం, అప్పులు తీర్చడానికి వలసలు పోతారని విన్నప్పుడు ఎవరైనా చలించిపోతారు. పండగలొస్తున్నాయంటే చిన్నప్పుడు పొంగిపోయేవారం కాని ఇప్పుడు భయం అంటున్న పాలమూరు కరువుకోర్లలో నలిగిపోతున్న జనం మాటల్ని ఆమె ప్రస్తావించారు. భర్త చనిపోయిన తర్వాత మరో వివాహం చేసుకుంటే ఆస్థిపై ఆమెకున్న హక్కు పోతుందని దాన్ని మార్చాలని ఒక వ్యాసంలో వాదించారు. నాలుగైదేండ్ల క్రితం సుప్రీంకోర్టు ఈ దిశగా ఇచ్చిన తీర్పు బహూశా ఆమె కోర్కెకు ఉపశమనం కావచ్చు. స్త్రీలు తమ పురోగతిని అడ్డుకునే శక్తులతో ఘర్షణ పడుతూ ముందుకు సాగాలన్న సందేశం ఈ తరానికి ఉపదేశం కావాలని కోరుకుంటున్నాను. పెద్దవాళ్లు కొత్తతరానికి అందించాల్సిన వారసత్వ సంపదలో అత్యున్నమైంది. జ్ఞాపకాల రూపంలో అందరినీ అలరిస్తాయి, మా అమ్మమ్మ కథ పేరుతో వెలువడ్డ ఈ చిరుపొత్తం ప్రతి ఒక్కరినీ అలరిస్తుందని ఆశిస్తున్నాను. తప్పక చదివి తీరాల్సిన పుస్తకం. ✱

అవగాహన సందర్భం

# హింసకు బహుముఖాలు

- డా॥ శిలాలోలిత

కనపడని హింసలెన్నెన్నో. ప్రతీ ఆత్మహత్య వెనుకా బాగా గమనిస్తే,హత్యే అని తెలుస్తోంది. శరీరం గాయపడితే దాని రూపాన్ని స్పష్టంగా చూడొచ్చు. కానీ, మనసుకు అయిన గాయాన్ని చూడలేం. దానికి లోతు ఎక్కువ. తీవ్రతా ఎక్కువ.

కుటుంబ చట్రాల్లో ఇలాంటి కనబడని హింసా రూపాలవల్లే ఎందరో కనుమరుగైపోతున్నారు. ఈ హింసలకు స్థాయీ భేదాలు లేవు. కులమతాలూ లేవు. వయోభేదాలు లేవు, ప్రాంతీయ భేదాలూ అసలే లేవు. ఎక్కడైనా, ఎప్పుడైనా, ఎన్నడైనా గాయపర్చే హక్కు తమకే వుందని భావించే దుర్మార్గులెక్కువైపోతున్నారు.

ఏ పత్రిక చూసినా, పత్రికల్లో పట్టనన్ని నేరాలూ, ఘోరాలే. ఏ ఛానల్ చూసినా వివిధ ప్రక్రియల్లో ఎలా చంపొచ్చో, హింసించొచ్చో చూపించే దృశ్యాలే.



మననం విసిగిపోతోంది, మరిగిపోతోంది. ప్రతి ఆత్మహత్య వెనుకా సునామీలంత దుఃఖం గూడుకట్టుకుని ఉంటోంది. " మా అమ్మాయి పిరికిదికాదు. ధైర్యవంతురాలు ఆత్మహత్య చేసుకునేంత బలహీనురాలు కాదు'' వాడే, వాళ్ళే చంపేశారు'' అనే మాటలే వినబడుతున్నాయి. కేంద్ర మంత్రుల కూతుళ్ళయినా, కోడళ్ళయినా, పోలీసాఫీర్ల భార్యలైనా, పోలీసాఫీసర్లయినా, కానిస్టేబుళ్ళయినా, బస్ కండక్టర్లయినా, టీచర్లయినా, డాక్టర్లయినా, హైకోర్టు లాయర్లయినా, విద్యార్థినలయినా, ఇంజనీరింగ్ చదివిన వాళ్ళయినా, సాఫ్ట్‌వేర్ ఉద్యోగాలు చేస్తున్నవాళ్ళయినా, సూపర్‌బజార్లో పనిచేస్తున్నవాళ్ళయినా, ఇళ్ళల్లో పనిమనుషులైనా, రోడ్లు ఊడ్చే స్వీపర్లయినా, ఊరి సర్పంచులైనా, యం.ఆర్.వోలు, కలక్టరైనా, గృహిణులైనా, వ్యవసాయ కూలీలైనా ఇక్కడ పీడనకు గురవ్వడంలో అందరూ సమానులే.

ఎందుకిలా అని మనని మనం ప్రశ్నించుకుంటే తవ్వుకుంటుంటే కనపడే కారణాలెన్నో

తల్లితండ్రుల పెంపకంలో మార్పు రావాలి.

జెండర్ వివక్ష పూర్తిగా పోవాలి.

ఆత్మవిశ్వాసాన్ని పెంపొందేలా పెంచగలగాలి.

హింసను ఎదుర్కొనే ధైర్యాన్ని నేర్పాలి.

ఒకరి కంటే తామెప్పుడూ తక్కువ కాదనే భావాన్ని పెంపొందించాలి.

కట్నం ఇవ్వడం, తీసుకోవడం రెండూ ఉండకూడదు.

ఇచ్చిపుచ్చుకోవడాలున్నప్పుడే ఎక్కువ తక్కువల గొడవలొస్తాయి.

కట్నం మనం ఇస్తున్నామంటే మనని మనం తక్కువ చేసుకుంటూ, మగవాడి ఆధిపత్యాన్ని, అహంకారాన్ని పెంచిపోషిస్తున్నట్లుగా అర్థం చేసుకోవాలి

సరైన చదువూ, స్థిరమైన ఉద్యోగం దొరికేంత వరకూ పెళ్ళి గురించి ఆలోచించ వద్దు.

భావసారూప్యత కలిగిన వ్యక్తులని, మానవత్వమున్న వాళ్ళని నిర్ధారణ అయిన తర్వాతనే, మానసిక, శారీరక పరిణితి సాధించుకున్న తర్వాతే సహజీవనాన్ని గురించి ఆలోచించాలి.

తల్లి తండ్రుల ఉద్యోగాల ఒత్తిడి, ఆర్థిక సమస్యలతో విసిగిపోయిన పిల్లలు, ప్రేమ ఉచ్చులో తొందరగా, అమాయకంగా పడిపోతున్నారు.

ముఖ్యంగా టీనేజర్స్‌కి ఫిజికల్‌గా, మెంటల్‌గా, తమలో వస్తున్న మార్పులకు ఉద్విగ్నత ఎక్కువగా ఉంటుంది. ఆ కాలంలో తమ శరీరాన్ని ఆరాధిస్తున్న, పొగుడుతున్న వ్యక్తుల పట్ల తీవ్రమైన మోహం ఉంటుంది.

మోహానికి, ఆకర్షణకి, ప్రేమకీ మధ్య వున్న వ్యత్యాసాన్ని వాళ్ళకు చెప్పగలగాలి.

పుస్తకాలను చదివించగలగాలి.

కంప్యూటర్లు, నెట్‌లు ఎక్కువైన క్రమంలో పిల్లలు ఏం చేస్తున్నారు అనే విషయాలు వాళ్ళకు తెలియకుండా గమనిస్తుండాలి.

దండిస్తే, అవమానిస్తే వాళ్ళు ఎదురుతిరిగే తత్వాన్ని కలిగి ఉంటారు.

అవసరానికి మించి డబ్బులివ్వడం వల్లా చెడిపోతారు.

పెళ్ళి చేసేయడంతోబాధ్యత తీరి పోయిందనుకోకుండా, కలిసి మెలిసి ఎలా ఉండాలి? బాధ్యతల్ని ఎలా పంచుకోవాలి? హింస ఉంటే ఎలా ఎదుర్కోవాలి? అనే విషయాల పట్ల సరైన అవగాహనను కలిగించాలి.

స్త్రీ పురుషులిరువురూ కలిసి పనిచేసుకోవాలని, బరువు ఒక్కరిపై వేయడం సరైంది కాదనే జ్ఞానాన్ని ఇవ్వాలి.

ఏ ఒక్కరికీ మరొకరిని పీడించే హక్కు చంపే హక్కు లేవని చెప్పగలగాలి.

పుట్టిన ప్రతి వ్యక్తికీ జీవించే హక్కు వుంది.

సమస్యా స్వరూపాల్ని వివరించి, ధైర్యంగా నిజాయితీగా, ధీమాగా, బ్రతికే స్థితిని మనం తీసుకురాగలం.

అందుకు ప్రతి ఒక్కరం ఆలోచించి అడుగువేయాల్సిన సందర్భమిది.

# దస్తకత్

- జాజుల గౌరి



ఉదయం తొమ్మిది గంటలప్పుడు లోతుకుంట ప్రాథమిక పాఠశాలలో టంగ్...టంగ్...మని బెల్లు కొట్టారు. ఆ శబ్దం వినగానే స్కూలు ఆవరణలోని మైదానంలో ఆడుకుంటున్న పిల్లలందరు వచ్చి ఆయా తరగతుల చొప్పున వరుసగా నిలబడ్డారు. ఎప్పటిలాగే ప్రతిజ్ఞా పాఠం అయిపోగానే విద్యార్థులందరు వారి వారి తరగతులకు వరుసగా వెళ్ళి కూర్చున్నారు. అటెండెన్స్ బుక్స్ తీసుకుని తమ తమ క్లాసురూంల్లోకి వెళ్ళబోతున్న సమయంలో నాలుగైదు తరగతుల టీచర్లను కొద్దిసేపు ఉండమన్నారు హెడ్మాస్టరు రంగారావు.

తర్వాత అల్మారాలో నుండి ఫారమ్స్ తీసిచ్చి " ఇవి సోషల్ వెల్ఫేర్ ఆఫీసు నుంచి మన స్కూలుకి వచ్చాయి. మీ క్లాస్‌లలో ఎంతమంది ఎస్సీ, ఎస్టీ పిల్లలున్నారో వాళ్ళకు ఈ ఫారాలిచ్చి వారంలోగా పూర్తిచేసి తీసుకురమ్మనండి, మనం వీటిని పదిరోజులలో సబ్మిట్ చెయ్యాలి" అన్నాడు.

లక్ష్మణరావ్, అన్నమ్మ టీచర్లు రిజిష్టర్లతోపాటే ఆ ఫారాలను తీసుకుని తమ తమ క్లాసులకు వెళ్ళిపోయారు.

క్లాసులో అటెండెన్స్‌ని తీసుకోవటం, ఆ తరువాత పాఠం చెప్పడం కూడా పూర్తయింది. హెడ్మాస్టరు ఇచ్చిన స్కాలర్‌షిప్ ఫారాలను ఒకసారి పరిశీలించిన లక్ష్మణరావ్, విద్యార్థుల వంక చూస్తూ " ఒరేయ్ మీలో ఎస్సీ, ఎస్టీలు ఎవరన్నా ఉంటే చేతులెత్తండ"న్నాడు. పిల్లలందరు ఒకరి మొఖాలు ఒకరు చూసుకున్నారు. అలా చెప్తే పిల్లలకు అర్థం కాలేదనుకుని " మీలో షెడ్యూలు కులాల వాళ్ళు ఎవరన్నా ఉన్నారా?" అని మళ్ళీ ప్రశ్నించాడు. అప్పుడు కూడా పిల్లలు ఒకరి మొఖాలు ఒకరు చూసుకున్నారు.

" షెడ్యూలు కులాలు అంటే ఏందిసార్"? అన్నాడో అబ్బాయి.

" షెడ్యూలు కులాలు అంటే ఉదాహరణకి మాదిగలు, మాలలు మొదలైన కులాల్లో మీరు ఎవరైనా ఉన్నారా?" అడిగాడు. అతను చెప్పింది ఒక్కముక్క పిల్లలకు అర్థం కాక తెల్లమొఖం వేసారు " ఓరి యెదవ పీనుగుల్లారా మీకులం తెలియదా?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు. " ఊహూ" అని పిల్లలు తలలు అడ్డంగా ఊపారు. ఇంతలో ఓ అమ్మాయి అడిగింది. " అసలు కులమంటే ఏంది సార్ ?" అని.

ఊహించని ఆ ప్రశ్నకి లక్ష్మణరావ్ తెల్లబోయాడు. ఏం చెప్పాలో తెలియక మెల్లగా ముఖాన్ని దాటవేసి, స్కాలర్‌షిప్ ఫారాలను విద్యార్థులందరికిచ్చి. " అవి మీ తల్లితండ్రులకు చూయించి నింపి తీసుకొస్తే కొన్ని రోజులయ్యాక మీకు స్కాలర్‌షిప్ వస్తుంది. ఇప్పుడు మీరు నాలుగో తరగతి విద్యార్థులు కదా అర్హతలున్న వారికి ఒక్కొక్కరికి నలభై రూపాయలు వస్తాయి " సావధానంగా చెప్పాడు.

డబ్బులు వస్తాయి అనంగానే పిల్లలకు ఆశ కలిగింది. ఫారాలవైపు చూసారు. కాని తమ కులం ఏమిటో తెలియదన్న విషయం గుర్తుకువచ్చి బిక్క మొఖం వేసారు.

ఆరోజు లంచ్ అవర్లో

భోజనాలయ్యాక లక్ష్మణరావ్ సరాసరి హెడ్మాస్టరు దగ్గరికి వెళ్ళి పరిస్థితి వివరించాడు. అంతలోనే అన్నమ్మ టీచరు కూడా అక్కడికి రావటం చూసిన హెడ్మాష్టరు నవ్వుతూ...

" అన్నమ్మ గారూ మీ పరిస్థితి ఏమిటి?" అడిగాడు.

" ఇద్దరు మాత్రమే తీసుకున్నారు సార్" అంది. హెడ్మాస్టర్ ఎందుకు నవ్వుతున్నాడో ఆశ్చర్యంగా ఉన్న ఆమె మొఖాన్ని చూస్తూ హెడ్ మాస్టర్ " మీ పిల్లలు కొంత నయం లక్ష్మణరావ్ గారి పరిస్థితి మరి దారుణం " అంటూ జరిగిన సంగతి వివరించాడు.

" నా తరగతిలో కూడా పరిస్థితి దాదాపు అలాగే ఉందిసార్. నలుగురితో కల్సి చదువుకుని ఆడిపాడే పసితనంలో కులాల పేరుతో ఇప్పటి నుంచే వేరు చేస్తున్నాము" అంది నిష్ఠూరంగా.

" నిజమే టీచర్ మీ మాటలతో నేను ఏకీభవిస్తాను. కానీ ఇది పై ఆర్డర్ మన బాధ్యతని మనం నిర్వర్తించాలి ' అంటూ అడ్మిషన్ బుక్‌ని తీసి వారికిచ్చాడు.

" ఇందులో విద్యార్థుల పూర్తి వివరాలున్నాయి. మీ తరగతుల్లోని షెడ్యూలు కులాల విద్యార్థులను దీని ద్వారా గుర్తుపట్టవచ్చు. ఈ పనిని తొందరగా కానిచ్చి, ఈరోజు సాయంత్రం వరకు అర్హతలున్న వారికి ఈ ఫారాలను అందజెయ్యండి. వాళ్ళు తిరిగి తెచ్చేటప్పటికీ వారం పడ్తుంది. మనం వాటిని పదిరోజులలోగా సబ్మిట్ చెయ్యాలి తొందరగా కానివ్వండి " అంటూ తొందర పెట్టాడు హెడ్మాష్టరు.

తరగతుల ప్రకారం పేర్లు రాసుకుని వెళ్ళి చివరి బెల్లు అవ్వటానికి ఇంకా కొద్ది నిమిషాలుందనంగా షెడ్యూలు కులాల విద్యార్థులకు ఈ ఫారాలను ఇచ్చారు.

స్కాలర్‌షిప్ ఫారం తీసుకున్న విద్యార్థుల్లో నాలుగో తరగతికి చెందిన రాముడు కూడా ఉన్నాడు. ఫారం చేతిలోకి రాగానే అతడి ముఖం దీపంలా వెలిగిపోయింది. చేతిలో ఉన్న ఫారాన్ని అపురూపంగా చూశాడు. నలభై రూపాయలు తన చేతిలో ఉన్నంత సంతోషం ఒక్కసారిగా ఉక్కిరిబిక్కిరి చేసింది. ఫారాన్ని పుస్తకంలో పెట్టుకుని ఉత్సాహంగా గంతులేస్తూ ఇంటికి పరుగెత్తాడు. రాముడు ఇంటికి వెళ్ళేసరికి ఇంట్లో ఎవ్వరు లేరు. కూలీకెళ్ళిన తల్లితండ్రుల కోసం ఎదురుచూస్తూ అరుగుమీద కూర్చున్నాడు. చుక్కలు పొడిచే సమయానికి ఇంటికి వస్తున్న తల్లితండ్రులను చూసి సంతోషంగా పరుగుపరుగున ఎదురెల్లి " అమ్మ గియ్యాల ఇస్కుల్ల ఇస్కాలరుసిప్పు కాయితాలిచ్చింద్రే. గవి నింపి ఇస్తే నలభై రూపాలు ఇస్తరంట " అన్నడు వగరుస్తూ.

"ఇస్కాలరుసిప్పు కాయితం అంటే ఏందీ కొడక?" అడిగింది మల్లమ్మ అర్థంగాక.

" ఏమో నాకు తెల్వదు. మాస్టారు గదంతా నింపి దీస్కోస్తే ఏడనో సర్కారు ఆఫీసుల ఇస్తరంట. ఆల్లు మనకు రూపాలిస్తరంట " కవ్వింపుగా చెప్పాడు రాముడు.

కాళ్ళు కడుక్కుని వచ్చి " ఆ ఫారంని నూస్తగాని నీవు ఇంట్లకిపో" అన్నది. రాముడు ఇంట్లకి వెళ్ళి బ్యాగులో నుండి స్కాలర్‌షిప్ ఫారం సిద్ధంగా పట్టుకుని ఉన్నాడు.

తల్లి వచ్చేసరికి " ఇగనే అవ్వ గిదే ఈ కాయితం. దీన్ని ఇసుకాలరుసిప్పు పారం అంటరంట. గీపారాలను షెడ్యూలు కులపోల్లకీ ఇస్తారంట. మా సారడిగిండు. మీ కులమేందని. అవ్వ అసలు కులమంటే ఏందే"? ఆశ్చర్యంగా భ్రుకిటిని ముడివేస్తూ తల్లిని ప్రశ్నించాడు.

" కులమంటే ఏంది బిడ్డా కులమే.. గిందుల్ల ఎక్కోల్లు తక్కోల్లు అని ఉంటారు గదా. ఎక్కోల్లని ఎక్వకులపోల్లని తక్కోల్లని, తక్వకులపోల్లని అంటరు గంతే". చెప్పింది.

" మరైతే మన కులమేందే తక్వకులాల్ల గూడా పేర్లున్నాయని మాస్టారు జెప్పిండు.

" మనం మాదిగోల్లం కొడకా గది గూడా తెల్వదా నీకు " అన్నది ఆమె కొడుకు ప్రశ్నలకు సమాధానాలు చెప్పలేక విసుక్కుంటూ.

"ఎట్ల తెలుస్తదే నాకు నువ్వు సెప్పలే నాయినా సెప్పలే" అని చేతులు తిప్పాడు రాముడు తెలియదన్నట్లు.

"ఉండు కొడకా నాయిన నడుగుదాం" అని మల్లమ్మ ఆఫారం తీసుకుని బయట కూర్చున్న రాజయ్య దగ్గరకు వచ్చింది.

"ఓయ్యా! గియ్యాలా మన రామిగానికి ఇసుకాలరుసిప్పు పారమని, గీ కాయతం యిచ్చింద్రంట జెరనూడు గిదెందుకిచ్చింద్రో " అన్నది ఫారాన్ని భర్తకిస్తూ.

రాజయ్య ఆఫారం తీసుకుని కిందికి మీదికి ఒక్కసారి చూసాడు. ఒక్క అక్షరం అర్థం కాలేదు. కానీ ఎందుకిచ్చారో అర్థం అయ్యాక " ఈ ఏముందే గిండ్ల, నిరుడు లచుమన్న కొడుక్కు గీ ఫారమిచ్చింద్రు. దీనిమీద మనకులమేందో రాయాలె మన పత్తేందో రాయాలె. మనం దస్తకత్‌జెయ్యాలె. గాడి వరకు బాగానే ఉంటది. అసలు సుద్ది ఆడనే సురువైతది. మనం మాదిగోల్లమో కాదో తెల్వనీకని సాక్షంగా ఓ దొర దస్తకత్ గావాలే, అన్ని సుద్దులకాడ మాదిగోల్లమైతం గాని, ఈడమాత్రం మనం మాదిగోల్లం అనడానికి ఎక్కోల్ల దస్తకత్ గావాలె. అసలు ఆళ్ళకెట్లా తెలుస్తదే? గీ కులపోల్లమని ఏమన్నా మన మొఖంమీద మోరుయేసుంటదాయేంది? అడ్కిబోతే మీరేంటోళ్ళని అడుగుతాడు. మాదిగోల్లనడాన్కి సాచ్చమేంది అని అడ్గుతారే! గితంతైనంక కూడా పైసలు దీస్కోని గాని దస్తకత్ జెయ్యరే. గా దస్తకత్ దిక్కెల్లి తిరిగి తిరిగి సెప్పులరిగిపోతయే. గందుకని మనం సద్వలే గీ సుద్దులన్ని తెల్వవు మనకు. గీ అక్కరరాలే గాని ఇంగ మనం పోరగాళ్ళ జిందగీకీ పైసలిచ్చి కొనుక్కున్న దస్తకతే సాచ్చమైతది. గీ దస్తకత్ దిక్కెల్లి లచ్చుమన్న తిరిగి తిరిగి తిప్పకాయైయ్యిండు ఎర్కేనా " చరిత్రంతా చెప్పిండు.

" కొద్దిసేపాగి నెత్తి గోక్కుంట " గీ సుద్దంత ఎందుకు గానీ, అసలు గీ కాయితం మీద ఎవల దస్తకత్ కావలె

సెప్పరాదు " దీర్ఘిచ్చింది.

" గా సంగతె చెప్తనే. ఓ డాక్టర్ గానీ, ఓ ఇంజనీరు గాని, లేకుంటే దప్తర్ల పనిచేసే పెద్ద దొరగాని దీని మీద దస్తకతు జెయ్యాలే. ఆళ్ళుగూడా సర్కారు నౌకరు జేస్తుండాలే. గిదంతా మనతోటి గాదు గాని ఆడవడెయ్యి " అన్నాడు పట్టీపట్టనట్టు కోపంగా. తండ్రి అలా కట్టె విరిచినట్టు మాట్లాడేనరికి రాముడి మనస్సు విలవిలలాడింది. నలభై రూపాయలను అమాంతం లాక్కుని గాల్లోకి ఎగిరేసినట్లు అన్పించింది.

" ఏదన్నా సెప్పమంటే పట్టి పర్వాలేనట్లు మాట్లాడ్తవేంది " అని ఫారాన్ని విసురుగా లాక్కుని ఇంట్లకెల్లింది తల్లి. ఆమె వెనుకనే రాముడు వెళ్లుతూ " అవ్వ ఎట్లన్న జేసి, గీ పారము మీద దస్తకత్ చెపియ్యే మనకు రూపాలిస్తరు " అన్నడు ఆశగా.

" ఉండ్ర గిప్పుడైతే వచ్చినా, గప్పుడే గిది తెచ్చి నాముఖమ్మీద కొడ్తివి. ఏడ పనిఆడనే ఉంది. మీనాయినకేమో ఏదీ పట్టకపాయే. ఆగరాదు. ఏడ్కిపోతది " అని భర్తమీద కోసం కొడుకు మీద తీసింది. ఆ మాట విని రాముడు బిక్క సచ్చిపోయాడు. ముఖమంతా మూడ్చుకుని ఇంట్లో ఓ మూలన కూర్చున్నాడు. వంటయ్యాక ముగ్గురికీ కంచాలల్లో అన్నం పెట్టి రాముడిని రాజయ్యని తినమని పిల్చింది. " నేను రాను బువ్వ తినను " అని మొండికేసాడు రాముడు. రాజయ్య కంచం ముందు కూర్చుని " ఏందిరా నీ మొండి లెక్కలు తినకుండే నువ్వే మాడ్తవుపో " అని బెదిరించాడు.

" ఏహే...ఊకోరాదూ అని కడుపు మాడుబెట్టుకుని ఆడు కూకుంటే ఇంకామండే మాటలు మాట్లాడ్తవు గాని, బువ్వతినమని జెప్పవు " అంటూ కంచం తీసుకుని వచ్చి కొడుకుకి అన్నం తినిపించబోయింది. కానీ ఎంతసేపటికి కూడా రాముడు మొండికేసి అన్నం తిననని కూర్చున్నాడు. కొడుకు నెత్తి నిమురుతూ తల్లి " లచ్చుమన్న కాడ్కి పోదాంలే కొడుకా గీ బువ్వతిను. జెరసేపయినంక బోదాంలే" అని కొడుకుని బతిమిలాడి అన్నం తినబెట్టింది. తిన్నంట్లు కడిగి ఇంట్ల బెట్టి సిమ్మచీకట్లో లచ్చుమన్న ఇంటికి తీసుకెళ్ళింది. కడుపల నిలుసొని " లచ్చన్న....ఓ లచ్చన్నా...." అంటా పిలిసింది.

ఆ పిలుపు విని లక్ష్మయ్య ఇంట్లోనించి బయటకు వస్తూ మల్లమ్మను చూసాడు. దగ్గరకచ్చి " బాగున్నవారా సెల్లి! ఏందిరా గింత రాతిరొచ్చినవ్ " పలకరించి ప్రశ్నించిండు. " ఏమీ లేదన్నా రామిగాడికి ఇన్కుల్ల గిదిచ్చింర్రంట. గీ ఫారమెట్లజెయ్యాలో జెర సెప్పన్నా " ప్రాధేయపడినట్లడిగింది.

" నిరుడు గీపారము మా రవిగాడికి గూడా వచ్చిందిరా, గానీ శానాకష్టమైంది దీని మీద దస్తకత్ ఏసీయ్యనీకె. సర్కారు దవాఖాన సుట్టూ ఆరం దినాలు తిరిగినా గానీ సైను జెయ్యకపోయిరి. ఆకరికి ఇరవై రూపాలకి ఏరే డాక్దరు జేసిండు, మరి గిప్పుడు ఆ దొర లేడురా " వివరంగా చెప్పాడు.

"సరే తియ్యి ఆ డాక్దరు లేకుంటే లేకపోయే, సర్కారు దవాఖానాకీ బోతాను " అని ఇంటికెళ్ళింది మల్లమ్మ. తెల్లారి ఆమె కూలికెల్లక, తొమ్మిది గంటలకల్లా ప్రభుత్వ ఆసపత్రికి కొడుకుని వెంటబెట్టుకుని వెళ్ళింది. ఆమె వెల్లేసరికి వైద్యం కోసం వచ్చిన రోగులవరుస చాలా ఉంది. లోనికెల్లి సంతకం చేయించాలంటే ఆమెవల్ల కాలేదు. ఎంతసేపు నిల్చున్నా రోగుల సంఖ్య పెరిగిందే కానీ తగ్గలేదు. చూసి చూసి నిరాశగా ఇల్లు చేరిందామె.

రెండో రోజు కూడా పనికి పోక ఎట్లయినా ఇయ్యాల గీ ఫారం మీద దస్తకత్ జేయించాలెననుకొని కొడుకున్దీసుకుని దబదబ దావఖానకెళ్ళింది. తొమ్మిది గంటలకల్లా డాక్దరొచ్చినవోలె ఒక్కొకరినే లోపలికి తోల్తున్నాడు ప్యూను. తనవంతు రాంగనే మల్లమకు కాల్జేతులు వనికినా మొండి ధైర్యంతో లోపల్జొచ్చింది.

తల్లి కొడుకును సూసి " జబ్బు ఎవరికి ఏమిటి? మీ సమస్యేంది" అడ్గింది డాక్దర్.

మల్లమ్మ కొంచెం తడబడుతూ " రోగం ఏమీ లేదమ్మా " నీళ్ళు మింగింది. కిందికి మీదకి జూస్తూ " రోగం లేకపోతే ఈడికెందుకొచ్చినట్లు " అన్నది సిరాగ్గా డాక్టరు.

కొడుకుని సూయిస్తూ ఈడికి ఇస్కుల్ల గిదిచ్చింర్రు. పైసలత్తయంట. దీని మీద దస్తకత్ కావాలంట. జెర పెట్టుంర్రమ్మా దీనంగా బతిలాడింది డాక్టరుకు ఫారం సూయిస్తూ.

ఫారం సూడంగానే డాక్టర్ మండిపడ్తు " ఏంటమ్మ ఏంటిది. మేము రోగులను చూడడానికీ వచ్చినమా ఈ సైన్లు చేయటానికి ఉన్నమా! ఎందుకు మాటైం వేస్ట్ చేస్తారు " అంటూ అటెండర్‌ని పిలిచి " ఏందయ్యా తలుపు" దగ్గర ఏం జేస్తున్నవ్. ఇలాంటి వాళ్ళనా లోపలికి పంపేది? వీళ్ళను ముందు బయటికి పంపు" అని గర్జించింది.

" ఆ కేకలకు అటెండరు దబదబ వచ్చి మల్లమ్మ రెక్క పట్టుకుని మరోచేత్తో రాముడి కాలరు పట్టుకుని తిండరగని లెక్కలు జేస్తరేంది. తేరి బైంచత్ ఆడ్మెల్లి నడువుండ్రి" అంటూ బరాబరా బయటకు లొక్కొచ్చిండు.

మల్లమ్మ అవేవీ పట్టించుకోకుండా రాముడి చూయిస్తూ " ఓ డాక్టరమ్మా నీకు పుణ్యముంటది జెర దస్తకత్ జెయ్యమ్మా " అని బతిమిలాడుతూనే ఉంది. కానీ ఆ తల్లికొడుకుల పరిస్థితిని ఎవ్వరు పట్టించుకునే స్థితిలో లేరు.

గిదంతా సూసి రాముడు భయపడి తల్లిని పట్టుకుని గట్టిగా ఏడ్వసాగాడు. కానీ ఆమె కొడుకును పట్టించుకునే స్థితిలో లేదు. మనస్సంతా నిస్సత్తువ ఆవరించి నీరసంగా అక్కడే ఉన్న చెట్టుకింద కూర్చుండిపోయింది. కానీ ఆమె ఆలోచనలన్నీ ఆఫారం మీద ఎలాగైనా సంతకం చేయించాలనె పట్టుదల పెరిగింది. ఆమె అక్కడి నుండి కదలకుండా ఆసుపత్రి వైపు చూస్తూ అలాగే కూర్చుండిపోయింది.

పన్నెండు గంటలయ్యింది. అందరు ఎక్కడోళ్ళక్కడ ఎల్లిపోయింర్రు. గానీ మల్లమ్మ ఆడ్నించి కదలక పోవటం చూసి ఆసుపత్రి కాంపౌండరు దగ్గరకొచ్చి " పొద్దుట్నించి జూస్తున్న ఆడనే కూసున్నవు అసలు సంగతేంది" అని తెలుసుకొన్నాడు.

కండ్లనీళ్లు తెచ్చుకున్న మల్లమ్మ పరిస్థితికి జాలితో కంపౌండరు ఆ ఫారాన్ని

తీసుకొని " సరే దీని మీద డాక్టరు గారితో సైను జేయిస్తగాని ముప్పయి రూపాయలు గావాలె, పైసలియ్యి సైను జేపిస్తా" డిమాండ్ వెట్టిండు.

" కూలీ నాలీ జేస్కుని బత్కెటోల్లం సారు. ముప్పయి రూపాయలు ఏడ్కెల్లి వస్తయి. గదిగాక నిన్నగియ్యాల నాకూలీపాయే రోజుకి నలభై రూపాయలిస్తుండె. పోరగాని ఇస్కులుగూడావాయె. దీనంగా అన్నది. చెయ్యి అడ్డంగా ఊపుతూ.

గదంతా నాకు తెల్వదు. సైను గావాలంటే పైసలు గావాలె ఉట్టిగనే ఎవరు సైను జెయ్యరు" అన్నడు.

ఆ మాటలు వినంగానే రాముని గుండెల జారిపోయినయి. సంతకం చేయిస్తాడో లేదోననే ఆందోళనతో " అవ్వ సారు అడిగినన్ని పైసలియ్యరాదె" అన్నాడు.

" నా పోరగాని మొకం జూసన్న జెర దయసూపుండ్రి సారు. ముప్పయి రూపాయలంటే నాతోనిగారు సారూ... ఇరవై ఇస్తదొర అన్నది కొడుకును చూపుతూ. కంపౌండరు రామునివైపు జూసి " ఆ సరె ఎవల్లకీ ఎరుక లేకుండాగా గికాయితంల మడిసియ్యి" అన్నాడు దొంగొలె అటు ఇటు చూసి.

మల్లమ్మ బొడ్లోంచి సంచి తీసి అంతా ఎతికి ఇరవై రూపాయలు తీసి కాగితంలో పెట్టిచ్చింది. కాంపౌండర్ సటుక్కున ఆ ఫారమ్ అందుకొని " సరేగాని పోరగాని పేరు నీ మొగనిపేరు. నీ పత్తా జెప్పు. మని జేబులోంచి కాయితం పెన్ను దీసి మల్లమ్మ సెప్పిన వివరాలు రాసుకున్నాడు. కాగితాన్ని జేబులో పెట్టుకుంటూ " రేపు గీయ్యాలకీ రా! పొద్దుగాలొస్తే పనిగాదూ. పొద్దుగాలొస్తే అందరు నిన్ను గుర్తువడ్తరు. ముందే గియ్యాల మస్తు లొల్లయ్యింది ". అని హెచ్చరించాడు.

మల్లమ్మ దీనంగా అతనివైపు చూస్తా " గట్టనే సారూ వస్తా. గిది ఎట్లయినా . జేయించుండ్రీ మీకు పుణ్యముంటది బాంచెన్ " అని కొడుకుని తీసుకొని ఇంటిదిక్కు నడిచింది ఆలోచనా పూరితంగా.

ఆరోజు రాతిరి భర్త మల్లమ్మతో కయ్యానికి దిగిండు. " నీయమ్మ రెండు దినాలనించి జూస్తున్న నువ్వు పన్కివస్తలేవు అన్ని ఇస్కూలుకు బోనిస్తలేవ్. గవన్నీ మనకు సేతగాదే అని సిల్కకు జెప్పినట్టు జెప్పినా నా మాటను ఈపుకు జెప్పుమంటున్నవ్ గదే.... నీ చెవికి ఎక్కుతేగా....ఇగో రేపట్నుంచి పనికి రాకుంటే ఊకునేది లే....ఆ..." అంటా గుడ్లెర్రజేసిండు.

ఏందయ్యో గట్ల మాట్లడ్తన్నవ్. నేనేమన్నా ఉట్టిగున్నానా ఊర్లమీద తిరిగినానా... నువ్వు జెయ్యకపోతివి నన్ను చెయ్యనియ్యపోతివి. ఏది జేసినా మన పోరగాని గురించేగా. నేనేమన్నా సెడ్డపనిసేత్తే అడుగు. గియ్యాల దేవుడిలాగా కాంపౌండరు సారు గల్సిండు. రేపు పనైపోతదయ్య, గది ఇస్కుల్ల దీస్కపోయి ఇస్తే అయిపాయె. మన పోరగానికి పైసలస్తయి " అన్నది గానీ తన దగ్గరగా కాంపౌండరు ఇరవై రూపాయలు తీసుకున్న విషయం భర్తకు చెప్పలేదు.

మూడోదినం గూడా మల్లమ్మ కూలీకెల్లలె. పదకొండు గంటలకల్లా ఆసుపత్రికెల్లి గేటు బయటే ఎండలో నిల్చుంది. దావాకాన నించి అందరు బయటకెల్లిపోయినంక కాంపౌండరు రావటం జూసి తల్లి కొడుకులు గబగబా అతనికి ఎదురువెళ్లారు. వాళ్ళను చూసి కాంపౌండరు పక్కకు వెళ్ళి, "గిట్ల ఎదురు రాకపోతే గా పక్కన నిలబడొచ్చుగా నేను వొచ్చి ఇస్తగదా." అని కసురుకుంట జేబులోంచి ఫారం తీసిచ్చాడు. దానిని మల్లమ్మ అపురూపంగా తీసుకుని " నీ కడుపు సల్లగుండ సారు. నిన్ను దేవుడు సల్లగా సూడని " అని చేతులెత్తి మొక్కి కొడుకుని తీసుకొని ఇల్లు జేరింది.

నాలుగోదినం ఉదయం అలువెుగలు పనికి వెళ్తే, కొడుకు స్కూలుకెల్లిండు. స్కూలుకు వెళ్లేటప్పుడు దారిపొడుగునా మూడురోజుల నుండి జరిగిన విషయాలే రాముడు కళ్ళముందు మెదలసాగాయి. మూడు రోజుల తర్వాత స్కూలుకు వచ్చిన రాముడ్ని చూసి స్కూలుకు ఎందుకు రాలేదని చెప్పి, రెండు దెబ్బలేసి గోడకుర్చీ వేయించాడు లక్ష్మణరావ్ సారు. మూడు రోజుల నుండి పడ్డ కష్టం ముందు ఆ శిక్ష చాలా చిన్నదిగా అన్పించిందతనికి.

రెండో బెల్లు అవ్వటానికి కొద్ది సమయం ముందు " స్కాలర్‌షిప్ ఫారాలు నింపి తీసుకొచ్చారా?" విద్యార్థులనడిగాడు లక్ష్మణరావ్ సారు. తీసుకురాలేదని పిల్లలు అడ్డంగా తలలు ఊపారు.

" ఇవ్వాల కూడా ఎవ్వరూ తీసుకురాలేదా? ఇంకా మూడు దినాలే గడువుంది తొందరగా తీసుకురండి ఆలస్యం అయితే కష్టం " అని చెప్పి బెల్ కాగానే రిజిష్టరు తీసుకుని క్లాస్‌నించి బయటకు నడిచాడు.

లక్ష్మణరావ్ సారు బయటికి వెళ్లంగానే తానున్న శిక్షనించి చటుక్కున లేచి బ్యాగులోనించి స్కాలర్‌షిప్ ఫారం తీసుకుని " సార్...సార్.." అంటూ బయటికి పరిగెత్తాడు రాముడు.

వెనకనించి సార్ అన్న పిలుపు విని వెనక్కి తిరిగాడు లక్ష్మణరావ్. ఎదురుగా స్కాలర్‌షిప్ ఫారంతో రాముడు. " సార్ ఇసుకాలరుసిప్పు ఫారం " చూయించాడు.

రాముడి దగ్గర్నించి ఫారం తీసుకుంటూ " ఇందాక అడిగాను కదరా అప్పుడు ఇవ్వలేదే " అంటుంటే

" నున్ను గోడకుర్చీ ఏయించారు గదా సార్! గందుకనే ఇయ్యలే " అన్నాడు.

లక్ష్మణరావ్ సారు రాముడి బుజం మీద చెయ్యేసి సున్నితంగా నొక్కి అభినందిస్తున్నట్లుగా నవ్వుతూ వెళ్ళిపోయాడు. రాముడి కండ్లు సంతోషంతో మెరిసాయి. సారు చెయ్యేసిన భుజాన్ని గర్వంగా చూసుకున్నాడు. బాగా సదువుకుని నేను గూడా పెద్ద సారునై దస్తకత్ చేస్తానని అనుకొని అంతర్మథనం నించి భవిష్యత్‌లోకి సూసాడు. అతని సూపు మాత్రం మావిగున్న మీదున్న సిలక పలుకుతున్న పలుకుమీద నిలిసింది. ●

(మన్ను బువ్వ పుస్తకం నుండి)

# పని పిల్ల

- కె. అంజన



అమ్మా..మణెమ్మా...’

వస్తున్నా...ఒక్క నిమిషం..

“గట్టు మీద కూర్చోవే అమ్మగారు వచ్చేనరికి ఆలస్యమౌతుందేమో’’ కూతురితో అంది మంగ. తల్లిచెప్పిన వెంటనే చతికిలపడింది గంగ. అక్కడినుంచి లోపలికి చూస్తే హాల్ అంతా కనిపిస్తోంది. సోఫాలో కూర్చుని చదువుకుంటున్న ఓ పిల్లవాడు కనిపించాడు గంగకు. కళ్ళు ఇంతింతవి చేసుకుని తొంగి తొంగి వాణ్ణే చూస్తోంది. సరిగ్గా అప్పుడే బయటికి చూసిన బాబీకి గంగ కనిపించింది. ఆ అమ్మాయి తననే చూడడం వాడికి నచ్చలేదు. విసురుగా లేచి లోపలికి వెళ్లిపోయాడు.

‘‘ఆ..రా మంగా! అక్కడే ఆగిపోయావే. నువ్వేమైనా కొత్తదానివా ఏంటి? ఏది నీ కూతుర్ని తీసుకొస్తానన్నావ్‌గా? వచ్చిందా?”అంది మొహం తుడుచుకుంటూ.

“ఆ.. ఆ పనిమీదే వచ్చానమ్మా. ఇదిగో ఇది గంగ. ఇంక మీ ఇంట్లో నా బదులుగా పనిచేసేది ఇదేనమ్మా..”అంది కూతురి భుజం మీద చెయ్యేసి చూపిస్తూ.

గంగను చూసి “మరీ చిన్నదిగా ఉందిగా మంగా, తనతో పనేం చేయించుకుంటాను చెప్పు?’ అంది బాధగా.

‘‘చిన్నదా...పాడా...మొన్నటి పౌర్ణమికి పది నిండి పదకొండో ఏడు వచ్చింది. ఇంకా చిన్నదేంటిది? దీనికి రాని పనిలేదమ్మా..అన్నీ చకచకా చేసేస్తది. అదేదో సిన్మాలో రజనీకాంత్‌లాగానంటే నమ్మండమ్మా’’ అంటుంటే..గంగ కలగచేసుకొని “రోబో..సినిమాలో చిట్టిలాగా ...అమ్మా..” అంది తల్లి కొంగు మొహానికి అడ్డు పెట్టుకుంటూ.

ఆ మాటలకు ‘పిల్ల చాలా చురుకుగా ఉందే. బడికి పంపకపోయావా మంగా? పనిలోకెందుకు చెప్పు?’అంది మణి మెచ్చుకోలుగా.

“ఆ..మాకు బడీ గిడీ

ఎక్కడమ్మా...కడుపు నిండటమే కష్టంగుంటే..అదంతా వద్దుగానీ..దీన్ని పనిలో పెట్టుకోండమ్మా..’అంది బతిమాలుతున్నట్టు.

‘‘మా బాబిగాడి వయసున్న పిల్లనుపనిలో పెట్టుకోడానికి నాకెందుకో మనసు రావట్లేదే’అంది సాలోచనగా.

‘అమ్మా.. ఆ మాట మాత్రం అనకండమ్మా.. నా తాగుబోతు మొగుడు దెబ్బకి రెండు పూటలా కూడు తినడమే కష్టంగుంది..దాన్ని పనిలో పెట్టుకోండమ్మా..’అంటూ కాళ్లమీద పడిపోయింది.

‘ఛ...పెద్ద దానివి నువ్వు నా కాళ్లమీద పడడమేంటి మంగా..లే ..సరే..రమ్మను..’ అంది ఆ మాటలకు తల్లీకూతుళ్లు కళ్లు మెరిసిపోయాయి.

గంగ పనిలోకి వచ్చి పదిహేను రోజులు దాటింది. చలాకీగా ఆడుతూ పాడుతూ పని ముగించేసేది. మంగ చేయలేని పని కూడా చేసేసేది. మంగకు వాషింగ్ మిషన్‌లో బట్టలు వేయడం వచ్చేది కాదు. ఎన్ని సార్లు చెప్పినా మణి వుంటేగానీ ఆ పనికాదు. ఇప్పుడు గంగ తనే వేస్తోంది. మణి ఒకటి రెండు సార్లు దాన్ని ఎలా వాడాలో నీళ్లు ఎలా నింపాలో, సర్ఫ్ ఎంత వేయాలో చెప్పింది. చక్కగా తెల్ల బట్టలను ఒకసారి, రంగు బట్టలను ఒకసారి వేరు చేసి మెషీన్‌లో వేస్తుంది. రంగు వచ్చే బట్టలేమైనా వుంటే ముందుగానే వాటిని వేరు చేసి చేత్తో ఉతుకుతుంది. గిన్నెలు కూడా చిటికెలో తళతళా మెరిసేలా కడిగేస్తుంది. ముందు మామూలు వాటిని, తర్వాత నూనె గిన్నెలు కడిగేది. ఆ నైపుణ్యం మణికి ఎంతగానో నచ్చింది. పిల్ల చూడ్డానికి కూడా ముచ్చటగా ఉంటుంది. ఆ పేద ఇంట్లో కాకుండా ఇంక ఎక్కడ పుట్టినా దాని బతుకు

మరోలా వుండేదని మణి ఎన్ని సార్లు అనుకుందో లెక్కేలేదు.

కానీ ఒక విషయం మాత్రం మణికి నచ్చేది కాదు. బాబీగాడు కనిపిస్తే చాలు అన్ని

పనులు వదిలేసి వాళ్ళే అలా చూస్తుండిపోతుంది. వాడు తింటున్నా, చదువుకుంటున్నా, స్కూలు డ్రస్సు వేసుకున్నా, ట్యూషన్ మాస్టారితో పాఠాలు చెప్పించు కుంటున్నా అలా గుడ్లప్పగించి చూస్తుండి పోతుంది.

బాబిగాడు ఒకటే గోల. గంగను పనిలోంచి మాన్పించమని. ఎందుకురా అంటే చెప్పేవాడు కాదు. అది ఇంట్లో మాత్రం కనిపించకూడదనేవాడు. వాడితో కారణం చెప్పించుకోవడానికి చాలానే కష్టపడాల్సి వచ్చింది. వాడు చెప్పింది విని మణి ఆశ్చర్యపోయింది. నమ్మలా. పైగా కొడుకునే కోప్పడింది.

“నీ బొంద ఆ పిల్ల అలాంటిది కాదు. నీ పని నువ్వు చూసుకో. అని నచ్చచెప్ప చూసింది. కానీ వాడు మాత్రం గోల మానలా.

‘లేదమ్మా..నేను ఏం టిఫిన్ చేస్తున్నా..పాటు తాగుతున్నా, అన్నం తింటున్నా..అలాగే గుడ్లప్పగించి చూస్తుంది. ఇంకా అదే కాదు! స్కూలు డ్రస్సు వేసుకున్నప్పుడైతే మరీ. ఇంకా చదువుకునేటప్పుడైతే మెడ జిరాఫీలా ఇలా సాగదీసి చూస్తుందమ్మా.. రోజూ నా గది ఊడ్చుడానికి వస్తుందికదా. అప్పుడు చూడాలి దాని సంగతి. స్కూలు బ్యాగు, పుస్తకాలు పెన్నులు,పెన్సిళ్ళు, ఆటవస్తువులు అన్ని పట్టుకుని చూస్తుంది. అవంటే దానికి పిచ్చి.. ఓ రోజైతే నేనుస్నానం చేసి బాత్‌రూమ్‌లోంచి వచ్చేసరికి నా స్కూల్ బ్యాగ్ తగిలించేనుకుంది తెల్సా..’ అలా చెప్పుకెళుతూనే ఉన్నాడు.

అవన్నీ వింటుంటే మణికి తల తిరిగిపోయింది. కాసేపు మౌనంగా తల పట్టుకుని కూర్చుని..బాబీ..గంగ పనిలోకి వచ్చాక,, నీ వస్తువులు ఏమైనా పోయాయా”అనడిగింది.

“వాడు వెంటనే లేదమ్మా.. ఒక్కటి కూడా పోలా! పైగా నేను చిందరవందరగా పడేసినవన్నీ కూడా చాలా జాగ్రత్తగా సర్దిపెడుతుంది. కాకపోతే గుడ్లగూబలాగా చూడడమే నాకు నచ్చలా..”

ఆ పిల్ల దొంగతనం చేస్తుందా? అని అడిగినందుకు మణి తర్వాత చాలానొచ్చుకుంది. అన్ని పనులు అంత వైనంగా చేసే పిల్ల ఈ ఒక్క విషయంలో అలా ఎందుకు ప్రవర్తిస్తుందో అర్థమే కాలా? మొదట అవేవీ నమ్మలేదు. వీడేదో చెప్తున్నాడనుకుంది. కానీ తర్వాత్తర్వాత తనూ గమనించింది. వాడు చెప్పినదాంట్లో తేడా ఏం లేదు. గంగకు బాబీని చూస్తే కళ్లు మెరుస్తాయి. వాడి వస్తువులు ఏం చూసినా చాలా సంతోషిస్తాయి వాడి స్కూల్ డ్రస్సు, బూట్లు, లంచ్ బాస్కెట్ అన్నీ ఎంతో శ్రద్ధగా శుభ్రం చేయడాన్ని పసిగట్టింది మణి.

ఏం చేయాలో పాలుబోలా. ఆ విషయాన్ని భర్త దగ్గర ప్రస్తావించింది. మొదట అతనూ నమ్మలా. పైగా తెరలు తెరలుగా నవ్వాడు.

‘పనిపిల్ల అలా చేస్తుందని అబద్ధం చెప్తే కళ్లు పోతాయ్ మణి! అది పసిది పదేళ్ళు లేవు. ఛ..ఛ.. నీకు పిల్లపని నచ్చకపోతే మాన్పించేద్దాం. అంతే గానీ ఇలా సాకులు చెప్పకు’ అన్నాడు కాస్త చిరాగ్గా.

కానీ ఆ తర్వాత అతను కూడా గంగను ఓ కంట కనిపెడుతూనే ఉన్నాడు. వాళ్లు చెప్పింది అక్షరాలా నిజం. ఆ తర్వాత అతను మరో విషయం కూడా గుర్తించాడు. ఇంటికి వచ్చే న్యూస్ పేపర్లను చాలా జాగ్రత్తగా అపురూపంగా సర్దుతుంది గంగ. ఒక్క పేపరు అటూ ఇటూ పడినా తనకు నచ్చదు. సరి చేసి వెళుతుంది. పైగా తన ఆఫీసు కాగితాలు ఎంతో భద్రంగా పెడుతుంది. కరెంటు బిల్లులూ, గ్యాస్ బిల్లులూ, కేబుల్ బిల్లులూ, ఉత్తరాలూ అంతకుముందు ఎక్కడ పడితే అక్కడ ఉండేవి. గంగ వచ్చిన దగ్గరనుంచీ వాటన్నిటినీ ఒకచోట పెట్టడం గమనించాడు. మణి కాలక్షేపానికి తెప్పించుకునే వార పత్రికలూ, అందులోని బొమ్మలను ఉత్సాహంగా చూస్తుంది గంగ.

అతను ఆలోచించగా.. ఆలోచించగా.. ఒక విషయం బోధపడింది. మణిని పిలిచి తను గమనించిన విషయాలన్నీ ఏకరువు పెట్టి ఆ పిల్లకు దురుద్దేశ్యమేమీ లేదు. కాకపోతే తనకు అక్షరాలన్నా, పుస్తకాలన్నా చెప్పలేనంత పిచ్చి. చదువుకోవాలని పిచ్చి కోరిక. అది వీలవదు కాబట్టి మన ఇంట్లో ఇలా కనిపించిన ప్రతి పుస్తకాన్నీ పేపరునూ చాలా జాగ్రత్తగా సర్దుతుంది. అలాగే బడికెళ్లే బాబిగాడితో తనను తాను చూసుకుంటుంది. వాడు చదువుకుంటన్నా, ఆడుకుంటున్నా, తింటున్నా వాడిలో తనను చూసుకుంటుంది. అలా తను చదువుకోగలిగితే బాగుండేది గంగ కోరిక. అందుకే అలా చేస్తుంది. అన్నాడు. ఆ మాటలకు మణి నోరు మూతపడితే ఒట్టు. చాలా సేపటి తర్వాత...నిజమేనంటారా! అంతేనంటారా! అంతకుమించి మరేం లేదంటారా?’అంది నిదానంగా.

అంతే మణి..నువ్వు ఎటూ చదువులేకుండా పనిపాటలు చేసుకునే పిల్లలకు అక్షరాలు నేర్పుతానని ఎప్పటి నుంచో గొడవ చేస్తున్నావ్‌గా. అదేదో ముందు గంగతోనే మొదలెట్టు..నీకూ కాలక్షేపంగా ఉంటుంది. దానికీ చదువుకోవాలన్న కోరిక తీరుతుంది. అన్నాడు.

మణి వెంటనే గంగ దగ్గరకెళ్లి అదే చెప్పింది. ఆ మాటలు విన్న గంగ సంతోషం పట్టలేక మణి చెయ్యి తీసుకుని చెంపకు ఆనించుకుంది.

## యదార్థ గాథ

# భార్య ఖరీదు ₹ 2 కోట్లు

– కాశీవఝుల రమానరసింహం

బొంబాయి వెళ్ళిన భర్తకోసం కళ్ళు కాయలు కాసేలా ఎదురు చూస్తోంది విద్య. గుజరాత్‌కు చెందిన నాడియాడ్ టౌన్లో ఉంటోంది విద్య. అది ఆమె పుట్టిల్లు. హఠాత్తుగా తలుపు తట్టిన శబ్దం వినబడింది.

తలుపు తెరవగానే కనిపించిన వ్యక్తులని చూసి ఆమె ఆశ్చర్యపోయింది. సిబ్బందితోసహా వచ్చిన పోలీసు ఆఫీసర్ని చూసి చకితురాలయ్యింది. పోలీసులు, అందులోను వేళకానివేళ రావటంతో ఆమె కంగారుపడింది.

" శ్రీమతి విద్యాపటేల్ అంటే మీరేనా?" అని ఆమెను ప్రశ్నించాడు పోలీసు ఆఫీసరు.

" అవును ఇంతకీ మీరెవరు?'' సందిగ్ధంతో కొట్టుమిట్టాడుతున్న విద్య పోలీసాఫీసరుని అడిగింది.

" నేను బొంబాయి నుండి వచ్చాను క్రైం బ్రాంచి అధికారిని. నా పేరు సరయుకదమ్."

" సరే ఇంతకీ నాతో మీకేం పని?"

" నుంచున్న పాటున మిమ్మల్ని బొంబాయి తీసికెళ్ళడానికి వచ్చాం" తాపీగా బదులిచ్చాడు ఆ పోలీసాఫీసరు.

" ఎందుకని నేనేం నేరం చేయలేదే" గొణిగినట్టుగా ఉంది విద్య గొంతు.

" మీరు నిరపరాధి అని మాకు తెలుసు. అయినా ప్రస్తుతం మీరు మా మాట వినితీరాలి" వాస్తవాన్ని కాస్త మృదువుగానే చెప్పాడు సరయుకదమ్.

విద్యావాళ్ళు ఉండేది బ్రిటన్‌లో. భర్త వినోద్‌పటేల్‌కి బ్రిటిష్ పౌరసత్వం కూడా ఉంది. ఇండియాలో ఉన్న తల్లితండ్రులను చూద్దామని భర్తతో కలిసి పుట్టిల్లు ఉన్న నాడియాడ్ వచ్చింది. భార్యని పుట్టింట్లో దింపి, ఏదో అర్జంటు పని ఉందంటూ బొంబాయి వెళ్ళాడు పటేల్.

" విషయం ఏమిటో నేను తెలుసుకోవచ్చా?'' కుతూహలాన్ని అణచుకుంటూ యథాలాపంగా అడిగినట్టు ఉంది విద్య స్వరం. " నేను మీకు సహకరిస్తాను. అందుకు అభ్యంతరం లేదు. కానీ, ఎందుకు అని అడిగే తల్లీ తండ్రికీ నేనేమని బదులివ్వను? వెళ్ళే లోపల కారణం చెప్పాలి కదా వాళ్ళకి".

" సర్టెన్లీ అయితే వినండి. మీరిక్కడ నిక్షేపంగా చిన్నపాటి నలత కూడా లేకుండా హాయిగా ఉంటే మాకొచ్చి ఏం చెప్పాడో తెలుసా మీ ఆయన....మీరు చచ్చిపోయారని కంప్లయింటు చేసాడు...." మెత్తగా నవ్వుతూ అసలు విషయాన్ని చెప్పాడు బొంబాయి నుంచి వచ్చిన ఆ పోలీసాఫీసరు.

విద్యకి ఆ విషయం నమ్మశక్యంగా లేదు. " నేనిక్కడ ఆరోగ్యంగా ఉంటే ఆయనెందుకలా చెబుతారు? మా ఇద్దరి మధ్యా కలతలు కూడా లేవు. అయినా ఎలా అనగలిగారీ మాటని?" నివ్వెరపోయింది విద్య.

" యు ఆర్ రైట్.. ఇట్స్ క్వయిట్ స్ట్రేంజ్ ... కాని మీకు ఆకస్మాత్తుగా గుండెపోటు రావడంతో పోయారని చెప్పారు మీ భర్త..."

" ఎందుకని అలా...." ఇంకా ఏదో తెలుసుకుందామనుకుంటున్న విద్య మాటకి మధ్యలోనే అడ్డొచ్చిన సరయుకదమ్ " బొంబాయి చేరగానే మీకన్ని విషయాలూ తెలుస్తాయి. సారీ. ప్రస్తుతం ఇంతకుమించి నేను మీకేం చెప్పలేను". ఆమె స్థితిని అర్థం చేసుకు.. అనునయంగా అన్నాడు.

మొత్తానికి ఎలాగయితేనేం క్రైమ్ బ్రాంచి బృందం విద్యని బొంబాయి తీసుకెళ్ళి పై అధికారుల ముందు హాజరు పరచగలింది.

వినోద్‌పటేల్ పుట్టింది ఉగాండాలో. అయినా అతడు భారతీయుడు. తరువాత బ్రిటిష్ పౌరసత్వాన్ని సంపాదించాడు. లండన్‌లోని 'ఎసెక్స్'లో పదమూడు గదుల ఓ పెద్ద భవంతిలో ఇతడి నివాసం. అపారమైన లాభాలని ఆర్జించిపెట్టే ఒక పెద్ద డిపార్ట్‌మెంటల్ స్టోర్సుకి స్వంతదారుడు. ఎనిమిది అత్యంత ఆధునికమైన కార్లతోపాటు మరింకెన్నో ఆధునిక సదుపాయాల మధ్య ఆస్తిపాస్తుల మధ్య విలాసవంతమైన జీవితాన్ని గడుపుతున్నారు పటేల్ దంపతులు.

పుట్టి పెరిగింది విదేశాల్లో అయినా స్వదేశం అన్నా, మన ఆచార వ్యవహారాలన్నా, వాటిని పాటించే భారతీయులన్నా పటేల్‌కి ఎంతో అభిమానం, గౌరవమూనూ. ఆ అభిమానంతోనే అతడు భారతీయ స్త్రీని వివాహమాడాలని నిశ్చయానికి వచ్చాడు. అలాగే ఇండియా వచ్చి గుజరాత్‌లో తమ తెగకు చెందిన అమ్మాయినే పెళ్ళి చేసుకున్నాడు.

నాడియాద్‌లో ఉండే విద్యా పటేల్‌ని పెళ్ళి చేసుకుని అతడితోపాటు లండన్ వెళ్ళిపోయింది. ఆ దంపతులు అక్కడ ఖరీదైన, ప్రశాంతమైన జీవితాన్ని గడిపారు. సుఖంగా కాపురం చేసేవారు.

రోజులు పరిగెడుతున్నట్టుగా వున్నాయి ఆ దంపతులిరువురికి. అలాంటి రోజుల్లోనే వినోద్ తన భార్య విద్య పేర లండన్‌లోని ' అలియడ్ డన్‌పర్ అస్యురెన్స్ కంపెనీ ' లో జీవిత భీమా పాలసీ ఒకటి రెండు కోట్లకు తీసుకున్నాడు.

ఎంతో స్థితిమంతుడు అయినప్పటికీ వినోద్‌కు డబ్బుపట్ల వ్యామోహం రాను రాను పెరుగుతోందే కానీ తరగటంలేదు. ఆ వ్యామోహంతోనే లండన్, ఇండియాలలో షేర్ మార్కెట్లో పెద్ద పెద్ద మొత్తాలను ఇన్వెస్ట్ చేసేవాడు. నష్టం సంభవిస్తున్నా షేర్ల బిజినెస్‌లో డబ్బు పెట్టడం మానేవాడు కాదు. దాంతో రెండు దేశాల్లోనూ నష్టం కోట్లు దాటిపోయింది. అతని అకౌంట్లన్నీ బ్యాంకులు జప్తు చేసుకున్నాయి. అప్పులు తీర్చని కారణంగా డిపార్ట్‌మెంటల్ స్టోర్సులో కూడా పెద్ద ఎత్తున నష్టం వచ్చింది. దంపతులిద్దరూ ఆర్థికంగా బాగా చితికిపోయారు.

ఆర్థికంగా, మానసికంగా క్రుంగిపోయిన వినోద్‌కు లండన్‌లో ఉండటం దుర్లభమైపోయింది. కొంతకాలంపాటు ఇండియాలో ఉంటే మంచిదని తోచింది అతనికి. 1992 ఫిబ్రవరిలో అతడు భార్య విద్య సమేతంగా బొంబాయి వచ్చాడు.

బొంబాయిలో 'సోనావాలా' ట్రావెలింగ్ ఏజెన్సీ నడుపుతున్న సునీల్ సోనావాలా వినోద్ స్నేహితుడు. వినోద్ ఎప్పుడు ఇండియా వచ్చినా అతడి ప్రయాణపు ఏర్పాట్లన్నీ ఇతనే చూసేవాడు. దాంతో సహజంగానే దగ్గరయ్యారు. ఆప్తమిత్రులుగా స్థిరపడ్డారు. సునీల్ నివాసం బాలకేశ్వర్‌లో.

సునీల్‌కు, జీవితాన్ని ఎంతో తేలికగా తీసుకుని, ప్రతి నిముషాన్నీ ఉల్లాసంతో అనుభవించే సరదా పురుషుడుగా వినోద్ పరిచయం. అలాంటిది ఈ ట్రిప్పులో వినోద్ ముభావంగా ఉండడాన్ని గమనించాడు సునీల్. ఎన్నిసార్లు కారణం చెప్పమని నిర్బంధించినా చిరునవ్వుతో త్రోసిపుచ్చేవాడు వినోద్.

అలా చాలాసార్లు నిలదీసి అడిగితే, ఆఖరికి ఒకరోజు జరిగిందంతా చెప్పుకొచ్చాడు వినోద్. శ్రద్ధగా విన్నాడు సునీల్. ఈ ఆర్థిక సమస్యల వలయలోంచి స్నేహితుడ్ని బైటపడెయ్యడానికి ఒక పథకాన్ని ఆలోచించాడు. వినోద్ తన భార్య పేర రెండు కోట్లకి ఇన్సూరెన్సు తీసుకున్నాడనే విషయం సునీల్‌కు తెలుసు. దానిని దృష్టిలో పెట్టుకుని ఊహించని విధంగా ఒక సలహా ఇచ్చాడు. వినోద్‌ని తన భార్య చనిపోయిందని చెప్పి, జీవిత భీమాకి క్లెయిమ్ చెయ్యమన్నాడు, దాంతో అతని జాతకమే మారిపోతుందని, నష్టాలను భర్తీ చేసుకుని తిరిగి వ్యాపారం ఆరంభించవచ్చునని స్నేహితుడికి నూరిపోసాడు. స్నేహితుడి ఒత్తిడి కారణంగా మొదట్లో వినోద్ అయిష్టంగానే ఈ రిస్క్ తీసుకోవడానికి ఒప్పుకున్నాడు. ఆ తర్వాత స్నేహితుడి పట్టుదలపై ఆఖరికి గట్టి నమ్మకంతో కార్యోన్ముఖుడవడానికి సంసిద్ధత వ్యక్తం చేసాడు.

" నా భార్య చనిపోయిందని ఎక్కడి నుండి రుజువు తీసుకురాను? ఇదంతా అయ్యే పని కాదులే" అని వినోద్ మొదట్లో అనేవాడు.

నువ్వనవసరంగా వర్రీ కాకు. ఇది ఇండియా. ఇక్కడేమైనా చెయ్యవచ్చు. డబ్బుతో దేన్నైనా ఎవరినైనా సులువుగా కొనెయ్యవచ్చు. ఆఖరికి మరణాన్ని కూడా. నీకు కావలసిన పద్ధతిలో విషయాలని మలుపు తిప్పవచ్చు". అంటూ వాదించాడు సునీల్.

సునీల్ అన్నట్లుగానే ప్రతి విషయాన్నీ మేనేజ్ చేసేసాడు సులువుగా. ముందుగా వినోద్‌ను ఒక డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళాడు. ఆ డాక్టరు సునీల్ స్నేహితుడే. విద్య గుండెపోటుతో మరణించినట్లుగా డెత్ సర్టిఫికెట్ ఇచ్చాడు ఆ డాక్టరు. స్మశాన వాటిక నుంచి సర్టిఫికెట్ కూడా ఇప్పించాడు. విద్య దహనక్రియలు జరిగినట్లుగా ఆ క్రిమేషన్ గ్రౌండ్ ఇన్‌ఛార్జ్ వినోద్‌కు ఒక సర్టిఫికెట్ రాసిచ్చాడు. ఇందుకోసమై బొంబాయి మునిసిపల్ కార్పొరేషన్ క్లర్కు సహాయాన్ని తీసుకున్నాడు. విద్య మరణానికి చెందిన నిజానిజాల వెరిఫికేషన్ కోసం సివిక్ అథారిటీ వస్తే ఇబ్బందులేమీ ఎదురవకుండా ఉండటం కోసమై బాగా ఉపయోగపడ్డాడు క్లర్కు.

1992 ఫిబ్రవరి 16న విద్య డెత్ సర్టిఫికెట్ జారీ అయ్యింది. ఈ వ్యవహారానికి అనుకూలంగా రూమ్ నెం.4142, ఇంటి నెం,114 ఏన్‌టాప్ హిల్ అనే లోకల్ ఎడ్రస్‌ని ఉపయోగించాడు.

" కొంతకాలం నీ భార్య గురించి బయట చెప్పకు. నలుగురికంటా పడకుండా ఎక్కడన్నా ఉంచిరా" అన్న స్నేహితుడి సలహాపై విద్యని నాడియాడ్‌లో పుట్టింట్లో దిగవిడిచి, 'అర్జెంటు పనుంది. చూసుకుని త్వరలో వస్తా' అని బొంబాయి వెళ్ళాడు వినోద్.

డాక్యుమెంట్లన్నీ సిద్ధం కాగానే వెంటనే లండన్ ప్రయాణమయ్యాడు వినోద్. భార్యతో చెప్పకుండానే లండన్లో డబ్బుకోసం ఇన్సూరెన్స్ కంపెనీకి క్లెయిమ్ చేసాడు. సడన్‌గా వచ్చిన హార్ట్-ఎటాక్ కారణంగా భార్య మృతి చెందిందని తెలిపాడు.

సంపూర్ణ ఆరోగ్యంతో ఉన్న విద్య అందునా నలభయ్యేళ్ళ పిన్న వయస్కురాలు గుండెనొప్పితో హఠాన్మరణం పొందిందంటే ఇన్సూరెన్స్ కంపెనీకి నమ్మబుద్ధికాలేదు. వినోద్ చేసిన క్లెయిమ్ పట్ల సంశయం బయులుదేరింది వారిలో. డబ్బు ముట్టచెప్పటానికి ముందు ఈ క్లెయిమ్‌లోని నిజానిజాలను వెరిఫై చెయ్యాల్సి ఉంది. కాబట్టి మీరు కొంతకాలం వెయిట్ చెయ్యండి". అని వినోద్‌కు చెప్పారు కంపెనీవాళ్ళు.

చెప్పినట్లుగానే ఈ క్లెయిమ్ వివరాలు తెలుసుకోవడానికి చురుకైన ఓ ప్రైవేటు డిటెక్టివ్‌ని నియమించింది ఆ ఇన్సూరెన్స్ సంస్థ. పరిశోధన నిమిత్తం ఆ డిటెక్టివ్ ఇండియా చేరుకున్నాడు.

బొంబాయి చేరుకున్న ఆ పరిశోధకుడు వినోద్‌పటేల్ వ్యవహారాన్నంతా కనుగొని, దానిని కంపెనీకి వ్రాతపూర్వకంగా తెలియజేసాడు. క్లెయిమ్ చెయ్యడానికి కావలసిన డాక్యుమెంట్లు అన్నిటినీ వినోద్ కంపెనీకి అందచేసినా కూడా అవన్నీ అబద్ధపు

డాక్యుమెంట్లని రిపోర్టిచ్చాడు ఇన్సూరెన్స్ కంపెనీకి.

అతడి రిపోర్డుని ఆధారంగా చేసుకుని, కంపెనీవారు లండన్ పోలీసులకు డిటెక్టివ్ రిపోర్డుని అందజేసారు. లండన్ పోలీసులు ప్రాథమిక దర్యాప్తుచేసారు. ఆ మోసం జరిగింది ఇండియాలో కాబట్టి కేసుని ఇంటర్‌పోల్‌కి అప్పజెప్పింది. లండన్ పోలీసుశాఖ ఇంటర్‌పోల్ ఢిల్లీ అధికారులను సంప్రదించి చివరికి కేసు సిబిఐకి అప్పజెప్పడమయ్యింది.

ఎసిపి బార్వే సీనియర్ ఇన్‌స్పెక్టర్ అయిన హోమీ ఇరానీకి ఈ కేసుని అప్పగించారు. హోమీ ఇరానీ టీము పెద్ద యెత్తున పరిశోధన ప్రారంభించింది. ముందుగా వినోద్ పటేల్ అడ్రస్ గురించి వెరిఫై చేసారు. అది బోగస్ అడ్రస్సని బయటపడింది. బిల్డింగ్ నెంబర్ 114లో 4142 అనే నెంబరు గల గది లేనేలేదు. తరువాత ఈ పోలీసు టీము వాడ్లా క్రియేషన్ గ్రౌండ్‌కు వెళ్ళి తాంబేతో చెక్ చేసింది. ఈ తాంబే ఎవరోకాదు. బిఎమ్‌సి (బొంబాయి మునిసిపల్ కార్పొరేషన్) క్లర్కు. అతగాడు మొదట్లో తానిచ్చిన స్టేట్‌మెంట్ నిజమేనని బుకాయించినా పోలీసులు తమ బలాన్ని రుచిచూపించేసరికి దారికొచ్చి నిజం కక్కేసాడు. తనిచ్చిన సర్టిఫికెట్ అదనపు సర్టిఫికెట్ అని చెప్పేసాడు. వినోద్ ఫ్రెండు సునీల్ సోనావాల్ పేరు బయటపెట్టాడు. ఈ మోసంలో అతడిదే కీలకపాత్ర అని గ్రహించిన పోలీసులు మరో ట్రావెల్ ఏజెన్సీకి చెందిన రాజు అనే వ్యక్తిద్వారా సునీల్ అడ్రస్ సంపాదించి అతగాడిని అరెస్టు చేసారు.

వినోద్ పటేల్ అనే వ్యక్తి ఎవరో తెలియదని, అసలాపేరే తనెప్పుడూ వినలేదని సునీల్ మొదట్లో బుకాయించాడు. చివరికి వాస్తవాలను ఒక్కొక్కటిగా చెప్పుకొచ్చాడు సునీల్. వెల్లిపార్లేలో ఎవరో బంధువులింట్లో వినోద్ ఉంటున్నాడని, అతడి భార్య విద్య పుట్టింట్లో ఉంటోందని పోలీసులకి చెప్పాడు.

సునీల్ ఇచ్చిన అడ్రస్ ద్వారా వినోద్‌ని పట్టుకున్నారు పోలీసులు. అయితే అతగాడు ఇంత గ్రంథం నడిచినా ఇంకా తన భార్యయైన విద్య చనిపోయిందనే చెబుతున్నాడు తప్ప చేసిన మోసాన్ని ఒప్పుకోవడంలేదు. అలాగే విద్య పుట్టింటి అడ్రస్ ఇవ్వడానికి కూడా అయిష్టత వ్యక్తం చేసాడు. చివరికెలాగో చెప్పేసరికి బొంబాయి పోలీసులు విద్యని కలుసుకుని ఆమెతోపాటుగా బొంబాయి క్రైమ్ బ్రాంచిలో అడుగుపెట్టారు.

పూర్ణ ఆరోగ్యంతో ఉన్న విద్యని, అతడి ముందుకు తీసుకువెళ్ళిన తర్వాత వినోద్ తన నేరాన్ని ఒప్పుకోక మరేం చేస్తాడు? తన దురదృష్టానికి ఏడవడం తప్పించి విద్యమట్టుకు ఏం చెయ్య గలుగుతుంది?

వినోద్‌ని అరెస్టు చేసి, అతడితో పాటు ఈ మోసంలో పాలుపంచుకున్న సునీల్, డాక్టరు తదితరులపై ఛార్జిషీటు తయారు చేయడంలో నిమగ్నమయ్యారు బొంబాయి పోలీసులు. ✪

ఆరోగ్యం

# సమతులాహారం



- ఎం. నీలిమ

మానవుడు భౌతికంగా, మానసికంగా ఆరోగ్యంగా ఉండాలంటే అన్ని పోషక విలువలు తగుపాళ్ళలో కలిసినటువంటి ఆహారాన్ని తీసుకోవటం తప్పనిసరి. ఈ ఆహార అవసరాలు మనిషి యొక్క వయస్సు, శరీర బరువు మరియు చేసే పనిని బట్టి మారుతుంటాయి.

స్థూలంగా పోషకాహార రకాలను, వాటి ఉపయోగాలను మరియు అవి దొరికే పదార్థాలను ఈ క్రింది విధంగా వివరించవచ్చు.

**1. పిండి పదార్థాలు:** ఇవి మానవునికి శక్తినిచ్చే ముఖ్యమైన కారకాలు. ఆహారంలో సింహ భాగాన్ని ఇవే ఆక్రమిస్తాయి. ఇవి గ్లూకోజ్‌గా మారి రక్తంలోనికి నేరుగా కలుస్తాయి. తద్వారా ముఖ్యంగా మెదడు కణాలకు మరియు రక్త కణాలకు తక్షణ శక్తినిస్తాయి.

ఇవి ముఖ్యంగా అన్ని రకాల ధాన్యాలు (బియ్యం, గోధుమలు,జొన్నలు, రాగి, సజ్జలు మొ။లగు వాటిలో), దుంపలలో (బంగాళాదుంప, కంద, చేమ మొ။లగు వాటిలో) మరియు చక్కెర, గ్లూకోజులలో లభిస్తాయి.

**2. మాంసకృతులు:** ఇవి ముఖ్యంగా పెరుగుదలకు మరియు పాడైన కణజాలాలను బాగుచేయడానికి పనికివస్తాయి. ఇవి రక్తంలో తయారుకావడానికి ఉపయోగపడతాయి. శరీరంలోని వ్యాధి నిరోధక కారకాలను కూడా పెంచుతాయి.

ఇవి పాలు, గ్రుడ్లు, మాంసము మరియు అన్ని రకాల పప్పుదినుసులలో (కంది, పెసర, మినుము, శెనగ మొ။లగునవి)లభిస్తాయి.

**3. క్రొవ్వు పదార్థాలు:** ఇవి మానవుని శరీరంలో క్రొవ్వుగా భద్రపరచబడి శరీరాన్ని చలి నుండి రక్షిస్తాయి. కొన్ని రకాల (ఎ,డి,ఇ,కె) విటమిన్లు, క్రొవ్వు పదార్థాలలో మాత్రమే కరుగుతాయి. కనుక ఆహారంలో క్రొవ్వు పదార్థాలు తక్కువ పాళ్ళలోనైనా తప్పనిసరిగా తీసుకోవాలి.

ఇవి అన్ని రకాల నూనెలు, నెయ్యి, జీడిపప్పు, నువ్వులు మొదలగు వాటిలో లభిస్తాయి.

**4. ఖనిజములు లేదా విటమిన్లు:** వీటిని తీసుకొనడం ద్వారా కొన్ని రకాల వ్యాధుల నుండి రక్షింపబడవచ్చు. జీవక్రియలు సక్రమంగా జరగడానికి ఇవి ఉపయోగపడతాయి. ఇవి శరీరానికి చాలా తక్కువ పాళ్ళలో అవసరమవుతాయి.

| విటమిన్లు | ఉపయోగము | దొరుకు పదార్థాలు |
|---|---|---|
| ఎ-విటమిన్ | కళ్ళకు రక్షణనిస్తుంది. రేచీకటి నుండి కాపాడుతుంది. | ఆకుకూరలు, కాలేయం, పాలు |
| బి-విటమిన్ | నోటిపూత మొదలగు వ్యాధుల నుండి రక్షణనిస్తుంది. పిండిపదార్థాలు జీర్ణం కావడం మరియు రక్తం తయారీలో ఉపయోగపడుతుంది. | తృణ ధాన్యాలు, గ్రుడ్లు, పప్పు దినుసులు |
| సి-విటమిన్ | స్కర్వీ మొదలగు వ్యాధుల నుండి రక్షణనిస్తుంది. శరీరానికి కావలసిన ఇనుమును త్వరగా గ్రహిస్తుంది. పళ్ళు, చిగుళ్ళను రక్షిస్తుంది. | ఉసిరి. నిమ్మ మొదలగు పులుపు పదార్థాలు |
| డి-విటమిన్ | కాల్షియంను గ్రహించి ఎముకల పటుత్వాన్ని పరిరక్షిస్తుంది. రికెట్స్ వ్యాధి నుండి రక్షిస్తుంది. | పాలు, గుడ్డుసొన, సూర్యరశ్మి |
| ఇ-విటమిన్ | ప్రత్యుత్పత్తికి అవసరము. వంధ్యత్వాన్ని నివారిస్తుంది. | మొక్కజొన్న, వెన్న,సోయాబీన్,జీడిపప్పు |
| కె-విటమిన్ | రక్తం గడ్డ కట్టడానికి ఉపయోగపడుతుంది. | కాలేయం, ఆకుకూరలు |

**5.లవణములు లేదా మినరల్స్:** శరీరానికి ఇవి కూడా తక్కువ పాళ్ళలో అవసరమవుతాయి. ఇవి వ్యాధి నిరోధక శక్తిని పెంచుతాయి. శరీరంలోని నీటి శాతాన్ని సమంగా ఉంచుతాయి. తద్వారా శరీరంలోని వ్యర్థ పదార్థాలను తొలగిస్తాయి.

| మినరల్ | ఉపయోగము | దొరుకు పదార్థాలు |
|---|---|---|
| ఇనుము | రక్తం పెంచుతుంది | పాలు,గ్రుడ్లు, ఆకు కూరలు, కాలేయం |
| కాల్షియం | పళ్ళను, ఎముకలను మరియు కండరాలను రక్షిస్తుంది. | పాలు,గ్రుడ్లు,మీగడ |
| సోడియం | నరాలకు బలాన్నిస్తుంది | ఉప్పు |
| అయోడిన్ | థైరాయిడ్ వ్యాధి రాకుండా కాపాడుతుంది | ఉప్పు |

**6.పీచుపదార్థాలు:** జీర్ణక్రియ బాగా జరిగేటట్లు చేస్తాయి. ఇవి సరిగా తీసుకొనకపోతే జీర్ణక్రియ మందగించి మలబద్ధకానికి తద్వారా ఇతర వ్యాధులకు దారితీస్తాయి. ఇవి చిక్కుళ్ళు, పొట్టు పదార్థాలు, దంపుడు బియ్యం, కూరగాయలు పండ్ల తొక్కలలో లభిస్తాయి.

**7 నీరు:** నీరు మన భోజనంలో అతి ముఖ్యమైన భాగం. రోజుకు ప్రతి ఒక్కరు కనీసం 8 నుండి 10 గ్లాసులు లేదా 2 నుంచి 1 1/2 లీటర్ల నీరు త్రాగాలి. నీరు త్రాగటం ద్వారా శరీరంలోని అన్ని క్రియలు బాగా జరుగుతాయి. శరీరంలోని వ్యర్థాలను తొలగిస్తుంది. శరీరంలోని తేమను రక్షిస్తుంది.

**ఒక భోజనంలో సగటు మానవుడు వివిధ పదార్థాలను క్రింది మోతాదులో తీసుకోవాలి.**

| పదార్థం | మోతాదు |
|---|---|
| ధాన్యాలు | 460 గ్రాములు |
| పప్పు | 40 " |
| కూరగాయలు | 60 " |
| ఆకుకూరలు | 50 " |
| దుంపలు | 50 " |
| పాలు | 150 " |
| నూనె మరియు క్రొవ్వు పదార్థాలు | 40 " |
| చక్కెర మరియు బెల్లం | 30 " |
| పీచు పదార్థాలు | 30 " |

**పేదవారు సమతులాహారం కోసం ఈ క్రింది నియమాలు పాటించవచ్చు**

1. జొన్న, సజ్జ, రాగి లాంటి చవకైన తృణధాన్యాలను మార్చి మార్చి లేక కలిపి వాడవచ్చు.
2. మునగ, ఆవిశలాంటి చవకగా దొరికే ఆకుకూరలను రోజు మార్చి రోజు వాడడం ద్వారా ఎ-విటమిన్, ఇనుము మరియు కాల్షియం లభిస్తాయి.
3. ధాన్యాలు,పప్పులు ఉదా॥జొన్నరొట్టెలు ఆకుకూర పప్పుతో కలిపి వాడడం ద్వారా బలవర్ధకమైన భోజనం అవుతుంది.
4. బొప్పాయి, మామిడి లాంటి ఆయా ఋతువులలో దొరికే పండ్లను తీసుకోవడం ద్వారా ఎ మరియు సి విటమిన్లు లభిస్తాయి.
5. ధాన్యాలను మొలకెత్తించడం, పిండి పులియబెట్టడం మరియు రాగిజావగా తయారు చేయుట ద్వారా పోషక విలువలను పెంచవచ్చు.
6. ఎండుచేపలు, ఎండు ద్రాక్ష మంచి పోషకాలను ఇస్తాయి.
7. కరివేపాకు, కొత్తిమీర లాంటివి పొడులుగా పచ్చళ్ళుగా భద్రపరుచుకోవచ్చును.
8. ఆహారాన్ని వేయించుట కన్నా ఉడకబెట్టడం ద్వారా పోషక విలువలను కాపాడవచ్చు.
9. పదార్థాలను నిల్వ ఉంచడం వలన వాటిలోని పోషక విలువలు తగ్గుతాయి.
10. బియ్యాన్ని పాలిష్ పట్టడం గట్టిగా పిసికి కడగటం మరియు గంజి వార్చడం వలన దానిలోని పోషక విలువలు తగ్గుతాయి..
11. పదార్థాలను మూతపెట్టి వండటం వలన పోషక విలువలను రక్షించవచ్చు.
12. కూరగాయలను కడిగిన తరువాత ముక్కలు చేయాలి. ముక్కలుగా తరిగాక కడుగకూడదు.
13. పండ్లను రసాలుగా త్రాగటం కంటే నేరుగా తినటమే మేలు.
14. చక్కెర బదులు వీలైనంత వరకు బెల్లం వాడాలి.
15. స్త్రీలు నెలసరి సమయంలో, గర్భిణీగా ఉన్నప్పుడు మరియు ప్రసవానంతరం మంచి పౌష్టికాహారం తీసుకుని తగ్గినన్ని నీళ్ళు త్రాగాలి.
16. పిల్లలకు నాలుగవ నెల నుండి మెల్లిగా పాలతో పాటు ఇతర ద్రవ, ఘన పదార్థాలను అలవాటు చేసి అన్ని రకాల కూరలు తినిపించాలి.

ఈ విధమైన సమతుల ఆహారాన్ని రోజు తీసుకుని, క్రమశిక్షణ కలిగిన, వ్యసనాలు లేని జీవితాన్ని ఆనందంగా గడపడం ద్వారా ఆరోగ్యాన్ని పరిరక్షించుకొనవచ్చు.

**(వ్యాసకర్త జిల్లా ప్రాజెక్ట్ మేనేజర్ -డిఆర్‌డిఎ-ఐకెపి, అనంతపురం)**

# ఉద్యమాల బాటలో

**సర్వేలో వెలుగులోకి వచ్చిన సమస్యలు:**

పశ్చిమ గోదావరి జిల్లాలో ఐద్వా గుండుగొలనులో బాలికల హాస్టల్ మరియు హైస్కూల్, దెందులూరు ప్రాథమిక ఆరోగ్య కేంద్రం, తాడేపల్లిగూడెం ప్రభుత్వ ఆసుపత్రుల్లో సర్వే చేసింది. జి. విజయలక్ష్మి, ఎ. అజయకుమారి, జి. విమల, విజయలతో కూడిన ప్రతినిధుల బృందం ఆధ్వర్యంలో జరిగిన సర్వేలో అనేక అంశాలు వెలుగులోకి వచ్చాయి.

గుండుగొలను బాలికల హాస్టల్‌లో 200 మంది బాలికలు నివాసముంటుంటే 12 గదులు మాత్రమే వున్నాయి. హాస్టల్‌లో ప్రత్యేకంగా స్వీపర్‌గాని, నైట్ వాచ్‌మెన్‌గానీ లేరు. నీటి వసతి సరిగ్గా లేకపోవడంతోపాటు బాత్రూమ్స్, టాయ్‌లెట్స్ చాలా అపరిశుభ్రంగా వున్నాయి. తలుపులు ఊడిపోయి, ఎవరూలేని సమయంలో ఆదరాబాదరాగా కాలకృత్యాలు తీర్చుకోవాల్సిన పరిస్థితి. శానిటేషన్ అధ్వాన్నంగా ఉండటంతో బాలికలు తరచు అనారోగ్యానికి గురవుతున్నారు. ఒక్కో విద్యార్థినికి రోజుకు 17-25 రూ॥లు మాత్రమే కేటాయించడంతో పోషకాహారంతోపాటు కనీస అవసరాలకు దూరమవుతున్నారు. బాలికల హాస్టల్స్‌లో భద్రతా సౌకర్యాలు పెంచడంతోపాటు భోజన ఖర్చులు మరియు కాస్మోటిక్స్‌కు కేటాయించే బడ్జెట్‌ను పెంచాలని ఐద్వా ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తోంది.

గుండుగొలనులోని హైస్కూల్ విషయానికొస్తే ఒకదాత స్కూలు కోసం 46 ఎకరాలు దానం ఇచ్చారు. అందులో 6 ఎకరాలు స్కూలుకు కేటాయించి 40 ఎకరాల భూమి సాగుచేస్తున్నారు. 950 మంది విద్యార్థులు ఇక్కడ చదువుతూ ఉంటే, 13 రూమ్స్ మాత్రమే వున్నాయి. మిగతా క్లాసులన్ని చెట్ల కిందనే నడుస్తున్నాయి. బోధనా సిబ్బంది భర్తీలతోపాటు స్వీపర్, నైట్ వాచ్‌మెన్, స్కావెంజర్ పోస్టులు ఖాళీగా వున్నాయి. వంట షెడ్ లేదు. పంట సొమ్ము జిల్లా పరిషత్ వద్ద వుంది. ఎన్నిసార్లు లెటర్స్ పెట్టినా, స్కూల్ అభివృద్ధికి డబ్బు కేటాయించడం లేదు. ప్రభుత్వం వెంటనే స్పందించి హైస్కూల్ అభివృద్ధికి చర్యలు చేపట్టాలని ఐద్వా కోరుతుంది.

దెందులూరు మండలంలోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రం పేరుకు 30 ఎకరాల ఆసుపత్రే. కానీ అక్కడ 10పడకలు మాత్రమే వున్నాయి. ఊరికి 1 1/2 కిలోమీటర్ల దూరంలో ఉండటంతోపాటు బాత్రూమ్స్, లావెట్రీస్ శుభ్రం చేసేవారు లేక ఆసుపత్రికి వచ్చిన పిల్లలకు అంటువ్యాధులు వస్తున్నాయి. ఆసుపత్రి స్కావెంజర్ పోస్ట్ ఖాళీగా వుండటంతోపాటు రోగి పరీక్షలకు అవసరమైన పరికరాలు కూడా లేవు. ప్రైవేటు కంపెనీల వద్ద మందులు కొని సప్లై చెయ్యాల్సిరావడం వల్ల రోగులకు అరకొర మందులే దొరుకుతున్నాయి. దెందులూరు ప్రభుత్వాస్పత్రికి అవసరమైన మందులు, సిబ్బంది, పరికరాలు మొదలైనవి సమకూర్చాలని ఐద్వా ప్రభుత్వాన్ని కోరుతోంది.

తాడేపల్లిగూడెం ప్రభుత్వాస్పత్రికి చుట్టుపక్కల 40 గ్రామాల నుండి రోగులు వస్తున్నారు. ఆర్థోపెడిక్, స్కానింగ్ డాక్టర్స్ లేకపోవడంతో ప్రైవేటు హాస్పిటల్స్‌కు వేలకు వేలు డబ్బు పొయ్యాల్సివస్తోంది. డెలివరి కోసం వచ్చిన వాళ్ళ వద్ద డబ్బుగుంజుతున్నారు. అవినీతి బాగా పేరుకుపోయింది. అవసరమైన మందులు అక్కడే ఇవ్వడంతోపాటు కొరతగా వున్న డాక్టర్ పోస్టులను వెంటనే భర్తీ చెయ్యాలి, బడ్జెట్ కేటాయింపులు పెంచాలి.

**నింగినంటిన పెట్రో ధరలు:-** జూన్ 25వ తేదిన పెట్రో ఉత్పత్తుల ధరలను కేంద్ర ప్రభుత్వం మళ్ళీ పెంచింది. యుపిఎ2 ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక ఈ ధరలను పెంచడం 8వ సారి. పెరిగిన డీజిల్, కిరోసిన్, గ్యాస్ ధరలతో మధ్య తరగతి పేద ప్రజానీకం అల్లాడుతున్నారు. పెంచిన పెట్రో ఉత్పత్తుల ధరలను వెంటనే వెనక్కి తీసుకోవాలనే ఐద్వా రాష్ట్ర కమిటీ పిలుపు మేరకు అన్ని జిల్లాల్లో కార్యక్రమాలు జరిగాయి. సిలిండర్‌లను పక్కకు పడవేసి రోడ్డుపైనే కట్టెల పొయ్యిలపై వంటలు వండుతూ వినూత్నరీతిలో మహిళలు నిరసన తెలిపారు.


నాగర్‌కర్నూల్

**బ్రతుకు భారం చేసిన ఆస్తిపన్ను:-** రాష్ట్ర ప్రభుత్వం ఆస్తిపన్నును విపరీతంగా పెంచింది. పట్టణ ప్రాంతాల్లో ప్రజలు ఈ భారాలను



మహబూబ్‌నగర్

మొయ్యలేమని అంటూ ఆందోళనా కార్యక్రమాలు చేపట్టారు. ఐద్వా అన్ని మున్సిపాలిటీల్లో పెంచిన ఆస్తిపన్నుకు వ్యతిరేకంగా మిగతా ప్రజా సంఘాలను కలుపుకుని ఆందోళన బాటపట్టింది. ప్రజల నుంచి సంతకాల సేకరణతోపాటు పోస్టుకార్డు ఉద్యమం చేపట్టింది.

**జెండా ఆవిష్కరణలు:-** ఐద్వా రాష్ట్ర మహాసభలు జూన్ 27నుండి 29వ వరకు ఖమ్మంలో జరిగిన సందర్భంగా మహాసభలు జయప్రదం చెయ్యాలని కోరుతూ జూన్ 24వ తేదిన రాష్ట్ర వ్యాప్తంగా జెండా


ఖమ్మం

ఆవిష్కరణలు జరిగాయి. ఈ సందర్భంగా మహిళా సమస్యలపై ప్రచారం చెయ్యడంతోపాటు ఖమ్మం బహిరంగసభకు పెద్ద సంఖ్యలో తరలిరమ్మని పిలుపునిచ్చారు.

**మహాసభ సన్నాహాలు:-** 12వ రాష్ట్ర మహాసభలను పురస్కరించుకొని


కడప

15,000 పోస్టర్లతో ప్రచారం నిర్వహించారు. అన్నిజిల్లా కేంద్రాలలో పోస్టర్ రిలీజ్ చేసి ప్రచారం చేపట్టారు.

**14 రకాల నిత్యావసరాల కోసం:-** నిత్యావసరాల ధరలు విపరీతంగా


నల్గొండ



హైదరాబాద్

పెరిగాయి. దానికి తోడు రేషన్ షాపుల్లో వస్తువుల సంఖ్య క్రమంగా కుదించబడుతున్నది. పేదవారికి ఆదరువుగా ఉన్న కిరోసిన్ రేటు పెంచి, కోటా తగ్గించారు. పామాయిల్ 4 నెలలుగా ఇవ్వడంలేదు. ఇచ్చే చక్కెర కూడా అర కిలోకి తగ్గింది. ఆధార్ కార్డుకు, రేషన్ కార్డుకు లింక్ చేసి ప్రజలను ఆందోళన పరుస్తున్నారు. ఆహార సబ్సిడీ స్థానంలోనే నగదు బదిలీ పథకాన్ని ప్రవేశపెట్టే ఆలోచన ప్రభుత్వం చేస్తోంది. పై ప్రభుత్వ వ్యతిరేక విధానాలను ఖండిస్తూ రేషన్ షాపుల ద్వారానే 14రకాల నిత్యావసరాలు సరఫరా చేయాలని ఐద్వా డిమాండ్ చేస్తోంది. ప్రజాపంపిణీ వ్యవస్థ పటిష్టం కోసం ఐద్వా కేంద్ర కమిటీ పిలుపు మేరకు రాష్ట్రంలో 15 జిల్లాల్లో కలెక్టర్ ఆఫీసుల ముందు ధర్నాలు చేసి కలెక్టర్లకు మెమోరాండం ఇచ్చారు.

**మహిళలపై దాడి:-** గుంటూరు జిల్లా సత్తెనపల్లి డివిజన్‌లో చౌటపాయ పాలెంలో ఐద్వా ఆధ్వర్యంలో మహిళలు బెల్టుషాపులను అడ్డుకున్నారు. అక్రమంగా విక్రయిస్తున్న మద్యాన్ని అడ్డుకుని షాపు తీసివేయాలని కోరారు. మహిళలు మద్యం అమ్మకాలను అడ్డుకున్నందుకు షాపు యజమాని రోకలిబండతో మహిళలపై దాడి చేశాడు. వెంటనే ఐద్వా ఆధ్వర్యంలో ప్రదర్శనగా వెళ్లి అధికారులను కలిసి షాపును ఎత్తివేయాలని, యజమానిని శిక్షించాలని డిమాండ్ చేశారు. మహిళల ఆగ్రహాన్ని చవి చూసిన మద్యం షాపు యజమాని ప్రస్తుతం అమ్మకాలు కొనసాగించడంలేదు.

**మా అమ్మమ్మ కథ:-** ఐద్వా రాష్ట్ర కమిటీ సభ్యులు ఎన్.ఎస్. లక్ష్మి దేవమ్మ రాసిన 'మా అమ్మమ్మ కథ' పుస్తకాన్ని జూన్ 26వ తేదిన జరిగిన ఐద్వా రాష్ట్ర కమిటీ సమావేశంలో ఐద్వా సీనియర్ నాయకురాలు టి.సి. లక్ష్మమ్మ గారు ఆవిష్కరించారు. అమ్మమ్మ కథతోపాటు లక్ష్మిదేవమ్మగారు వివిధ సందర్భాల్లో రాసిన అనేక



హైదరాబాద్

వ్యాసాలు కూడా ఈ పుస్తకంలో ముద్రించారు. పుస్తకంలో ఉదహరించిన అనేక ఘటనలు వాస్తవ రూపానికి ప్రతిబింబాలు. ఖచ్చితంగా నేటి యువతరానికి ఈ పుస్తకం మార్గదర్శకంగా నిలుస్తుందనడంలో సందేహం లేదు.




# ఆంధ్రప్రదేశ్ ఫుడ్స్

(ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వరంగ సంస్థ) An ISO 22000 : 2005 అనుమతి పొందిన ప్రామాణిక సంస్థ, ఐ.డి.ఎ. నాచారం, హైదరాబాద్ - 500 076.
ఫోన్: 040-27152207, 08, 09, ఫ్యాక్స్ : 040-27171596 email: apfoods@hotmail.com website:http//www.apfoods.apnic.in

**ఆంధ్రప్రదేశ్ ఫుడ్స్ (ప్రభుత్వ రంగ సంస్థ) ప్రభుత్వపరంగా సంచాలిత సంఘటిత శిశు వికాస ప్రణాళిక (ఐ.సి.డి.యస్.)లోని ప్రత్యేక పోషణ కార్యక్రమమైన పోషకాహార తయారీ మరియు సంఘంలో లీనమై ఉన్నది. లోప పోషిత బీద పిల్లలు, గర్భిణి స్త్రీలు మరియు బాలింతల యొక్క పోషకాహార అవసరాల నిమిత్తము ప్రతిరోజు దాదాపు 250 మెట్రిక్ టన్నుల వండుటకు సిద్ధముగా ఉన్న పౌష్టికాహారములను ఈ సంస్థ తయారు చేస్తున్నది. మరియు ప్రతి రోజు 32.5 లక్షల లబ్దిదారులు ఈ పౌష్టికాహారాన్ని సేవిస్తున్నారు. దిగువ తెలుపబడిన పౌష్టికాహారాలను ఏ.పి.ఫుడ్స్ తయారు చేస్తుంది.**

1. భుజించుటకు సిద్ధముగా ఉన్న మోడిఫైడ్ థెరాపెటిక్ ఆహారము ప్రతి 100 గ్రాములలో 13.9 గ్రామాంసకృత్తులు మరియు 420 కేలరీల శక్తి జనకములు అందజేస్తుంది.
2. వండుటకు సిద్ధముగా ఉన్న ఉప్మా మిశ్రమము ప్రతి 100 గ్రాములలో 14.4 మాంసకృత్తులు మరియు 420 కేలరీల శక్తి జనకకుములు అందజేస్తుంది.
3. వండుటకు సిద్ధముగా ఉన్న హల్వా మిశ్రమము ప్రతి 100 గ్రాములలో 12 గ్రా. మాంసకృత్తులు మరియు 432 కేలరీల శక్తి జనకములు అందజేస్తుంది.
4. భుజించుటకు సిద్ధముగా ఉన్న ఎక్స్‌ట్రూడెడ్ స్నాక్ ఫుడ్ ప్రతి 100 గ్రాములలో 12గ్రా మాంసకృత్తులు మరియు 400 కేలరీల శక్తి జనకములు అందజేస్తుంది.

మరియు రెండు రకములు ఆహార పదార్థములను 6.1.2011 రోజున గౌరవనీయులైన మహిళా శిశు సంక్షేమ శాఖ మంత్రివర్యులు శ్రీమతి వి.సునీత లక్ష్మారెడ్డిగారు విడుదల చేయుట జరిగింది.

1. వండుటకు సిద్ధముగా ఉన్న స్వీట్ పొరిడ్జ్ మిశ్రమము ప్రతి 100 గ్రాములలో 10.5 గ్రాముల మాంసకృత్తులు 440 కేలరీల శక్తి జనకములు అందజేస్తుంది.
2. వండుటకు సిద్ధముగా ఉన్న కిచిడి మిశ్రమము ప్రతి 100 గ్రాములలో 14 గ్రామముల మాంసకృత్తులు 427 కేలరీల శక్తి జనకములు అందజేస్తుంది.

పైన తెలుపబడిన అన్ని ఆహార పదార్థములు సూక్ష్మ పోషకాలైన విటమిన్ ఏ, బి1, బి2, సి. నియాసిన్, ఫోలిక్ ఆసిడ్ మరియు ఇనుము, కాల్షియం ఖనిజ లవణములతో బలపరచబడినవి. ఈ పోషకాహారాలు లబ్ధిదారుల ఆరోగ్య స్థాయిని మెరుగుపరుస్తాయి మరియు శరీరంలో ఇనుము ధాతువు లోపం వలన కలిగే రక్తహీనత అరికట్టబడుతుంది. ఈ ఆహారంలో గల కాల్షియం వలన ఎముకలు బలపర్చబడతాయి. పైన తెలుపబడిన ఆహార పదార్థాలను సేవించడం వలన లబ్దిదారులలో ఈ క్రింది స్థాయి లాభాలు చేకూర్చుతాయి.

## లఘుకాల లాభాలు :

1. సాంఘీకంగా ఆర్థికంగా అడుగున ఉన్న వర్గాలలో హీనపోషణ ఉన్న గర్భిణి స్త్రీలు, బాలింతలు మరియు 6 నెలల నుండి 6 సంవత్సరముల వయస్సు గల పిల్లలకు ఆహార మరియు పోషణ భద్రత కల్పించబడుతుంది.
2. గర్భిణి స్త్రీలు, బాలింతలు పిల్లలపోషణ మరియు ఆరోగ్య స్థాయిలో మెరుగుదల మరియు శిశు మరణాలు, ప్రసవకారణంగా జరిగే స్త్రీల మృతి సంఖ్య తగ్గుతుంది.
3. అంటువ్యాధుల నివారణకు తోడ్పడి వ్యాధి నిరోధక శక్తిని చేకూర్చుతుంది.

## దీర్ఘకాల లాభాలు :

1. తక్కువ బరువుతో పుట్టే శిశువుల సంఖ్య తగ్గుతుంది.
2. పిల్లలు మరియు తల్లులలో ఎదుగుదల, బరువు మరియు ఆరోగ్యాభివృద్ధి.
3. అదనపు ఆహార కార్యక్రమం ద్వారా స్థూల లబ్దిదారులు అంగన్‌వాడి కేంద్రానికి తరలిస్తారు మరియు ఐ.సి.డి.యస్. కార్యక్రమము యొక్క అదనపు లాభాలను పొందుతారు.
4. మంచి ఆహార పోషణ విధానాలను ప్రోత్సహించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనకాలం కలిగి, గృహ సామాజిక మరియు రాష్ట్రస్థాయిగా అభివృద్ధి చెందుటకు దోహదపడుతుంది.
5. ఐ.సి.డి.యస్.లోని అదనపు ఆహార సేవా కార్యక్రమములో లబ్దిదారులు ఎక్కువ సంఖ్యలో పాల్గొనడం జరుగుతుంది.
6. పిల్లలు అంగన్‌వాడి కేంద్రానికి తరలివచ్చి పౌష్టికాహారాన్ని సేవించడంలో ఇష్టపడుతున్నారు మరియు అంగన్‌వాడి కేంద్రంలో నేర్చు ప్రాథమిక శిక్షణను పొందుతున్నారు.

## ఈ పోషకాహారంలో సోయాచిక్కుడు చేర్చడం వలన కలిగే లాభాలు

★ ఏ.పి.ఫుడ్స్ ద్వారా తయారు చేసే ఈ ఆహార పదార్థాలలో సోయాబీన్ ఒక ముఖ్యమైన ముడి పదార్థము. సోయా చిక్కుడు సంతులిత పోషక విలువలు కలిగి ఉండి అన్నింటికంటే ఎక్కువ (40%) మరియు మెరుగైన మాంసకృత్తులు కలిగి ఉంది.

★ సోయ చిక్కుడులో శ్రేష్టమైన అమైనో అమ్లాలు కలిగి ఉండి గ్రుడ్లు, పాలలో లభించే మాంసకృత్తుల కంటే శ్రేష్ఠమైనది.

★ సోయ చిక్కుడు నూనెలో అత్యవసరమైన ఒమోగా 3 ఫ్యాటి అమ్లాలు ఉన్నాయి మరియు మోనో, పాలి అన్‌సాట్యురేటెడ్ మరియు సాట్యురేటెడ్ ఫ్యాటి అమ్లాములు యొక్క సరియైన నిష్పత్తిని కలిగి వుంది.

★ సోయాబీన్ అనునది లాక్టోస్ మరియు కొలెస్ట్రాల రహిత పదార్థము సోయాబీనులో పదార్థము శరీరానికి అత్యవసరమైన కాల్షియం మరియు ఇనుము ఖనిజలవణములున్నాయి.

★ సోయా మరియు సోయా మాంసకృత్తులలో మన శరీరానికి కావలసిన ఏంటి ఆక్సిడెంట్స్ మరియు భ్రాతపోషక పదార్థాలు మాంసకృత్తులు కలిగి ఉన్నవి.

★ కాన్సర్ రోగాలను అరికట్టే గుణాలు ఉన్నాయని నిర్ధారించారు మరియు ఇది స్త్రీ పురుషులలో వయసుకు దగ్గ ఎముకల అరుగుదలను తగ్గిస్తుంది.

★ దీనిలో ఉన్న తక్కువ గ్లైసమిక్ వలన మధుమేహంతో బాధపడుతున్న వారికి ఇది చాలా ఉపయోగపడుతుంది.

**పి.సత్యనారాయణరెడ్డి, ఐ.ఏ.ఎస్.,**
మేనేజింగ్ డైరెక్టర్



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A 132 |
| పుస్తకం పేరు | చైతన్య [illegible] |
| తారీఖు | 21/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | sandhya |
| పేజీలు విడదీసినది | sandhya |
| స్కాన్ చేసినది | sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |